# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



మే 1966






సంపుటము 43 : : సంచిక 5 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## మే 1966

# అమృతసీత
## (ఆవాహనము)

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

శ్రీరత్నగర్భ ధాత్రీదేవిగర్భమ్ము
తలిరించు మొదటి రత్నాలమొలక
ముక్కంటివేల్పుకార్ముక మెత్తుమగసిరి
కపురూపమై నిల్చినట్టి యువద
విశ్వదీపకులైన వేవెలుంగులవారి
కులమునే వెలిగించు క్రొత్త వధువు
కలిమిచే బలిసి వెక్కసమైన పదితలల్
మ్రొక్కనం గననట్టి ముద్దరాలు
ప్రభువు జేగురు కన్నుల వహ్నిసరసి
అరుణకమలమ్ములన్ నడయాడు హంస
దిశల కెగసిన యార్యసాధ్వీపతాక
అగపడుంగాక మాతల్లి అమృతసీత!

**2**

కోమలమ్ముగుండెలో కదలు ప్రేమజ్యోతి
యౌమించుపూబోణి యనగ దోచి
నల్లనల్లనియొఱగల్లపై తళ్కను
మేలిబంగరురేకవోలె వెలిగి
చీకటి చెట్టుపై చిగురుకొమ్మ నెసంగు
తలిరాకు మిసమిస లొలుక నిల్చి
గమగమవలచు నగరుధూపపుం జెంత
దీపశిఖాస్ఫూర్తి తేజరిల్లి
చూడ చూడగ నా కంటి జాడలందు
జలధర శ్యామసుందరస్వామి రామ
విభునిచెంగట పచ్చనివెలుగుతీగ
జనకు కన్నులవెన్న దర్శనము నిడుత!

**3**

రెండే రెండగు నక్షరాలు భరతోర్వీపుణ్యరేఖల్ పయో
భాండమ్ముల్ నరలోకసచ్చరితదీపస్తంభముల్ దూరభూ
ఖండ ప్రాజ జనాభినందిత వచఃకర్పూర నీరాజితా
ఖండ ఖ్యాతము లౌర 'సీత' యను నాఖ్యన్ తీపి యేమున్నదో

**4**

మంచుచే సుంత తడిసిన మల్లెపూవు
అమల హాసమ్మునన్ తడియైన కనులు
అదరి పరికించు నాశ్రమహరిణకమ్ము
తలపునకువచ్చు సీతమ్మ దలచినంత

**5**

మా గోదావరి నీలి నీలి యలలం బ్రత్యక్షమౌ రామ
తా గాథల్ రసరాజ్యడోలికలు చిత్తప్రీతికృన్మాలికల్
ఆగఃకారి దశానన ప్రకట సంహారోచ్ఛిఖా జ్వాలికల్
శ్రీగంధోపమ రామరాజ్య సితకీర్తి వ్యాప్త దిక్పాలికల్

**6**

గౌతమితల్లి నీ కథల కన్నుల జూచెను నీ పవిత్ర రా
గాతిశయమ్మునందు కుసుమాంజలి రాల్చెను వృక్షపంక్తులన్
ఆతత కష్టకాలమున నశ్రులు జార్చెను శీకరాకృతిన్
సీతమరో! నినున్ మరువనేరము తెల్గుల యాడుబిడ్డవో!

**7**

కనులం గాల్వలు కట్టకే మనసు చెంగల్వల్ ప్రకంపించి, చి
వ్వున క్రొందేనియ యూట లెత్తకయె మేన్ పుల్కమ్ములం దాల్పకే
జననీ! నీ కరుణైక ముగ్ధకథ నాస్వాదింపగా లేము ఎం
తని యార్ద్రాత్మను పిండి మౌని భవదీయాఖ్యానముం బల్కెనో!

**8**

పాయక సర్వ భారతము ప్రాణముపెట్టి ముని ప్రణీత రా
మాయణముం భజించు ననుమాట యథార్థమె—కాని ఆంధ్రులో
స్వీయ గృహాధిదైవముల జేసిరి మిమ్ముల మాదు రామ భ
క్త్యయుతవైజయంతికలు త్యాగయ, గోపన, భద్రశైలముల్.

## 9

ఇది యెదియో చరాలు మని ఈయెద మిన్నున వెల్గిపోవుచు
న్నది; హృదయమ్ము పద్మమయి యల్లన నొక్కొక రేకు విప్ప నం
దుదిత మనోజ్ఞ కాంచన మయోజ్జ్వల పీఠిక కొల్వుతీరు సం
పదల వెలంది నా వరలు మంగళమూర్తి యొకండు పొల్చెడిన్.

## 10

రావమ్మా రఘునాథ జీవన కథా ప్రస్యంది మాధుర్యమా!
సేవా దీక్షిత లక్ష్మణాక్షియుగ సాక్షీ భూత పాదాంబుజా!
ఆవిర్భూత విదేహరాజ హృద యాధ్యాత్మ స్ఫురద్దీపికా!
రావమ్మా, ప్రథమావతార కవితా రంగైక సంజీవనీ!

## 11

తొలికవి ధ్యాన ధారలను దోగిన యాత్మకళారహస్య సం
కలిత సుధాయిత ప్రథమపాకావ్యరసోజ్జ్వల దివ్యమూర్తివై
తలపున నిల్చి నాదు కవితా మృదు పుష్ప సుగంధ మన్ని ది
క్కులల వెలయింపుమమ్మ జనకోటిమనమ్ముల చెమ్మలూరగా.

## 12

ఈ వీణం బలికించు తల్లికొసవ్రే ళ్లీనాడు సోకెన్ గృపా
కైవల్యమ్మన మెల్ల మెల్ల నను దీగల్ మీటి పీయూష గీ
తావిర్భూతిని నించు పూర్వకృత పుణ్యోఘమ్ము మాకందముల్
పూవుల్ పూచి ఫలించు జన్మ కిది చాలున్ నాకు వే యేటికిన్.

---



# సెక్యులరిజం - 2

## శ్రీ ఎం. సి. సెటల్వాడ్

(గతసంచిక తరువాయి)

భారతదేశంలో బ్రిటిష్‌వారు దాదాపు రెండు వందల సంవత్సరాలపాటు పరిపాలన సాగించివున్నారు. కాబట్టి వారి పరిపాలనలో ఏమి జరిగిందో కూడా పరిశీలించడం ఇచ్చట ఉపయోగకరంగా ఉంటుంది. వివిధ మతాలను రక్షించడం విషయంలో బ్రిటిష్‌వారు కూడా భారతదేశపు పూర్వపు పాలకులనే అనుసరించారు. మత సంస్థలకు వీరు కూడా అనేకమైన దానాలుచేశారు. అయితే మతం విషయంలో ఎటువంటి ప్రమేయం పెట్టుకోలేదు. తటస్థంగా ఉంటూవచ్చారు. వారిది క్రైస్తవ ప్రభుత్వం గనుక, బ్రిటిష్‌వారు యీ దేశంలో మిషనరీలను బలపరిచారు; ప్రోత్సహించారు. అది నిజమే. భారతదేశంలోకూడా చర్చిని నెలకొల్పారు. అదీ నిజమే. అంతేగాని, వారు మతానికి సంబంధించిన విషయాలలో ఎప్పుడు వేలుపెట్టలేదు. తటస్థంగానే వున్నారు. వారు అట్లా ఉన్నందు వల్లనే భారత రాజ్యాంగ నిర్మాతలకు 'సెక్యులర్' రాజ్యాన్ని స్థాపించడం ఆ తర్వాత తేలికపని అయిపోయింది.

'సెక్యులర్ రాజ్యం' అన్న భావం అభివృద్ధి చెందడానికి, అది ఫలవంతం కావడానికి భారతదేశం జాతీయవాదమే, జాతీయ ఉద్యమమే పెద్ద కారణం. ఈ ఉద్యమంలో హిందూమతాన్ని గట్టిగా విశ్వసించినవాళ్లు, హిందూధర్మాన్ని తిరిగి నాల్గుకాళ్ల మీదను నిలబెట్టవలెనన్న పట్టుదలగలవాళ్లూ కూడా పాల్గొన్నారు. నాయకులు కూడా ఉన్నారు. అయితే పాశ్చాత్యదేశములయందలి లిబరలిజంతో అత్యంతము పరిచయంకల్గిన నాయకులు కాంగ్రెస్‌లో ఉన్నందువల్ల మతసంబంధదూరగమైన పద్ధతే కాంగ్రెస్‌లో ప్రోత్సహింపబడింది. కాంగ్రెస్ జరిపిన పోరాటంలో పాశ్చాత్య దేశాల లిబరలు భావాలు, బ్రిటిష్ సంప్రదాయపు లక్షణాలు ప్రబలి మతంపట్ల గూడా ఏవంవిధమైన వైఖరే అవలంబించబడింది. స్వాతంత్ర్యోద్యమం నాయకులు సెక్యులర్‌పద్ధతి జీవితమార్గాన్ని గూర్చి అధికంగా ప్రచారం చేశారు. ఆ భావాన్ని ప్రజలకు నూరిపోశారు. ఇన్ని కారణాలవలన మతం అన్నది వ్యక్తియొక్క అంతరాత్మకు సంబంధించిన విషయం మాత్రమేనన్న భావం ప్రజలలో ప్రబలం అయింది.

ఇక్కడ గాంధీ, నెహ్రూలు అనుసరించిన పద్ధతులను పరిశీలన చేయడంకూడా బాగుంటుంది. వీరి మార్గాలు భిన్నాలు. లక్ష్యం ఒక్కటే. అన్ని మతాలు యథార్థమైనవని గాంధీ విశ్వాసం. అన్ని మతాలలోని సారాన్ని పిండి విశ్వ సంబంధమైన మతాన్ని నిర్మించాలని ఆయన చెబుతూ వచ్చారు. ఈ కారణం ఇట్లా ఉన్నప్పుడు, రాజ్యం అన్నది అన్ని మతాలను సమదృష్టితో చూడవలసి వుంది. మత సంబంధమైన సత్యంలోవుండే ప్రగాఢమైన విశ్వాసంతో గాంధీ తన మార్గాన్ని నిర్మించుకున్నారు. "గాంధీ మతంలో గట్టినమ్మకం ఉన్నవారు. అది ఆయన ఆలోచనకు పునాది. అన్ని మతాలు సత్యమైనవేనని ఆయన నమ్మారు. ఈ విశ్వాసంలోనికి అతికే విధమైన రాజ్యాంగపు సిద్ధాంతాన్ని ఆయన అవలంబించారు. నెహ్రూకేమో

మతంలో నమ్మకంలేదు. ఆయన ఆలోచనాధారకు సెక్యులర్ రాజ్యాంగ పద్ధతి పునాదిగా ఏర్పడింది. కార్యవాదియైన రాజకీయనేత్త, మేధావి, నాయకుడు అనుసరించే మార్గం ఇదే. అందువల్ల ఆయన మత స్వాతంత్ర్యాన్ని అంగీకరించవలసి వచ్చింది. ప్రజాస్వామ్య వ్యవస్థకు నష్టం వాటిల్లజేయని పద్ధతిలో అన్ని మతాలకు స్వాతంత్ర్యాన్ని ఆయన ఆమోదించారు. అనగా సెక్యులర్ రాజ్యాన్ని ఆమోదించారని అర్థం."[1] అధునాతన ప్రజాస్వామ్య ధర్మాచరణానికి సెక్యులర్ రాజ్యం అన్నది పంచ ప్రాణాలతో సమానమని నెహ్రూ నమ్మారు.

బ్రిటిష్‌వారు భారతదేశంలో ఒక పని చేశారు. వేరు వేరు మతాలకు వేరు వేరు నియోజకవర్గాల పద్ధతిని వారు ఏర్పాటు చేశారు. ప్రత్యేక నియోజకవర్గాలపద్ధతిని అమలులోకి తెచ్చిపెట్టారు. ఈ కారణంచేత వేరు వేరు మతాలవారు, వేరు వేరు కులాలవారు, వేరు వేరు రాజకీయపక్షాలను ఏర్పాటు చేసుకున్నారు. ఇందుకు బ్రిటిష్‌వారి ప్రోత్సాహం కూడావుంది. ఫలితం, దేశంలో మత, దురభిమానాలు అధికమైనాయి.జాతీయవాదులలో సెక్యులర్ లక్షణం బలపడడానికి కూడా ఈ పద్ధతి కారణం అయింది. మతంతో సంబంధంలేని దృక్పథం జాతీయవాదంలో ప్రబలమైంది. ఏమైనా ఈ పద్ధతులవలన బ్రిటిష్‌వారు దేశాన్ని రెండుగా చీల్చగల్గారు. దేశం విభక్తమైంది. ఇందువల కూడా భారతదేశంలో 'సెక్యులరిజం' ఎంత అవసరమైనది సువిదితం అయింది. ఈ దేశంలో ఉంటున్న ఒకానొక మతానికి చెందినవారు ప్రత్యేకరాజ్యం కావాలని కోరుకుని విడిపోయారు. దేశం విభక్తం అయితే అయింది, స్వతంత్ర భారతదేశంలో ముస్లింలు ఇంకా అనేకమంది ఉన్నారు. దేశం జనాభాలో 10 వ వంతు ముస్లింలు. వీరంతా భారతదేశం పౌరులుగా ఉంటున్నారు. ఈ పరిస్థితిలో భారతదేశానికి సెక్యులర్ రాజ్యాంగం వినా ఇంకో మార్గం లేదు. ఈ రాజ్యాంగంలో అన్ని మతాలకు స్వాతంత్ర్యంవుంది. అది సమానమైన స్వాతంత్ర్యం. అందులో ఎక్కువ తక్కువలులేవు. పౌరులకు అందరికీ సమానమైన హక్కులు ఉన్నాయి. వివిధ మతాలు ఉన్నప్పటికీ, ఆ అన్ని మతాలతోను భారతదేశం ఒక్క జాతిగా రూపొందడం అన్నది ఆవశ్యకమైపోయింది.

దేశంలో సెక్యులరిజంకు సంబంధించిన భావాలను సెక్యులర్‌రాజ్యానికిసంబంధించిన సిద్ధాంతాలను జాతీయ స్వాతంత్ర్య ఉద్యమం ప్రచారం చేసిందనడానికి 1931 లో కరాచీకాంగ్రెసులో ఆమోదింపబడిన తీర్మానమే గురు. మత సంబంధమైన అభిప్రాయాలన్ను స్వతంత్రంగా వ్యక్తం చేసుకోవచ్చునని, అల్ప సంఖ్యాకులకు సంపూర్ణమైన రక్షణ ఉంటుందని స్పష్టం చేయడమేగాక, "అన్ని మతాలపట్లను రాజ్యం తటస్థంగా ఉండాలి" అని ఆ తీర్మానంలో ఖచ్చితంగా విశదం చేయబడింది. ఆ తర్వాత సుమారు ఇరవై సంవత్సరాల అనంతరం మతానికి సంబంధించిన తటస్థ వైఖరిని రాజ్యాంగంలో ఉదహరించినప్పుడు భారత రాజ్యాంగ నిర్మాతలు అనుసరించిన పద్ధతియేమో అవగాహన చేసుకోవాలంటే, అందుకు కీలకం అంతా యీ కరాచీతీర్మానంలోనే వుంది.

రాజ్యాంగ నిర్మాణ పరిషత్తులో అప్పుడు జరిగిన చర్చలను చూచినా, మతంనుంచి రాజ్యాన్ని పూర్తిగా పృథక్కరణం చేయడం అన్నది రాజ్యాంగంలో ఉద్దేశింపబడలేదని,మతాలపట్ల రాజ్యం, లేక ప్రభుత్వం తటస్థమైన వైఖరిని అవలంబించడం అన్నదే అందులో పునాది చెప్పబడినదని విదితం అవుతుంది. ఇందులో అన్ని మతాలకు స్వాతంత్ర్యము ప్రసాదించడం జరిగింది. మత సంబంధమైన అల్ప సంఖ్యాకులకు సమాన స్థితి సమకూర్చబడింది. రాజ్యాంగం నిర్మాణదశలో ఉన్నప్పుడు 'సెక్యులర్' రాజ్య ఆదర్శాన్ని గురించి, మత విషయాలలో తటస్థంగా వుండే రాజ్య ఆదర్శాన్ని గురించి తరచు మాట్లా

1. Donald Smith; Nehru and Democracy: Political Thought of an Asian Democrat, PP 156.

డమేగాక, శ్రీ నెహ్రూ, ఆయన సహచరులు, యీ ఆదర్శాన్నే అంటిపెట్టుకు ఉంటున్నట్టుకూడా విశదం చేయబడుతూ వచ్చింది.

రాజ్యాంగంలో 25 (1) అధికరణంలో మత స్వాతంత్ర్యానికి సంబంధించిన వివరాలు ఉన్నాయి. అయితే ఈ మత స్వాతంత్ర్యం సభ్య ప్రవర్తనకు విరుద్ధంగా, శాంతి భద్రతలకు భంగకారిగా, నీతికి దూరంగా, ఆరోగ్య సంబంధమైన విషయాలకు వ్యతిరిక్తంగా ఉండకూడదని యీ అధికరణం విశదం చేసున్నది. రాజ్యాంగంలో ప్రజల ప్రధానాధికారాలకు, హక్కులకు సంబంధించిన అంశాలుఉన్నాయి. వానికి కూడా యీ మత స్వాతంత్ర్యం విరోధంకారాదు. భారత రాజ్యాంగం ప్రకారం వ్యక్తి స్వాతంత్ర్యం అన్నది స్థూలంగా రెండు ముఖ్య విషయాలకు లోగి ప్రవర్తిల్లవలసి ఉంది. (1) మతంతో సంబంధంవున్న సెక్యులర్ కార్యకలాపం వ్యవహారంతో శాసనాలు చేసే హక్కు ప్రభుత్వానికివుంది. సంఘ సంస్కరణను, సంక్షేమాన్ని ఆశించి ప్రభుత్వం శాసనాలు చేయవచ్చు. హిందూమత సంస్థలు ఉన్నాయంటే, వానిలో హిందువులలో అన్ని విభాగాలకు చెందిన వారికి ప్రవేశం ఉండే విధంగా శాసనాలను చేసే హక్కును కూడా ప్రభుత్వం పుచ్చుకుంది. ఇట్లా శాసనాలు చేసినప్పుడు, ఆ శాసనాలు మత సంబంధమైన నమ్మకాలకు, ఆచారాలకు ప్రతిబంధకంగా ఉండవచ్చు, ఫరవాలేదు. 26 వ అధికరణం మత స్వాతంత్ర్య వ్యవస్థానాలను గురించి చెబుతున్నది. ప్రతి మతమున్ను మత సంబంధమైన సంస్థలను పెట్టుకోవచ్చు; నిర్వహించుకోవచ్చు. మత ప్రయోజన సాధన కోసం యీ సంస్థలద్వారా పని చేసుకోవచ్చు. మతానికి సంబంధించిన వ్యవహారాలను వీని ద్వారా చూచుకుంటూ ఉండవచ్చు. అయితే మత సంస్థలకు సంబంధించిన ఆస్తులువుంటే ఆ ఆస్తుల నిర్వహణం అంతా ప్రభుత్వం చేసిన శాసనాల ప్రకారమే జరగాలి. మతాదాయాలకు, మతసంస్థలకు సంబంధించి శాసనాలను చేసే అధికారాన్ని కూడా రాజ్యాంగం ప్రభుత్వానికి ఇచ్చింది. మతం నుంచి, మత శాఖలనుంచి రాజ్యాన్ని పృథక్కరణం చేస్తూ ప్రపంచింపబడిన సిద్ధాంత ప్రపంచానికిన్నీ, ఇక్కడ చెప్పబడిన విషయాలకున్ను తేడా వుంది. భారత రాజ్యాంగంలో యీ అంశాలు వైయక్తికమైన, వ్యవస్థాగతమైన, అనగా వ్యష్టి సమష్టియైన మత స్వాతంత్ర్యాన్ని హద్దుల్లో పెట్టేందుకు వీలుగా ప్రభుత్వానికి అధికారాన్ని సమకూర్చి పెడుతున్నాయి. ఇదే ఆ తేడా. ఇదే ఆ మార్పు. ఈమార్పు గమనించదగింది. హిందువులల్లో ప్రధాన వర్గాలకు చెందినవారి మత సంబంధమైన ఆచారాన్ని త్రోసివేసి, రాజ్యాంగం ధైర్యంతో, అస్పృశ్యతను నిషేధించింది. అది ఏ రూపంలో సాగుతూవున్నా సరే పనికిరాదు అన్నది. ఏ మతంయొక్కగాని, లేక మతవిభాగంయొక్కగాని అభివృద్ధికి, సంరక్షణకు గాను పన్నులు విధించి, ఆ పన్నులను అందు నిమిత్తం వాడే పద్ధతులను గూడా రాజ్యాంగం నిషేధించింది. అటువంటి పని చేయరాదన్నది. ఉన్న ఎన్ని మతాలు ఉన్నాయి, ఆ అన్ని మతాల ఉపయోగం కోసం పన్నులను విధించడం అన్న విషయం కూడా ఇక్కడ ఉద్దేశింపబడి వుంది. ప్రభుత్వంవారు పూర్తిగా తమ స్వంత నిధులతో నడిపించే యే విద్యా సంస్థలోగాని, మతసంబంధమైన విద్యలను అధ్యాపనం చేయించకూడదు. ఈ రకమైన అధ్యాపనాన్ని కూడా రాజ్యాంగం నిషేధిస్తున్నది. ప్రభుత్వ సంబంధమైన యే విభాగంలోగాని మంతపేరుచెప్పి విచక్షణ చేయడం, ముఖ్యంగా ఉద్యోగాలు ఇవ్వడం విషయంలో మతాన్ని పట్టించుకొనడం రాజ్యాంగానికి విరుద్ధం అని విశదం చేయబడింది. మత సంబంధమైన అల్ప సంఖ్యాక వర్గాలవారు ఉన్నారంటే, వారు తమ యిష్టం వచ్చిన రీతిని విద్యా సంస్థలను నెలకొల్పుకోవచ్చు; నిర్వహించుకోవచ్చు. ఒక అల్ప సంఖ్యాక వర్గం అధీనంలో ఉన్నదని చెప్పి, అటువంటి విద్యా సంస్థకు సహాయం చేయడం విషయంలో ప్రభుత్వం

విచక్షణ చూపించరాదని రాజ్యాంగం స్పష్టంగా చెబుతున్నది.

ఇవిగాక రాజ్యాంగంలో ఆదేశసూత్రాలని ఉన్నాయి. దేశంలో పౌరులైన అందరికి ఏకవిధంగా 'సివిల్‌కోడ్'ను సాధించి అనువర్తింపజేయడం ప్రభుత్వ విధానంయొక్క లక్ష్యం అయి ఉండాలని యీ సూత్రాలు చెబుతున్నాయి. ఈ లక్ష్యంవల్ల ఒక్క విషయం స్పష్టంగా తేలుతున్నది. పౌర సంబంధమైన ఎటువంటి శాసనాలను ప్రభుత్వం చేసినా అవి ఏకవిధంగా అందరిపట్లను అనువర్తిస్తాయి. ఇక్కడ వారి మతం ఏమిటన్న సమస్యలేదు.

రాజ్యాంగంలోవున్న ఈ విషయాల సారాంశం యీవిధంగావుంది. దీనివలన భారతరాజ్యాంగం "సెక్యులర్" రాజ్యాన్ని ఉద్దేశిస్తున్నట్లు చెప్పడానికి వీలు కలు తున్నదా? "సెక్యులర్ రాజ్యం" అని చెప్ప దగిన దానికి ఉండవలసిన ప్రాతిపదిక ధర్మం ఇక్కడ కన్పించడంలేదు. చర్చిని, రాజ్యాన్ని ఒక దానినుండి ఒక దానిని పృథక్కరణం చేయడం అన్నది ఇచ్చట పూర్తిగా లోపించింది. భారతదేశంలో ప్రామాణిక మైన 'చర్చి' అంటూ ఏమీలేదు. ఇచ్చట అన్ని మతాలకు సమాన ప్రతిపత్తి సంకల్పించబడింది. అన్ని మతాలకు సమాన ఛాయా సమకూర్చబడింది. పరిస్థితి ఇటూ వున్నప్పుడు, భారతదేశాన్ని 'సెక్యులర్ రాజ్యం" అనడం సరియైనమాటకాదు. అయితే మనదేశంలో నాయకులైనవారు శ్రీ నెహ్రూతోసహా మన రాజ్యాన్ని "సెక్యులర్ రాజ్యం" అంటూ వచ్చారు. ఈ రాజ్యాన్ని అట్లా అని వర్ణనచేస్తూ వచ్చారు. అటూ అనడం సరికాదని శ్రీ నెహ్రూకు తెలుసు. 1954 లోనే శ్రీ నెహ్రూ "మన రాజ్యాన్ని "సెక్యులర్" అన్నమాటతో వరించడం సుఖతర మైన విషయం" కాకపోవచ్చునన్నారు. అంతకన్నా మంచి మాట దొరక్క ఆ మాటనే వాడటం జరుగు తున్నదన్నారు. డా. రాధాకృష్ణన్ కూడా "భారత దేశంలో మత విషయకంగా చెలు బడి అవుతున్న నిష్పక్షపాత వైఖరిని, "సెక్యులరిజం"తోగాని, నిరీశ్వరత్వంతోగాని కలిపి గందరగోళం చెయ్య కూడదు. సెక్యులరిజం అన్నమాటకు ఇచ్చటవున్న నిర్వచనం, అనాదిసిద్ధంగా భారతదేశంలో చెల్లుతున్న పురాతమతసంప్రదాయాలకు పూర్తిగా అనుగుణ మైనటువంటిది" అన్నారు.[2] రాజ్యాంగాన్ని గూర్చి చర్చ జరిగిన రోజులో ఏమి జరిగిందో చూచినా ఇది ఇట్లాగేనని తేలుతుంది. ఆ రోజులో రెండు సార్లు "సెక్యులర్" అనే మాటను రాజ్యాంగంలో ఉట్టంకింపచేయాలని ప్రయత్నాలు జరిగాయి. ఆ రెండు ప్రయత్నాలు విఫలం అయినాయి.

ఇట్లా అని భారతదేశంలోని రాజ్య వ్యవస్థలో "సెక్యులర్ రాజ్యం" అన్న దానిలో ఉండవలసిన లక్షణాలు ఏమాత్రం లేవని అర్థంకాదు. ఆ లక్షణాలు ఉన్నాయి. ఉండటంలో కూడా ముఖ్యమైన లక్షణాలు ఉన్నాయి. మతానికి, రాజ్యానికి మధ్య ఇచ్చట అభేద్య మైన కుడ్యం నిర్మించబడలేదు. అది నిజమే. కాని మతంపట్ల ఉదారమైన తాటస్థ్యం వహించబడు తున్నది. అన్నిమతములపట్ల సమబుద్ధి ప్రదర్శితం అవుతున్నది. వ్యక్తికి మతం విషయంలో ఎక్కువ అయిన స్వాతంత్ర్యం సమకూర్చబడింది. అదేవిధంగా మత విభాగాలకు కూడా, సమాజ శ్రేయస్సుకు భంగపాటు కల్గనివిధంగా విస్తృతమైన స్వాతంత్ర్యం వుంది. ఇక పౌరునికి, రాజ్యానికి వుండుకున్న సంబంధాల విషయం పరిశీలనచేస్తే, ఇచ్చటకూడా అందరిపట్ల ఏకవిధంగా వ్యవహరించడము, మతం కారణంగా విచక్షణ చూపకపోవడము అన్న విష యాలు ఉన్నాయి. ఇప్పుడు భారతదేశం "సెక్యులర్" రాజ్యమా? అన్న ప్రశ్న ఉదయించిందే అనుకోండి; అందుకు ఒక ప్రముఖ పాశ్చాత్య రాజకీయ సిద్ధాంతి ఇట్లా సమాధానం ఇచ్చి ఉన్నాడు.

---

2. Recovery of Faith: P. P 202; Quoted from Ved Prakash Luthera; 'The Concept of Secular State and India' 1964, PP. 165.

"నన్ను సమాధానం అడిగితే "అవును" అంటాను. కాని ఆ "అవును" కు ఒక విశేషణం వుంది. భారతదేశాన్ని 'సెక్యులర్' రాజ్యం అనడం అర్థంతో అన్నమాటే అవుతుంది. భారతదేశాన్ని ప్రజాస్వామ్యం ఎటా అంటున్నామో, అదేవిధంగా 'సెక్యులర్' రాజ్యం అని గూడా అనవచ్చు. ఈ రెంటా అర్థం ఒక్కటే; రాజకీయాలలోను, ప్రభుత్వంలోను కూడా కొన్ని ప్రజాస్వామ్య ధర్మ విరుద్ధమైన లక్షణాలు ఉన్నప్పటికి భారతదేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పని చేస్తున్నది. మంచి ఉమ్మస్సుతో పని చేస్తున్నది. 'సెక్యులర్' రాజ్యం కూడా అదేవిధంగా పని చేస్తున్నది. ఈ లక్ష్యము, యీ ఆదర్శము రాజ్యాంగంలోనే ఇముడ్చబడిఉన్నాయి. ఆ ఆదర్శము, ఆ లక్ష్యము గట్టిగా అమలు జరుప బడుతున్నాయి. ఇక్కడ ఈ సమస్యను అర్థం చేసు కొనడానికి ఒక పద్ధతివుంది. ఈ రాజ్యం చైతన్యంతో ఉరకలు వేస్తున్నది. అయితే, గతంనుంచి వచ్చిన కొన్ని సమస్యలు ఇచ్చట సంప్రాప్తం అయివున్నాయి. ఇవి కష్టమైన సమస్యలు. వానిని అధిగమించడానికి కూడా గటి ప్రయత్నం జరుగుతున్నది. ఆ ప్రయత్నం సరియైన పద్ధతులలో జరుగుతున్నది."[3]

"సెక్యులర్ రాజ్యం" అనే మాట ఏ అర్థాన్ని చెబుతుంది అంటే, మతానికి సంబంధించిన వ్యవ హారాలలో రాజ్యంయొక్క లక్షణాన్ని, నడతను గురించి చెబుతుంది. 'సెక్యులరిజం' అంటే అర్థం వేరు. సాంఘికము, రాజకీయముఅయిన సర్వ జీవిత దృక్పథంలోను 'సెక్యులర్' వైఖరి విద్యమానం కావడం అని ఇక్కడ అర్థం చెప్పుకోవాలి. అయితే ఇక్కడ కూడా మతం విషయంలో పౌరజనుని వైఖరి, దృక్పథము కూడా వ్యజ్యమానం అవు తాయి. ఈ రెండు భావాలు ఇట్లా వేరు వేరు విషయాలను గురించి చెప్పడానికి ఉద్దేశింపబడినట్లు ఇచ్చట వ్యక్తం అవుతున్నది. ఒక రాజ్యం, అచ్చ మైన సెక్యులర్ రాజ్యం అయినప్పుడు, ఆ రాజ్యం యొక్క విధానం వలన మత సంబంధమైన విష యాలలో ఎంతమాత్రం జోక్యం చేసుకొనరాని కారణం ఉన్నప్పుడు, అప్పుడు ఆ రాజ్యం, ప్రజలలో సాంఘిక విషయాలపట్ల, రాజకీయ సమస్యలపట్ల సెక్యులర్‌దృష్టి ఏర్పడేట్లు చేయడంలో తాను చేత కానిదై, ఆ ప్రజలచేత మతాన్ని, ఆ మత సంబంధ మైన కార్యకలాపాలను పరిమితమైన పరిధిలో నిర్వ హింపబడేట్లు చేయలేనిదైపోతుంది. అంతేగాక, అచ్చమైన సెక్యులర్ రాజ్యానికి, మతంతో ఏ రకమైన సంబంధంగాని ఉండేందుకు వీలులేదు గనుక, ఆ రాజ్యం మతంనుంచి అన్నివిధాలుగాను దూరంగా వుంటుందిగనుక, భారతదేశంవంటి దేశంలో విద్యకు, సంస్కృతికి ప్రోత్సాహాన్ని చేకూర్చలేని స్థితిలోకూడా పడిపోతుంది. మరి భారతదేశంలో మతం సర్వ వ్యాపకమైంది. సంస్కృతి కూడా మతంలో వేళ్లు తన్నుకొనివున్న భావాలతో జతను పడివున్నటువంటిది. ఈ కారణాలచేత అన్ని మతాల పట్లను సమభావం కల్గి, ఉదారమైన దాటస్థ్యాన్ని ప్రదర్శించే పద్ధతి ఆదర్శంగాగల సెక్యులర్ రాజ్యమే భారతదేశం పరిస్థితులకు, పద్ధతులకు సరి పోతుందిగాని, అచ్చమైన సెక్యులర్ రాజ్యం సరిపోదు.

హిందూమతత్వంలోవున్న సహనబుద్ధి గొప్పదే అయినా, సర్వవ్యాపకతను పొందివున్న కులం యొక్క ప్రాబల్యము, మతం ఆధారంగాకొనసాగే కర్మకాండలు— ఇవి అన్నీ ప్రభుత్వం కల్పించుకొని సంఘ సంస్క రణలను తెచ్చిపెటడం ఒక్కటేగాక, మత సంస్థలను మత సంబంధమైన ఆచారాలను, సంఘ సంబంధ మైన ఆచారాలను హద్దుల్లో పెట్టక వీలులేని పరి స్థితి ఏర్పడేట్లుచేశాయి. ఈ కార్యభారాన్ని ప్రభుత్వం తనమీద వేసుకొనక తప్పలేదు. మత సంస్థలు పని చేసే పద్ధతిని పర్యవేక్షణచేసేందుకు సువ్యవస్థిత మైన అధికారవర్గాలు అంటూలేనందువలన, హిందూమత సంస్థలు "సరిగ్గా నడిచేట్లు చూచేం దుకు శాసనాలు చేయవలసిన పని కూడా భారత

3. India as a Secular State: Donald Eugene Smith, 1963, pp. 499—500.

రాజ్య వ్యవస్థకు పట్టింది. మతం ఇచ్చట ప్రజా జీవితంలో వివిధంగా వ్యాపించి వున్నందువలన, సమాజాన్ని సంస్కరించడానికి విధిగా ప్రభుత్వమే పూనుకోవలసివచ్చింది. అటువంటి సంస్కరణవలన రాజ్య వ్యవస్థ మతానికి సంబంధించిన వ్యవహారాలలో జోక్యం పెట్టుకుంటున్నట్లు కూడా అనిపించవచ్చు. కాని ఆ సంస్కరణలు తెచ్చిపెట్టక తప్పదు. రాజ్య వ్యవస్థకే గనుక ఇట్లా పనిచేయగల అధికారాన్ని సమకూర్చనిపక్షంలో మనుష్యునికి అప్రతిష్ఠాకరము, నూతన భారత రాజ్యాంగ ధర్మ ఆదర్శాలకు విరుద్ధము అయిన బహు విధాలయిన ఆచారాలు మతం పేరున, మతం చాటున ఇంకా కొనసాగుతూవుండేవి. ఇక్కడ భారతరాజ్యాంగం, సంపూర్ణ మతస్వాతంత్ర్యం అనే ఆదర్శంనుండి, కొంచెం ప్రక్కకు తొలగి మధ్యేమార్గాన్ని త్రొక్కి, జాతికి శ్రేయస్కరమైన పద్ధతిని అనుసరించింది.

మత స్వాతంత్ర్యానికి సంబంధించిన వ్యవహారాలలో సుప్రీంకోర్టువారు రాజ్యాంగాన్ని వ్యాఖ్యానించిన సందర్భాలు కూడా ఉన్నాయి. వానివలన కూడా భారతరాజ్యవ్యవస్థమతం విషయంలో తటస్థవైఖరిని అనుసరిస్తున్నదన్న విషయమే బలపడుతున్నది. భారతదేశంలో వేరు వేరు మతాలుగల అల్ప సంఖ్యాకులు చాలామంది వున్నారు. ఆ అల్ప సంఖ్యాక వర్గాలు సంఖ్యచేత అల్పమైనవి. ఈ వర్గాలయొక్క ఉనికివలన భారతదేశం సెక్యులర్ రాజ్యసంప్రదాయాలను అనుసరించవలసిన కారణం ఏర్పడింది. శ్రీ నెహ్రూ పలుకుబడి, అల్ప సంఖ్యాకులను చూచే విషయంలో ఆయన నెలకొల్పిన ఉన్నత సంప్రదాయాలు, భారత రాజ్యవ్యవస్థలో సెక్యులర్ భావ ప్రపంచ పరివ్యాప్తికి దోహదకారులైనాయి. పరిశ్రమలు అధికం అవుతూ ఉండటము, పట్టణాలు పెరగడము, విజ్ఞాన శాస్త్ర విహితమైన సాంకేతిక విజ్ఞాన ప్రదములైన దృక్పథాలు బలియుడముా-వీటి అన్నింటి వల్లను కూడా భారతదేశంలో సెక్యులర్ భావం బలపడిపోతున్నది. ఇచ్చట ప్రజలలో వివిధ మతాలవారు ఉన్నారు. ఇంతటి మత వైవిధ్యంతోను దేశం ఏకాకార పౌర సత్వ ధర్మాన్ని సాధించగల్గుతున్నది. పాకిస్తాన్‌తో ఇటీవల జరిగిన పోరాటంసందర్భంలో దేశంలో అన్ని వర్గాలవారున్నూ ప్రదర్శించిన ఏకోన్ముఖమైన ఉత్సాహమే ఇందుకు తార్కాణం. ఇప్పుడు భారతజాతిని, సమైక్యపరుస్తున్న లక్షణాలు ఏవి ఉన్నాయో, అవి జయప్రదంగా పని చేస్తున్నాయి. ఆ లక్షణాలు విజయాన్ని సాధిస్తున్నాయనడానికి పాకిస్తాన్‌తో పోరు సందర్భంలో అన్ని మతాల, అన్ని వర్గాల జనం ప్రదర్శించిన ఏకదీక్షమైన ఉత్సాహమే ప్రబల నిదర్శనం.

అయితే భారతదేశంలో యీ సెక్యులర్ రాజ్యము, యీ ప్రజాస్వామ్యరాజ్యము దృఢంగా పాతుకొనిపోవాలిఅంటే, రాజ్య వ్యవస్థ యేమి, రాజ్యంలోని పౌరులేమి ఇంకా చేయవలసింది ఎంతో వుంది. కులతత్వ జటిలమైన సమాజ ధర్మం ప్రజా జీవితంలో అన్ని రంగాలలోను—నేను ఇంకా ఉన్నాను, అంటున్నది. రాజ్యాంగంలోనిహితమై వున్న ప్రజాస్వామ్య ధర్మ పద్ధతుల మూలంగా ఈ కులాల పలుకుబడికి వ్యాప్తి కూడా కల్గుతున్నది. రాజకీయాలలో కులం మతం పెట్టుకు కూర్చున్నది. శాసన సభలకు అభ్యర్థులను ఎంచాలన్నా ఎన్నుకోవాలన్నా, మంత్రులను నిర్ణయించాలన్నా నియమించాలన్నా, పెద పెద్ద ఉద్యోగాలకు మనుష్యులను వెయ్యాలన్నా కులంయొక్క పలుకుబడి చెల్లకుండా పనులు జరగడంలేదు. ఇట్లా కులంయొక్క ప్రాబల్యం నిరంతరం అధికం అయిపోతూ ఉన్నందువల్ల, ఆ ప్రాబల్యం బహుముఖాలుగా ప్రసరిస్తున్నందువల్ల, మనదేశంలో సెక్యులరిజమూ, ప్రజాస్వామ్య పద్ధతిగల ప్రభుత్వము కూడా బలహీనతను భజించక తప్పని పరిస్థితి ఏర్పడుతున్నది. ఇది జరక్కుండా ఏమి చెయ్యాలో మనం ఆలోచించుకోవలసివుంది. సెక్యులరిష్టు పద్ధతులు బలపడి, దేశంలో సమైక్య భారత జాతిని సంఘటిత పరిచేందుకు అయిన మార్గం ఏమిటో మనం అన్వేషించాలి.

దేశం అర్థికంగా అభివృద్ధి చెందడంవలన, విద్యాగంధం వ్యాపించడంవలన, అధునాతనమైన భావాల తోడి ప్రజాశక్తులు ప్రబలం కావడంవలన ఈ పరిస్థితి చక్కబడుతుందని కొందరు భావిస్తున్నారు. వీనిలో విద్య చాలా ప్రబలమైన, శక్తి వంతమైన సాధనం. అసంఖ్యాకమైన ప్రజానీకాన్ని విద్యావంతం చేయవలసిన బాధ్యతను ప్రభుత్వం తప్ప మరిఒకరు వహించడం అసాధ్యమైన విషయం. అశేష ప్రజానీకంలో సెక్యులర్ భావప్రపంచం వెల్లివిరియాలి అంటే, ప్రాథమిక విద్య, సెకండరీ విద్య పూర్తిగా ప్రభుత్వం అధీనంలోనే నిర్వహింపబడాలి. అప్పుడే విద్యావిధానంలో సెక్యులర్ లక్షణాలను పూదిపోయడం సాధ్యం అవుతుంది. ఇప్పుడు దేశంలో యీ విద్యావ్యాపకవ్యాసంగం అధికంగా మత సంస్థలచేత నిర్వహింపబడుతున్నదన్న విషయాన్ని విస్మరించకూడదు. వీనిలో ప్రతి ఒక్క సంస్థా కూడా ఆ విద్యా వ్యాపన కలాపాన్ని తాను పెంచుకున్న, పెట్టుకున్న విలువలకు అనుకూలంగా కొనసాగిస్తూ ఉండటంవుంది. ఈ విలువలు సంకుచితంగాను, మతైకభావనిష్ఠంగాను ఉండటం కూడా ఉంది. ఇట్లా ఇంతటి వైవిధ్యంగల జన బాహుళ్యాన్ని వివిధ మార్గాలద్వారా సంఘటితపరచవలసిన అవసరం ఉన్నప్పుడు, ఈ వివిధ వైఖరుల వారిని సంఘటితపరచి, దేశంలో జాతీయమైన ఐకమత్యాన్ని సాధించవలసిన బృహత్తరమైన భారం విధిగా రాజ్య వ్యవస్థమీద పడి తీరుతుంది.

ఇప్పుడు దేశంలో విద్యా వ్యాపన భారాన్నంతా ప్రభుత్వమే వహించాలి అంటే, ఆ విద్య అంతా పూర్తిగా 'సెక్యులర్' లక్షణం కల్గిందే అయిఉండాలని, జాతీయ సంప్రదాయ వాసనా విరహితం చేయబడాలని అర్థంకాదు. దేశంలో వివిధ వర్గాల ప్రజలు సాధించిన ఐహిక, సామాజిక, మత విషయక, కళాత్మకమైన సర్వమైన ఘన కార్యాలన్నీ కలిపి సభ్యత అన్న పదంచేత వివక్ష చేయబడుతున్నాయి. ఇవి అన్నీ సంస్కృతి, లేక సభ్యత అన్న దినుసుకు సారభూతమైన లక్షణాలు; విలువలకు, సంస్కృతికి, సభ్యతకు ఇవి మనకిని, కాంతిని తెచ్చిపెడతాయి. "మానవ జాతియొక్క చరిత్రలో అధికభాగం అంతటా—అన్ని కాలాల్లో, అన్ని సమాజాలలో—సంస్కృతికి సంబంధించినంతవరకు మతమే ఉత్కృష్టమైన సమీకరణ శక్తిగా ఉంటూ వచ్చింది; సంప్రదాయానికి మతమే రక్ష, నైతిక ధర్మానికి సంరక్ష, వివేకబోధకు గురువు, విద్యకు పెన్నిధి. ప్రతి కాలంలోను, ఏసంస్కృతికి చెందిన ప్రతిభా సమన్వితాలైన పనులయినాసరే, అవి మతంవలన పొందిన ఉత్తేజంతో, మతమే పరాయణంగా కొనసాగాయి. దేవతలకు కట్టిన గుడులు మానవునియొక్క పనులలో చిరంతనమైనవి. ప్రపంచంలో యే మహాసాహిత్యాన్ని తీసుకుచూచినా ఆ మహా సాహిత్య సౌధాల సింహద్వారాలలో మతం అన్నది విధిగా కన్పిస్తుంది."[4]

అందువల్ల దేశంలో సంఘటితజాతినిర్మాణం లక్ష్యంగా, సంఘటితసమాజవ్యవస్థీకరణంధ్యేయంగా రాజ్య వ్యవస్థయే గనుక విద్యా వ్యాపన కార్యకలాపాన్ని తన చేతుల్లోనికి తీసుకున్నప్పుడు, ఆ విద్యకు అచ్చమైన భారతీయ సంస్కృతిని ప్రాతిపదికంగా చేయనిపక్షంలో, ఏ లక్ష్యాన్ని పెట్టుకుని యీ పని జరుగుతున్నదో, ఆ లక్ష్యమే సాధ్యమైరాదు. "భారతీయమైన సంస్కృతి క్లిష్ట పద్ధతి కల్గింది. అది ఒక సమష్టి సంస్కృతి. సజాతీయము, విజాతీయతము అయిన బహువిధ లక్షణాలు సమవాయ స్థితిని పొందడమువలన ఇది ఏర్పడింది"[5] అని అంటారు. భారతదేశంసంస్కృతియొక్క సారభూతమైన ఓజస్సు హిందూ ధర్మంనుంచే ప్రభవించింది. ఇందువలన అచ్చమైన భారత సంస్కృతి సమష్టి లక్షణంకల్గినట్టిది అన్న వాదానికి విప్రతిపత్తి యేమాత్రమున్నులేదు. ఇప్పుడు యువజను

4. Christopher Dawson, "Religion and Culture."

5. "India as a Secular State"--Donald Eugene Smith.

డైన భారతీయుణ్ణి సంఘటితభారత సమాజంలో భాగస్వామినిగా చేయడం నిమిత్తం పెట్టుకున్న కష్టమైన బాధ్యతను నిర్వహించడం సందర్భంలో రాజ్య వ్యవస్థ పెద్ద జాగ్రత్తను పడవలసివుంది. భారత సభ్యతకు సంబంధించిన ప్రామాణికమైన, ప్రాణప్రదమైన లక్షణాలను నిష్పాక్షికంగా ప్రోత్స హించవలసి ఉంటుంది. అవి ఏ మత సంప్రదాయానికి చెందినవి అయినాసరే, వానిని పోషించకతప్పదు.

ప్రభుత్వం అధీనంలో కొనసాగింపబడుతున్న విద్యా వ్యాపనంలో మతంతో సంబంధంకల విషయం ఏదిన్నీ ఉండకూడదు అన్న పద్ధతిని అనుసరించే టట్లయితే, అప్పుడు సంస్కృతియొక్క మూల ధర్మాలు, భారతీయమైన విలువలు అన్నవిలేకుండా యువజనుని మనస్సును శిక్షించడానికి పూను కొనడం అన్నదే ఫలితంఅవుతుంది. యువజనులకు బోధించే నీతి విద్యయేమి, సాంస్కృతిక విద్యయేమి, దేశంలో అనాది సిద్ధంగావున్న సాంప్ర దాయకమైన సాహిత్యంద్వారా మాత్రమే నిర్వహింప బడాలి. విద్యాబోధనకోసం ఆ సాహిత్యాన్ని వినియోగించడం విద్యలో మతాన్ని తెచ్చిపెట్టడంకాదు. భారతదేశపు మహాగ్రంథాలను గురించి ఒకరు ఇట్లా అన్నారు:

"The educational value of these ancient epics no more depends on the acceptance of any perticular set of religious beliefs than does the value of Homer depend on the intellectnal and spiritual acceptance of Greek Paganism or Shakspeare on the acceptance of Chritianity."6

విద్యకునైతికము, తాత్త్వికముఅయిన బలాన్ని, అర్థాన్ని చేకూర్చాలి. ఇది భారతీయమైన సంప్ర

6. G. C. Pande. "Secularisation and Educational Policy." Paper at the All India Seminar on Scularism.


పట్టు చీరెలు

మావద్దనే

ఎందుకు కొనాలి

?



సరసమైన ధరలు
నాజూకైన డిజైనులు
మెరిసే రంగులు
ధరించుటకు మృదుత్వమును
హాయిని గొల్పునవి

లక్ష్మీ జనరల్ స్టోరు

ఫోను 467

బీసెంటు రోడ్డు...... గవర్నరు పేట,
విజయవాడ-2.

దాయాన్ని దృష్టిలో పెట్టుకొని జరపాలి. విజ్ఞాన శాస్త్రము, సాంకేతిక విజ్ఞానములయొక్క విలువ లను భారతీయమైన సాంఘిక సాంప్రదాయక సంస్కృతీ సంబంధమైన విలువలతో సమన్వయం చేసి మనం మన విద్యావిధానాన్ని నిర్మించుకోవలసి వుంది. దేశంలో విద్యకు సంబంధించిన విషయాలను చక్కనొత్తుతున్న వారికి ఏవంవిధమైన విద్యా విధాన పద్ధతిని సాధించడం అతీతం అయిన విషయం కాదు.

ప్రజలు కూడా సెక్యులర్ రాజ్యాన్ని బలపరచ వలసివుంది. అదేవిధంగా ఈ రాజ్యంయొక్క ప్రజా స్వామిక వ్యవస్థను పటిష్ఠం చేయవలసివుంది. ఇందుకుగాను ప్రజలు హృదయ పూర్వకంగా కృషి చేయడం అవసరం. రాజ్య వ్యవస్థ ఇందు కోసం చేస్తున్న కృషికి ప్రజలు నిరంతరమైన సహకారాన్ని చేయూతను ఇవ్వాలి. భారతదేశంలోని సంగతి సందర్భాలను గమనించి, అందుకు అనుగుణ మైన ఏ 'సెక్యులరిజం' ఉన్నదో, అది మహత్వపూర్ణం అయ్యేట్లు చూడవలసివుంది. (సశేషం)

—ఆకాశవాణి సౌజన్యంతో]

---



# యక్షగానములూ - నాటకాలూ ఒకటి కావు

శ్రీ శ్రీవాత్సవ

ఆంధ్రదేశములో చిరకాలమునుండి ప్రచారములో నున్న యక్షగానములు వీధినాటకములు ఒకటే యని పలువురు పండితులు అభిప్రాయపడుతున్నారు. ఈ నమ్మకముతోనే, తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాగారములో లభించిన తాళపత్ర గ్రంథాలను ఆంధ్రవిశ్వవిద్యాలయ పండితులు ప్రకటించారు. అదే విశ్వవిద్యాలయములో యక్షగానముల గూర్చి పరిశోధనా వ్యాసములు వ్రాసి డాక్టరు యస్వీ జోగారావువంటి విద్యార్థులు డాక్టరేటు పట్టము సంపాదించారు. కాని యక్షగానములను శ్రద్ధతో పరికించి చూచినట్లయితే అవి వేఱు—వీధి నాటకములు వేఱు అని తెలిసికోవచ్చును. ఈ రెండు రకాల దృశ్య ప్రబంధాలు కూడ సంస్కృత రూపకములకు భిన్నమైనవిగా గ్రహింపవచ్చును. నన్నయ్య కాలమునుండి ఆంధ్రదేశములో ఏదో ఒక రకమగు నాటకముల ప్రదర్శనం రంగస్థలం మీద జరుగుతూ ఉండేది. అట్టి ప్రదర్శనలు పండుగలకు పబ్బాలకు, ఉత్సవాలలో వూరేగింపులలో ఏర్పాటు చేసేవారు. దేశిమార్గ కవితా రీతులలో మధుర కవితలు శ్రవ్య రూపకాలుగానే కాక దృశ్య రూపకాలుగా ప్రదర్శించేవారు. తెనుగు కవిత్వం ఆశు, మధుర, చిత్ర, విస్తర కవితలుగా నాలుగు విధాలుగా ఉన్నట్లు ప్రాచీన లక్షణ కర్తలు తెలిపియున్నారు. వానిలో యక్షగానాలు, నాటకాలు మధుర కవితా శాఖలోనికి వచ్చును. దీనినే 'లక్షణదీపిక' ఈవిధంగా నిర్వచిస్తున్నది.

"మధుర కవిత్వం బన్నది నాటకాలంకారంబులు, కళికోత్కళికలు, విభక్త్యర్థి దేవతోదాహరణములు, సప్తతాళ నటనలు, నటోత్కట్లు, గీతప్రబంధములు, చతుర్భద్రికాష్ట భద్రికలు, బిరుదావళి, నామావళి, రంగఘోష, జయఘోష, త్యాగఘోష, చతురుత్తర సంఘటనలు, యక్షగానంబున వెలయు పదంబులు, దరువులు, ఏలలు, ధవళంబులు, మంగళహారతులు, శోభనంబులు, ఉయ్యాలజోలలు, జక్కుల రేకు పదంబులు, చందమామ సుద్దులు, అష్టకంబులు, ఏకపద ద్విపద త్రిపద చతుష్పద అష్టపదలు నివి యాదిగా గలు వన్నియు."

—లక్షణదీపిక.

ఇట్టి మధుర కవితలు దృశ్యమానమైన పద్ధతిని గూర్చి నన్నయ్య తర్వాత రెండు వందల సంవత్సరాల అనంతరము వచ్చిన పాల్కురికి సోమనాథుడు తాను రచించిన పండితారాధ్య చరిత్రలో పర్వత ప్రకరణమునం దిట్లు అభివర్ణించెను.

భ్రమరులు జాళెవముల్ బయనముల్ మెఱసి
రమణ పంచాంగ పేరణి యాడువారు
ప్రమథ పురాతన పటు చరిత్రములు
క్రమమొంద బహు నాటకములాడువారు
లలితాంగ రసకళాలంకార రేఖ
లలవడ బహురూప మాడెడువారు.

అని నాటకములను గూర్చి 'బహురూప'మను 'వెరైటీ' కార్యక్రమము వంటిది ఆనాడు ప్రదర్శించే

వారని తెలుసు న్నది. ఇంక యక్షగానముల గూర్చి మరోవిధంగా సోమనాథుడు వర్ణించాడు.

ఆ వియద్గతి యక్షులాడెడు నట్టి
భావన ప్రేక్షకులపై నాడువారు
భారతాది కథలు చీర మఱుఁగుల
నారంగ బొమ్మల నాడించువారు
కడు నద్భుతంబుగ కంభసూత్రంబు
లడరంగ బొమ్మల నాడించువారు
నాదట గంధర్వ యక్ష విద్యాధ
రాదులై పాత్రల నాడించువారు.

—పండితారాధ్య చరిత్రము.

దీనినిబట్టి బొమ్మలాటలు, తోలుబొమ్మలాటలు, కీలుబొమ్మలాటలు యక్షవిద్యాధరాదులు ప్రదర్శించేవారని గ్రహింపవచ్చును. ఇది నాటకాలకు పూర్తిగా భిన్నమే. యక్షులనగా ఒక జాతివారనీ, వారే జక్కులవారైనట్లు వేటూరి ప్రభాకరశాస్త్రి గారు చెప్పి, వారు ప్రదర్శించు నాటకములు యక్షగానములని పేర్కొన్నారు. యక్షులను పేరు కులశాఖానామము కాదు. యక్ష గంధర్వ విద్యాధ రాదులు—సామాన్యులకు కనిపించని దేవతలు. అట్టి వారు చేయు గానము యక్షగానము. అనగా అదృశ్య వ్యక్తులుగా ఉండి తెరవెనుక భాగవత మాడించే వాళ్లను యక్షులని పిలవడం వాడుకలో వున్నదే. భారతములో 'యక్షప్రశ్నలు' ఒక అదృశ్య వ్యక్తి వేసిన ప్రశ్నలే. అట్లే తెరవెనుకనుండి పాటలు పాడుతూ తోలుబొమ్మలు మొదలైనవి ఆడించు అదృశ్య వ్యక్తులు యక్షులు; అనగా నేటి 'ప్లేబాక్' పద్ధతిలో తెరమరుగున ఉండి, రంగస్థలముమీద కనిపించకుండ పాటపాడి తోలుబొమ్మలనుకాని కీలుబొమ్మలుకాని ఆడిస్తూ ప్రదర్శించే రూపకం యక్షగానం. బొమ్మలతో ప్రారంభమైన యీ యదృశ్య ప్రదర్శన క్రమంగా రంగస్థలంమీద నృత్యగీత కలాపాదులు చేసే మనుష్య పాత్రలతో ప్రదర్శించుట పరిపాటి అయినది. యక్షగానాలు నృత్యగీత ప్రధానము లైనవి. ఇవి సానులూ, జక్కులవారు వీధిలో పోయే సమయంలో ప్రదర్శించేవారు. ఈ నృత్యం చేస్తూ భిక్షాటనం చేసేవారు. మహోత్సవములలో క్రీడా విలాసాలు కలిగించేవారు.

సాని యీశానియై మహోత్సవమునందు
కేల నవ చంద్రకాంతపు గిన్నె పూని
వీథి భిక్షాటన మొనర్చువేళ జేయు
మరులు నృత్యంబు జగముల మరులు కొలుపు.

—భీమఖండము.

అంతేకాక—మహోత్సవమండపంలో ప్రదర్శించే పలురకాలయిన నృత్యాలు శ్రీనాథుడు వర్ణించాడు.

వ : మహోత్సవ మండపమునందు పేరోలగం బుండి, కుండలీ దండలాసక పేరణీ ప్రేంకణ సింధు కందక ధమాళిచేల మత ల్లీ హల్లీసకాది నృత్యంబు లవలోకించు...

—భీమఖండము.

కాకతీయుల కాలములోని నృత్యములను వర్ణించిన జాయప సేనాని తన 'నృత్త రత్నావళి' యను సంస్కృత గ్రంథములో ఈ నృత్య విశేషము లన్నిటికిని లక్ష్య లక్షణ సమన్వితమైన వివరణములు చూపాడు. క్రీడాభిరామంలో శ్రీనాథుడు జక్కులపురంధ్రి చేసే నృత్యగాన కలాపాలను ఈవిధంగా వర్ణించాడు.

కోణాగ్ర సంఘర్ష ఘుమఘుమధ్వని తార
కంఠస్వరంబుతో గారవింప
మసిబొగ్గు బోనాన నసలు కొల్పిన కన్ను
కొడుపుచే దాటించు నెడవ దడవ
శ్రుతికి నుత్కర్షంబు జూపంగవలయుచో
జెవిత్రాడు బిగియించు జీవగఱ్ఱ
గిల్కు గిల్కున మ్రోయు కింకిణీ గుచ్ఛంబు
తాళ మానంబుతో మేళవింప

రాగమున నుండి లంఘించు రాగమునకు
నురుమ యూరుద్వయంబుపై నొత్తి గిల్క
కామవల్లీ మహాలక్ష్మి కైటభారి
వలపు పాడుచు వచ్చె జక్కులపురంధ్రి. ...

ఇంతేకాక భీమఖండములో—

కీర్తింతు రెవ్వాని కీరి గంధర్వులు

గాంధర్వమున యక్షగాన సరళి .... అని శ్రీనాథుడు చెప్పినదాన్ని బట్టి చూస్తే, దృశ్యరూపమైన గాన విశేషమే యక్షగానమని గుర్తుపట వచ్చును.

ఈ రకపు నాట్యములు, నాటకములు యక్షగానములు కొరవంజి ప్రదర్శనములు తంజావూరు రాజుల కాలములో ప్రచారములో ఉన్నవి. వీటిని గూర్చి విజయరాఘవనాయకుడు ప్రహ్లాద చరిత్ర అనే నాటకములో వర్ణించాడు.

వాల్వచి గుజ్జరి విల్వేడు దండలా
స్యము కందుకక్రీడ అల్లికయును
కొరవంజి శుభలీల గుజరాతి దేశి చౌ
పదము జక్కిణి దురుపదము మదన
పద దౌత్యమును జోగి పదచాళి శారదా
సామ్రాజ్యమును జిందు సవతిమచ్చ
రంబులు నాట్య కదంబంబు మొదలైన
నాట్యముల్ హవణించు నవరసజ్ఞ (లు)డేవారు.

—ప్రహ్లాద చరిత్ర.

దీనినిబట్టి యక్షగానము ఒక విధమైన నృత్య గాన విశేషం మాత్రమేకాని నాటకము కాదని తెలుసుకోవచ్చును, ఈ గాన సరళికి అప్పకవి లక్షణము చెప్పాడు.

తుద నేడు లఘువులు తొలగించి చదివిన
త్రిపుటకు వృషభగతి పదయుగము
లలి గడపల నొక్క లఘువు మానిన జంపె
మను ద్విరదగతి సమపద యుగము
గురుతగు రచ్చేరకు తురగవల్గ నా
హ్వయ మేకతాళి యా మధుర గతికి
వంక్షి కిర్వదినాలు గట తాళమున మాత్ర
లోలి విశ్రాంతి పద్నాలుగింట
తెలియు నర్ధంబు నర్ధచంద్రికలు వీలు
యక్షగాన ప్రబంధంబు లతుకవచ్చు
రగడ భేదంబు లివి యంద్రు రసకవీంద్రు
లవిత నిజసేవక స్తోమ యబ్ధిధాను.

అనగా యక్షగానములలో ఉపయోగించే రగడలు త్రిపుట, జంపె, ఏక, అట తాళాలలో కల్పించి పాడుకోవచ్చునని ఆ 'రగడ' లకు అప్పకవి పేరులు చెప్పాడు. ఈ యక్షగానాలలో మనకు లభించిన తొలి కృతిని కందుకూరు జనార్దనుడీ విధంగా చెప్పాడు

సర్వము దా నగు జన్నప్పనికిన్

వ: అంకితముగా నా యొనర్పంబూనిన సుగ్రీవ విజయంబను యక్షగానంబునకు కథాక్రమం బెట్టిదనిన.... యని త్రిపుటలు, జంపెలు, అట తాళ గతి రగడలు మొదలైనవి పాడించి చివర ద్విపదతో ముగించాడు:

కోవిదస్తవనీయగుణ రుద్రధీర
విరచిత సుగ్రీవ విజయాభిధాన
కరుణ భాసుర యక్షగాన ప్రబంధ
మా చక్రవాళ శైలావనియందు
నాచంద్రతారార్కమై యొప్పుగాత.

దీని తరువాత యక్షగాన ప్రబంధ విశేషాలన్నీ కృష్ణ దేవర కాలమునుండి తంజావూరు రాజుల కాలము వఱకు ఈ ధోరణినే అనుసరిస్తూ వచ్చాయి. ఇవి ఒక సంప్రదాయాన్ని అనురించి ఉండగా వీటికి భిన్నమైన లక్షణాలతో నాటకాలు కూడ వచ్చాయి.

శ్రీనాథుడు క్రీడాభిరామములో దశరూపకాలలో వీధినాటకాన్ని పేర్కొని దానిని ప్రబంధంగా రచించి నట్లు చెప్పుకున్నాడు.

గణనకెక్కిన దశ రూపకముల యందు
వివిధ రసభావ భావన వీధి లెస్స
యే కవీంద్రుడు రచియించె నీ ప్రబంధ
మనుచు మీా రానతిచ్చెదరైన వినడు.

ప్రేమాభిరామం అనే వీధినాటకం సంస్కృతంలో నున్నది. వినుకొండ వల్లభరాయుడు తన ముందు వేయించుకొన్నాడు. ఆ ప్రదర్శనం చూచి

శ్రీనాథుడు క్రీడాభిరామం అనే ప్రబంధంగా చేసినట్లు పండితుల అభిప్రాయం. అందుచేత యక్షగానంకంటె భిన్నమైన లక్షణాలతో వీధినాటకం శ్రీనాథుని కాలంలో ప్రదర్శితమవుతూ ఉండేది. ఆ రూపకమే నాటినుండి తంజావూరు రాజుల కాలం నాటి వఱకు పరిపాటిగా వచ్చింది. రఘునాథనాయకుని కొలువులో యక్షగానములు ప్రదర్శించేవారు. నాటకాలూ ప్రదర్శించేవారు. వాటికి వేఱువేఱు రంగశాలలుండేవి. అలాగే విజయరాఘవుని కొలువులో నున్నూ! నాయక రాజుల అనంతరము తంజావూరు నేలిన శాహాజీ, శరభోజీ మున్నగు మహారాష్ట్ర రాజుల కొలువులో కూడ యక్షగానాలు వేఱుగాను, నాటకాలు వేఱుగాను ప్రదర్శన మవుతూండేవి. వీటిలో ప్రాచీన సంస్కృత నాటక లక్షణాలు లేకపోయినప్పటికీ, భరతుడు నాట్యశాస్త్రములో చెప్పిన లక్షణాలూ, ధనంజయుడు దశరూపకంలో చెప్పిన లక్షణాలూ పాటిస్తూ వచ్చారు. కాని ఈ తంజావూరు రాజుల కాలములో ఆడిన నాటకాలు, ప్రదర్శించిన యక్షగానాలూ ఒక తెనుగుతనాన్ని నిలుపుకొని ఒక నూతన సంప్రదాయాన్ని ప్రవేశపెట్టాయి. ఇట్టివి రంగాజమ్మ రచించిన రఘునాథాభ్యుదయ నాటకంలోను, శాహాజీ రచించిన శంకర పల్లకీసేవా ప్రబంధములోనూ చూడవచ్చును. మొదటిది నాటకము, రెండవది యక్షగాన ప్రబంధము. ఈ పద్ధతిలో ఏకాంతసేవా విలాసము మృత్యుంజయ విలాసము వంటి గాన ప్రధానమైన యక్షగాన ప్రబంధాలలో నృత్యగాన ప్రదర్శనములు వచ్చాయి. ఇట్టివి, ఇలవేల్పుగా ఉండే దేవుని కల్యాణ మహోత్సవాలలో వూరేగింపులలో ఆఱు బయట ప్రదర్శించేవారు. కొన్ని పల్లకీ సేవా ప్రబంధాల వంటివి ఒక్కచోట నిలుకడగా గాక క్రమంగా స్వామివారి పల్లకీసేవలో దారి పొడుగునా వీధి మధ్యలో ప్రదర్శిస్తూ పోయేవారు. వూరేగింపుగా తిరువీధులలో జరిగేది.

ఈ సంప్రదాయము విజయనగర రాజుల కాలములోనే ప్రారంభమై యుండవచ్చును. శ్రీకృష్ణదేవరాయల కాలములో ఏటేట వసంతోత్సవములు, విజయదశమి వేడుకలు జరిపించేవారట. ఈ మహోత్సవాలలో నాటకాలు ప్రదర్శించడం సంప్రదాయము. అట్టి నాటకాలలో తాయకొండ నాటకము బహుళ ప్రచారం పొందినట్లు, ఆ నాటకంలో పాల్గొన్న నట్టువ నాగయ్యకు రాయలవారు సన్మానము చేసి సత్కరించినట్లు శాసనం వేయించారు. ఈ నాటకంలో పోతవరపు నట్టువ తిమ్మయ్య కూతురు నాయికాపాత్ర ధరించిందట. ఈ ఉత్సవాలలో ప్రదర్శించే నిమిత్తం రాయలవారు రచించిన జాంబవతీ పరిణయం, ఉషాపరిణయం అనే నాటకాలు ఎన్నిక చేశారట. ఈ నాటకాలు లభ్యం కావడంలేదు కాని జాంబవతీ పరిణయంలో ఒక చిన్న భాగం మాత్రం శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు ప్రకటించారు. అంతేకాక ఆ కాలంలో గంగావతరణం అనే మరో నాటకం కూడ ప్రచారంలో ఉండేదట! రాయలవారి కొలువులో సంస్కృత నాటకాలు, తెలుగు నాటకాలు, బొమ్మలాటలు ప్రదర్శించేవారనీ, ఇవి బహు జనాదరణ పొందేవనీ తెలుస్తోంది. బొమ్మలాట విరూపాక్షయ్య కొడుకు బొమ్మలాట కాళయ్య రాయలవారికి అప్పుడని ఆముక్తమాల్యద పీఠికలో వేదము వేంకటరాయ శాస్త్రిగారు వ్రాశారు. రాయల కొలువులో లాగే రఘునాధుని కొలువులో కూడ నాటకాలు తెలుగులోను, సంస్కృతంలో కూడ ప్రదర్శించే సంప్రదాయం ఏర్పడింది. ఈ నాటకాలలో సందర్భానుసారంగా అష్టభాషా సంభాషణలు ప్రవేశపెట్టి వివిధ పాత్రలచేత మాటలాడించేవారు. ఈ పద్ధతి రంగాజమ్మ రచించిన రఘునాథాభ్యుదయం నాటకంలో చూడవచ్చును. ఈ నాటకాలలో సందర్భోచిత భాషనే కాక పాత్రోచిత భాష వాడినట్లు, విప్రనారాయణ చరిత్రలోను, ప్రహ్లాద చరిత్రలోను, అన్నదాననాటకములోను చూడవచ్చును. నాటకాలు కాక గీత నృత్య ప్రబంధాలలో

పాల్గొనే నటీమణుల పేరులు చెంగల్వకాళకవి పేర్కొన్నాడు. ఒక్కొక్క నాట్య విద్యలో ఒక్కొక్క కాంత సమర్థురాలుగా ఉండేదట ! ఈ పద్యమును బట్టి నాటి నాట్య విద్యలు, ఆ విద్యలలో ఆరితేరిన నటీమణులను గూర్చి తెలిసికోవచ్చును.

ఈ నటీమణులలో ముఖ్యురాలు చంద్రరేఖ. ఆమె నటనాభినయం ఆ కాలంలో జగత్ప్రసిద్ధి పొందినదట. వీరవేంకటరాయలను రాజు ఈమె అభినయకౌశలానికి మెచ్చి ఎన్నో సత్కారాలు చేసెనట. ఈమెకాక చంపకవల్లి, మూర్తి, కోమలవల్లి, లోకనాయిక, శశిరేఖ, రత్నగిరి, భాగీరథియును నటీమణులు వివిధ రకాలయిన నృత్యాలలో పేర్గాంచి విజయరాఘవుని కొలువు నలంకరించి యుండేవారు.

రుచి చౌద కేళిక 'రూపవతీ' కాంత
శబ్దచూడామణి 'చంప'కాఖ్య
చెలువగు జక్కిణి చెలువ 'మూర్తి' వధూటి
కొరవు 'కోమలవల్లి' గురునితంబ
సవపదంబులు 'లోకనాయికా' లోలాక్షి
యుల దేశి 'శశిరేఖ' కాబ్జవదన
దరు పదంబులు 'రత్నగిరి' నితంబినియును
పేరణి విధము 'భాగీరథి' యును
మదనపదముఖ్య నవరత్న మాలికాది
బహువిధాలేఖ్య నాట్య ప్రబంధములను
ఘనత విలసిల్ల తక్కిన కాంతలెల్ల
నభినయించిరి తమ నేర్పు లతిశయిల్ల.

ఒక్కొక్క నాటకములో ఒక్కొక్కరు ధరించిన పాత్రలు తెలియజేసే వివరణాలున్న 'జాప్తా' లున్నవి. అవి కవిలె కట్టలుగా తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీలో నేటికి దొరుకుచున్నవి. అవి పరిశీలించి చూస్తే నాటకాలు, కొరవంజెలు, యక్షగానాలు అను మూడు రకాలయిన రూపకాలు ప్రదర్శించినట్లు తెలిసికోవచ్చును. కొన్ని నాటకాలలో పురుషులే స్త్రీ వేషాలు ధరించినట్లు ఈ 'జాపా 'ల వలన తెలిసికోవచ్చును. ఆ కాలపు యక్షగానాలలో సూత్రధారి వస్తాడు; అతడే పద్యాలతో, ద్విపదలతో, రగడలతో, వచనముతో పాత్రలను ప్రవేశపెట్టాడు. అతడు కథాగానం చేస్తాడు. దరువులు పాడతాడు. వివిధ తాళగతులతో గద్య పద్య గానంచేస్తాడు. అతనితో పాటు ఇతర గాయనీ గాయక బృందం కలిసి పాడతారు. ఇది తెరవెనుక గానంగా ఉంటే తెరపైన తోలుబొమ్మలు, కీలుబొమ్మలు తమ కర పద చాలనములచేత భావప్రదర్శనంచేస్తాయి. ఆ బొమ్మలకు బదులు మనుష్యులే ఆయా వేషాలలో ప్రవేశించి నృత్యగీత ప్రదర్శనాలతో అభినయం చేయవచ్చును. ఇట్టి ప్రదర్శనలలో సంభాషణలుండవు. ఒకవిధమైన కథాగాన కాలక్షేపంగా ఉంటుంది. నాటకంలో అలాగు కాదు. పూర్వ రంగంలో ఇష్ట దేవతాపూజ నాయకస్తుతి, సరస్వతీస్తుతి మున్నగునవి అయిన తర్వాత సూత్రధారి పాత్రలను రంగస్థలంమీద ప్రవేశపెట్టాడు. పాత్రలు ప్రావేశిక దరువుతో ప్రవేశిస్తాయి. 'భామనే సత్యభామనే' అనేది యిటువంటి దరువే. 'రాజు వెడలె రవితేజము వెడలగ' అనేది కూడ ఇదే మాదిరిది. భరతుడు నాట్యశాస్త్రములో తెలిపినట్లు నాటకాలలో సందర్భోచితంగా అయిదు రకాల 'ధ్రువపదాలు' ప్రయోగించవచ్చును. అవి ప్రావేశిక దరువు, ఆక్షేపిక దరువు, సంవాద దరువు, ప్రాసాదిక దరువు, నిష్క్రామిక దరువు. ఈ అయిదు రకాల దరువులు తెలుగు నాటకాలలో వాడి ప్రదర్శించినట్లు, ఈ నాటకాలను చూస్తే తెలుస్తుంది. ప్రావేశిక దరువు పాత్రలను ప్రవేశపెట్టి, పాత్రలతో ప్రేక్షకులకు పరిచయం చేస్తుంది. ఆక్షేపిక దరువు, వెక్కిరింతగా హాస్యం చేసినట్లు, 'కామనే గొడుగు కామనే' యని 'కాయనే దోస కాయనే' అనే ధోరణిలో ఉంటుంది. సంవాద దరువులో పాత్రల సంభాషణ పాటలో సాగుతుంది. 'చిటపట చినుకులు దప్పటి తడిసెను తలుపు తీయవే భామా' అన్నట్లు. ప్రాసాదికదరువులో కథాంతరాలు వర్ణనలు వస్తాయి. నిష్క్రామిక దరువులో పాత్రలు రంగస్థలం నుండి నిష్క్రమించడం చూపిస్తారు.

భరతుడు నాట్యశాస్త్రములో చెప్పిన యీ ధ్రువ పదాలను కాళిదాసాదులు మాళవికాగ్నిమిత్రం వంటి నాటకాలలో యథేచ్ఛగా వాడుకున్నారు. తెలుగు వీధి నాటక కర్తలు వీటిని దరువులుగా అనేక సందర్భాలలో ఆశ్చర్యకరమైన ప్రయోజనాల కోసం వాడి చూపినారు. ఇట్టి సర్వ లక్షణ లక్ష్య సమన్వితమైన నాటకాలే కూచిపూడి భాగవతులు ప్రదర్శించి ప్రసిద్ధికెక్కారు. ఈ సంప్రదాయమే దక్షిణాదిలో మేలట్టూరు, శూలమంగళమ్ మొదలైన గ్రామాలలో వీధి భాగవతాలుగా ప్రదర్శనలు చేశారు. ఆ నాటకాలలో కుల మర్యాదగా వంశ పారంపర్యంగా బ్రాహ్మణ కుటుంబాలవారు వేషధారణ చేశారు. వారికి వీధిభాగవతులని పేరు వచ్చింది. ఇవే వీధి నాటకాలు. వీటిని నాటకాలనే చెప్పుకోవాలి కాని యక్షగాన ప్రబంధాలుగా చెప్పడం భావ్యంకాదు. యక్షగానాలకు ఉదాహరణగా త్యాగరాజు రచించిన నౌకాచరిత్రము, ప్రహ్లాద భక్త విజయము వంటివి పేర్కొనవచ్చును. ఈ తారతమ్యంతో పరిశీలించి చూస్తే యక్షగానాలు వేఱు, వీధి నాటకాలు వేఱని తెలియుడమేకాక తంజావూరు రాజుల కాలంలోను మహారాష్ట్ర రాజులకాలంలోను వెలువడిన వేలకొలది నాటకాలు ఒక అపూర్వ సంప్రదాయాన్ని నెలకొల్పాయనీ ఆ సంప్రదాయం సంస్కృత నాటక లక్షణాలకు భిన్నముయిందనీ తెలుసుకోవచ్చును. ఈ విషయాన్నే సరస్వతీ మహలు లైబ్రరీలోని వ్రాతప్రతుల క్యాటలాగు పీఠికలో తెలిపియున్నారు.

It is generally believed that the Telugu Drama is modelled after the Sanskrit Drama as the other modes of literature are and that it took its birth only towards the later part of the last century. But this is not quite correct. The perticular variety now in vogue is modelled certainly after those in Sanskrit and is of very late origin. But when we look at the works in this section we see that the Authors of the 16 th and the 17 th centuries conceived a kind of Drama which had almost nothing in common with the Sanskrit Drama. It may also be noted that the street dramas that are played by some wandering folk in the various parts of Andhra Pradesh particulary in the Ceded Districts have something in comman with them. Some more research is necessary in this direction and those dramas should be critically studied with a view to Judging their proper place in Telugu literature. There are some here which are of historical value. Some of the dramas are by the Royal authors, Vijayaraghava, Shahji, Shivaji, Mannardasa snd most of them are from their court poets.

దీనినిబట్టి తంజావూరు రాజుల కాలములోని నాటకరీతులు సంస్కృత నాటక పద్ధతులకు భిన్నమైనవనీ—వాటిని గూర్చి పరిశోధన చేసి వీటి లక్షణాలను తెలిసికోవలసిందనీ, ఈ క్యాటలాగు పీఠిక వ్రాసిన పి. పి. యస్. శాస్త్రిగారు తెలియజెప్పారు. ఆ కాలంలోని నాటకాలు చూస్తే, వాటి లక్షణాలు నేటి నాటకరీతులకు చాల భిన్నమై ఒక తెలుగుతనంతోకూడిన సంప్రదాయం ప్రవేశపెట్టి మూడు వందల యేండ్ల క్రితమే దక్షిణాదికంతకీ మార్గసూచకంగా ఈ నాటకాలుండేవనీ తోస్తుంది.

The special distinction of the Southern School is its originality in the production of song and drama known as Natakas-the crude Telugu drama-the stage play was given a literary status and brought in to the Royal Stage in the reign of Raghunathanayaka and his son Vijaya Raghava. A perusal of these will at once convince the reader that they are more original in composition and more artistic in repre-

sentation than the present day stage dramas which are more often imitation of the sanskrit or English Drama.

Introduction to the descriptive catalogue of the Telugu M. S. S. of the T. M. S. S. Library, Tanjore.

ఆ కాలములో నాటక ప్రదర్శనాలు చేసి నప్పుడు ఆ నాటకాలలో వేఱువేఱు పాత్రలు నిర్వహించినవారి పేరులో 'జాప్తా'లోఉన్నవి. ఒక్కొక్క ప్రక్రియకు ఉదాహరణగా ఒక్కొక్క జాప్తా ఇక్కడ పొందుపరుస్తున్నాము.*

**కృష్ణజననం : వేషాలు**

విఘ్నేశ్వరుడు—చిక్కాజి రాయుడు.
ప్రమథగణాలు2-వ.యశోదాదేవి—వ యం
బాలకృష్ణ వేషం—శిష్యుడు.
అక్రూరుడు—కురుక్కుళు—రామయ్య.
రాజహంస వేషం—మ. రాధ.

**నాటకాల వేష జాప్తా**
**ప్రబోధ చంద్రోదయం:—**

మురతి—పెద్దసుబ్బారాయుడు పిన్నసుబ్బ రాయుడ.
సఖులు౨,—కుప్పడు, గురువుడు
సత్సంగుడు—శేషగిరి వెంగు శ్రీనివాసం
శాంతి—శివసుబ్రహ్మణ్యం
వివేకరాజు—శామానయ్య రంగయ్య
మతి—అహోబళం వేంకట్రాయుడు
సఖులు౨—ముద్దణ్ణ, శివసుబ్రహ్మణ్యం
దంభుడు—వేంకాచం శేషయ్య, గంగాధర కృష్ణుడు
శిష్యుడు—శ్రీనివాసుడు వేంకటసుబ్బుడు
వంచన—కుప్పడు గురువుడు
అహంకారుడు—శామానయ్య సుబ్రహ్మణ్యయ్య
అధ్యాపకులు౨—రామయ్య కుప్పయ్య
జియ్యరు౨—వైత్తి కుప్పడు
అసూయ—పెద్దసుబ్బరాయుడు పినసుబ్బ రాయుడు
అన్నత కౌమారుడు—కుంభకోణం కుప్పడుశేషు
దుర్గతి—గజపతి గురువయ్య కృష్ణుడు
అసత్సంగుడు—వి. శ్రీనివాసుడు సుందరం
భ్రాంతి—కృష్ణుడు
మోహ మహారాజు
మహల్దారులు—వైద్ది గోపాలుడు
దుర్మతి—చిన్నసుబ్బరాయుడు గురువుడు
చార్వాకుడు—వెంకాచం శేషయ్య గంగాధర కృష్ణుడు
శిష్యుడు—పెద్ద శ్రీనివాసుడు వైద్ది
జాసూదా—కుప్పయ్య
క్రోధవేషం—వేంకటసుబ్బుడు
హింసా—సామయ్యకృష్ణుడు
లోభల—సుందరం
తృష్ణ—శుప్పడు
అధర్ముడు—సుబ్రహ్మణ్యుడు శ్రీనివాసవెంగు
దుష్టప్రవృత్తి—పిన్నసుబ్బరాయుడు
విభ్రమావతి—గురువుడు
మిథ్యాదృష్టి—సుబ్బుకుట్టి వేంకట్రాయుడు
శాంతి—సుబ్బుకుట్టి అహోబళయ్య
కరుణా—పెద్దసుబ్బరాయుడు పినసుబ్బరాయుడు
క్షపణకుడు—వెంకాచం శేషయ్య గంగాధర కృష్ణుడు
తామసీశ్రద్ధా—గణపతి కృష్ణుడు
బుద్ధభగవానుడు—శ్రీనివాస వేంకటసుబ్రహ్మణ్యం

ఈ జాప్తాలో రామా పండితులు నాటకాల 12 ట్కి, దొరవారి నాటనాలు 9 ట్కి వేషాలు వ్రాసి నట్లు చివర తెలిపియున్నాడు. ఆ జాప లో దొరవారి

---

* నాటక వేషధారణ జాపా —నాటక పాత్రలు: వ్రాతప్రతి. B. No. 36—D No. 799 తంజావూరు సరస్వతిమహల్ లైబ్రరీ.

నాటకాలు మాయావతీ పరిణయం ఒకటి, మిత్రవిందా పరిణయం, సుభద్రా కల్యాణం, శాకుంతలం, పారిజాతాపహరణం, కృష్ణ జననం, కృష్ణదాన చరిత్ర, ప్రతాపరామ కొరవంజి, మోహినీ మహేశ పరిణయం వంటివి తొమ్మిది యున్నవి. వీనినిబట్టి ఆ కాలంలో ప్రచారంలో వున్న నాట్య ప్రదర్శనలు యక్షగానాలు, నాటకాలు, కొరవంజెలు అనే మూడు రకాలుగా ఉండేవని తెలుస్తుంది. పండితారాధ్య చరిత్ర నాటికే—నాటకా లాడేవారు. శ్రీనాథుని కాలంలో యక్షగానాలూ ప్రదర్శించేవారు నాటకాలూ ప్రదర్శించేవారు.

అటుగాక సాంగ భాషాంగ క్రియాంగ
పటు నాటకంబుల బయలాడువారు.
—పండితారాధ్య చరిత్ర.

తంజావూరు రాజుల కాలములో యక్షగానాలు కొఱవంజెలు, నాటకాలు కూడ ప్రదర్శించేవారు. యక్షగానాలు నానాటికి హరికథా కాలక్షేపాలుగాను, వీరకథా గానములుగాను పరిణమించి ఉండవచ్చును. కన్నడ భాషలో మార్పుచెందిన యక్షగానాలు వివిధ వేషధారణతో వెనుకపాటతో ప్రదర్శించే ప్రదర్శనలుగానే పరిణమించాయి. ఇవి మహారాష్ట్ర దేశంలో 'తమాషాలు' గాను, గుజరాతి దేశంలో భావాయి ప్రదర్శనలు గాను, ఉత్తర దేశంలో 'నౌతంకీ' ప్రదర్శనలుగాను రూపాంతరం పొందాయి. వీటికి భిన్నంగా దక్షిణ దేశంలో నాటకాలు ఒక ప్రత్యేక సంప్రదాయంతో సొంపులు కురిపిస్తూ ప్రేక్షకుల నానందపరుస్తూ రసికజన మనోభిరామంగా రక్తికట్టిస్తూనే వచ్చాయి. యక్షగానాలు వేఱు, నాటకాలు వేఱు కాని అవి ఒకే ఒక ప్రక్రియ అనడం మన విశ్వవిద్యాలయ పండితులు, వారి శిష్య ప్రశిష్యులుచేస్తూవచ్చిన పెద్ద పొరపాటు. ఈ విషయంలో పునఃపరిశీలన చేసి పరిశోధనల యనంతరం ఈతప్పు దిద్దుబాటుచేయడం అవసరం. అది విశ్వవిద్యాలయ స్థాయిలో జరిగినా జరుగకపోయినా, సత్యప్రియులైన తెనుగు భాషాభిమానులు ఈ ప్రధాన వ్యత్యాసము యక్షగానాలకు నాటకాలకు మధ్య ఉన్నదని గుర్తించి, యావత్ భారతదేశానికి తొలిసారి నాటక సంప్రదాయాన్ని నెలకొల్పిన తెలుగుదేశపు కళాసంస్కృతులను గ్రహింపగలరని నా విశ్వాసం.

---



# కల్యాణగీతమ్

శ్రీ నోరి నరసింహ శాస్త్రి

శ్రావయ హృది కల్యాణ పదం మే
దర్శయ లలితే! తవ శుభ చరణమ్.

శిం జన్మణిగణ మంజీరాఢ్యమ్
గుంజా మంజా రంజిత చరణమ్........ శ్రావయ...

కిణికిణి రణ దనుకింకిణి కల్యమ్
ప్రణత జగజ్జన పాలన నిపుణమ్....... శ్రావయ....

త్రిపురం త్రిపదం త్రయ్యంతజ్ఞమ్
విజ్ఞానే త్రై విక్రమితం తత్. శ్రావయ...

---



## పశ్చిమ ఆఫ్రికాలో

# ఏకపక్ష రాజ్యాంగ సంక్షోభం

శ్రీ డబ్ల్యు. ఆర్థర్ లూవిస్

[గతసంచిక తరువాయి]

మానవజాతి ఇటీవల కనిపెట్టిన అనేకమైన విషయాలలో రాజకీయపక్షం అన్నది కూడా ఒకటి. వానిలో ఇది పెద్దది ప్రశస్తమైనది కూడాకాదు. కాని ప్రజాస్వామ్య పద్ధతి అంటూ అమలు జరుగుతున్న చోట్లలో మరి యీ రాజకీయపక్షం అన్నది లేకుండా పనులు జరగవు. వానిలో దీని ఆవశ్యకత వుంది. అసంఖ్యాకులైన జనం 'ఓటు' చేయడం అంటూ వుంటే, ఆ 'ఓటు' ఎట్లా వినియోగించడమో గూడా వారు అభ్యసించడం అవసరం. అంతేగాక తాము ఏరకమైన అభిప్రాయాలు, అభినివేశాలు కల్గివున్నారో అటువంటి అభిప్రాయాలు, అభినివేశాలు గలవారితో కలిసిమెలసి వుండటము, వారితో చేతులు కలపడమూ కూడా ఈ ప్రజలకు అవసరం వుంది. పశ్చిమ ఆఫ్రికాదేశాలలో యీ రాజకీయ పక్షాలు ముఖ్యంగా కావాలి. ఎందుచేతనంటే, ఆదేశాలలో ప్రజలకు పెద్ద పెద్ద సమస్యలను గురించి ఏది ఏమిటో తెలియదు— తగాదాలు, పక్షభేదాలు తప్ప. అందువల్ల అక్కడ వారికి యీ అన్ని సమస్యలను గురించిన్నీ తెలియ జెప్పవలసి వుంది. మంచి నాయకత్వము, మంచి రాజకీయ పక్ష వ్యవస్థానము యీ దేశాలలో యీకారణం వలన అవసరం అవుతున్నాయి. ప్రపచంలో ఓటింగు సంగతి చాలాకాలంగా ఎరిగివున్న దేశాలు కొన్నివున్నాయి. ఆదేశాలలో కన్నా యీ పశ్చిమ ఆఫ్రికాదేశాలలో ఈ మంచి నాయకత్వము, యీ మంచి రాజకీయ పక్షాల వ్యవస్థానము అవసరం. ఓటింగు సంగతి ఎరిగి వున్న దేశాలలో ఆయా సమస్యలను గూర్చిన సర్వ విషయాలను జనం తమ అనుభవం వలన తెలుసుకో గల్గుతూ వుంటారు. ఈ దేశాలలో అట్లా జరగదు. అందుకే యీ అవసరం.

ఇప్పుడు యీ కొత్తదేశాలలో ఆ రాజకీయపక్షాలు ఉనికి కొనివుండటం అన్నది దోషంకాదు. ఇక్కడ దోషం ఇది. ఈ పార్టీలు ఐరోపా నుంచి దిగుమతి అయిన రాజకీయ వారసత్వాన్ని వదులుకోలేకుండా వున్నాయి. ఆ రాజకీయ వారసత్వం భాష, పద్ధతి అంతా వర్గపోరాటాలకు సంబంధించిందిగా వుంటుంది. అది యీ దేశాలలో పనిచెయ్యదు. ఈ దేశాలలో కావలసింది, నేర్వవలసింది ఇది. ఈ దేశాలలో తెగలు అధికంగా వున్నాయి. వేరువేరు జాతులు వున్నాయి. ఇవి అన్నీ ఒకదాని ప్రక్కన ఒకటి సయోధ్యను కుదుర్చు కొని బ్రతకవలసిన పరిస్థితి ఇక్కడ వుంది. అందు కోసం ఏమి చెయ్యడమో ఈ దేశాలవారు ఆలోచించు కోవాలి. అనగా యీ దేశాలలోని భాష, పద్ధతులు అన్నీ యీ సయోధ్య సాధించడం ఎట్లాగు అన్న మహాప్రయత్నానికి అభిముఖీనములై వుండాలి.

బహ్వంగ సమాజానికిన్నీ, వర్గ సమాజానికిన్నీ తేడావుంది. ఈ సయోధ్య లేక సంయోజనము అన విషయంవల్లనే ఇది వ్యక్తం అవుతుంది. బహ్వంగ

సమాజాన్నిగూర్చి ఆలోచించే వానికి ఎవనికైనా సరే ఇది ఇట్లా అని వెంటనే తడుతుంది. వర్గ సమాజంలో ఆమాట ఎత్తితే తప్పు. పనికిమాలిన ప్రజాస్వామ్యంలో, ఆ పద్ధతి మూడోరకమో, నాల్గోరకమో అయిన పరిష్కారమార్గంగా మాత్రమే ఎంచబడుతుంది. సాధ్యమైనంతవరకు ఆ పద్ధతిని దగ్గరకు కూడా రానీయరాదు. అట్లా రానీయకుండా వుండడానికి ఓటింగు పద్ధతిలో దొంగపనులు కూడా చేస్తారు. ఇది ఇట్లా జరుగుతుందిగాని, వర్గసమాజాలలో కూడా ఏది మంచి ప్రభుత్వమో అది మిశ్రమ ప్రభుత్వమే; అనగా సయోధ్య ఆధారంగా నడిచే ప్రభుత్వమే. వివాదాలను మూలకు త్రోసి, వాస్తవాలను చేబట్టే ప్రతిఒక్కరికి ఇది ఇట్లా అని తెలుసు. రెండు రాజకీయ పక్షాలు అంటూ వుండి, అందులో ఒకటి ప్రభుత్వాన్ని నిర్వహిస్తూ వుంటే, ఇంకోటి ప్రతిపక్షంలో వున్నప్పుడే ప్రజాస్వామ్యం అన్నది సమర్థంగా శక్తివంతంగా పని చేస్తుంది అన్నమాట ఆంగ్లేయులు, అమెరికన్‌లు కల్పించిన ఒక అబద్ధం. ప్రపంచంలో పెద్దపెద్ద ప్రజాస్వామ్యాలు అన్నింటిలోను రెంటి కన్నా ఎక్కువ పార్టీలు వున్నాయి. పశ్చిమఐరోపాలోని ప్రధాన ప్రజాస్వామ్య రాజ్యాలలో మిశ్రమ ప్రభుత్వాలు పాదుకొని వున్నాయి. ఈ దేశాలలో ఎక్కడైతే రెండు పెద్ద రాజకీయ పక్షాలు అంటూ వుండి పనిచేస్తున్నాయో, అక్కడ కూడా ఆ ప్రతి ఒక్కపార్టీ విధమున్నా సయోధ్య లేకుండా నడవడంలేదు. అది ఒకొక్కటి ఒకొక్క సంయోజనం. బ్రిటన్‌లో కార్మిక పక్షము, కన్సర్వేటివ్ పక్షము వున్నాయి. అమెరికాలో డెమోక్రాటిక్ పక్షము, రిపబ్లికన్ పక్షము వున్నాయి. ఇవి ఒకదానిలో ఒకటి చొరబడినట్లు వుంటాయి. ప్రజాస్వామ్యం యిట్లాగే పని చేస్తున్నది. ఇంకోరకంగా అది పని చేయదు. ఇప్పుడు ఈ రాజకీయపక్షాలే వున్నాయి; ఇందులో ప్రతి రెండుపక్షాలు గనుక, వేరు వేరు సిద్ధాంతాలను అవలంబించి, పరస్పర విరుద్ధమైన సిద్ధాంతాలను పెట్టుకొని, ఒకరు అధికారంలో వుండగా చేసిన పనులను ఇంకొకరు అధికారంలోనికి వచ్చినప్పుడు తిరగద్రోసి వేరేపనులు చేస్తూ వుండే పక్షంలో ఆ పార్టీలకు ఎన్నికలు, బాలెట్ పెట్టె, అక్కడ నిర్ణయం జరగడం మొదలైనవి ఏవీ అక్కర లేదు. వర్గసమాజంలో కూడా, ప్రజాస్వామ్యం అన్నది మన్నికగా నిలిచి వుండాలి అంటే, ఏకపక్షం ద్వారా నెలకొల్పిన ప్రభుత్వానికిన్నీ, రెండు మూడు పార్టీలు కలిసి ఏర్పాటు చేసిన మిశ్రమ ప్రభుత్వానికిన్నీ తేడా, ఇందులో రెండవ పద్ధతిది, తలఒగ్గి సమాధానపడి పని చేస్తుందన్నదే. మొదటిది పూర్తిగా సిద్ధాంతాల మీద నిలబడి చేస్తుందన్నదికాదు. ఈ రెండు రకాల ప్రభుత్వాలు మిశ్రమ ప్రభుత్వాలే; రెండు ప్రభుత్వాలు సమాధానపడవలసిందే; సమాధానపడుతూ నడుచుకోవలసిందే. ఇందులో వున్న తేడా ఇది. మొదటి పక్షంలో వివిధ రకాలైన భావాలు, అభిప్రాయాలు, పురుషార్థాలు కలవాళ్లు ఎన్నికలకు ముందుగా సమాధానపడ్డారు; రెండోపక్షం సందర్భంలో యీ ఎన్నికలు జరిగిన తర్వాత సమాధానపడటం జరుగుతున్నది. ఇంతే.

బహ్వంగ సమాజానికిన్నీ, వర్గ సమాజానికిన్నీ వున్న తేడా మూలంగా అవి ఎంచుకునే ఎన్నికల పద్ధతిలోను పార్లమెంటరీ పద్ధతిలోను గూడా బ్రహ్మాండమైన తేడా సంభవం అవుతున్నది. బహ్వంగ సమాజంలో ప్రజాస్వామ్యంయొక్క ఆదిఅర్థం దగ్గరకు, అసలు అర్థం దగ్గరకుపోవడం వుంది. జరిగిన నిర్ణయంవలన పాలింపబడుతున్న అందరికీ, ఆ నిర్ణయం చేయడంలో సంబంధం వుండాలి. ఆ నిర్ణయం చెయ్యడంలో వారు గూడా పాల్గొనాలి. భాగస్వాములై వుండాలి, అటువంటి అవకాశాన్ని అంగీకరించినప్పుడు, అక్కడ ప్రొపోర్షనల్ ప్రాతినిధ్యం (Proportional Representation) శరణ్యం అవుతున్నది. నిర్ణయాలు చేసే ప్రతి ఒక్క అధికార సంస్థలోను, ఆఖరికి మంత్రి మండలిలోను, అన్ని పార్టీలకు స్థానము లేక ప్రాతినిధ్యము సమకూడిరావలసి వస్తున్నది. వర్గసమాజం ప్రజాస్వామ్యం యొక్క గౌణార్థాన్ని తీసుకొని, దానిప్రకారం పనిచేస్తూవుంటుంది. ఇచ్చట గెలవడమో, ఓడటమో తప్ప ఇంకో మాటలేదు

ఇక్కడ ఇతర వర్గాన్ని లేక వర్గాలను దెబ్బతీసి ఒక్క వర్గానికి మేలు చేయడంఅన్న అధికారాన్ని జనం దగ్గర నుంచి పొందడం మాత్రమే వుంటుంది. ఆ కారణంచేత ఇచ్చట పార్లమెంటుయొక్క వ్యవస్థానం ఆ అధికారాన్ని పట్టుకొని ఆ ప్రభుత్వం నదురు బెదురు లేకుండా పని చేయగలందులకు వీలుగా వుండవలసి వుంది. ప్రొపోర్షనల్ ప్రాతినిధ్యం పద్ధతివలన అనుకున్నట్లు పని జరగని పక్షంలో, దాన్ని త్రోసివేయడం, ఇంకో పద్ధతిని అవలంబించడం జరుగుతుంది. ఏది జరిగినా, ఏదో ఒకపార్టీకి పార్లమెంటులో హాయి అయిన మెజారిటీ రావాలి. మొత్తంమీద ఓట్లు తక్కువ వచ్చినా, ఏదో ఒకపార్టీకి 'సీట్లు' ఎక్కువ వచ్చే పద్ధతి ఏదో అది ఇచ్చట అవలంబించబడుతుంది. ఇచ్చట ఎవరు గెల్చారో, వారిదే విజయం అన్న పద్ధతే గాని, ఇంకో పద్ధతిలేదు. బ్రిటిష్, అమెరికన్ రాజకీయ గ్రంథాలను చూచినట్లయితే ఈపద్ధతికి వానిలో కన్పించే మన్ననకు అంతుగాని, పంతుగాని వుండదు. తదితరమైన వోటింగు పద్ధతులకు, ఎన్నికల పద్ధతులకు (Electoral systems) అనగా వివిధములైన అభిప్రాయాలు కలవాళ్లకు చాలినంత ప్రాతినిధ్యం కల్పించే రకం పద్ధతులకు ఈరకం దేశాలలో పేరుప్రతిష్ఠ వుండవు. వానిని ఆ దేశాలు 'ఛీ' కొడుతూవుంటాయి.

బహ్వంగ సమాజంలో ప్రజాస్వామ్యం గొంతు పిసికివేయడానికి ఒక్కటేమార్గంవుంది. అది ఆంగ్లో—అమెరికన్ ఎలక్టొరల్ పద్ధతులను అవలంబించడం. ఇది తిరుగులేని మార్గం. ఈ ఆంగ్లో—అమెరికన్ ఎలక్టొరల్ పద్ధతి క్రింద ప్రతిఒక్క నియోజకవర్గంలోను 100 కి 51 ఓట్లు చొప్పున ఏపార్టీకి ఓట్లు పడితే ఆపార్టీ పార్లమెంటులో అన్నిస్థానాలు గెలుచుకుంటుంది. పశ్చిమఆఫ్రికా రాజ్యాలలో కొన్ని (గినీ, ఐవరీకోస్ట్, అప్పర్‌వోల్టా, దహోమీ, నైజర్‌లు) ఈ పద్ధతిని ఎంతవరకు తీసుకుపోవాలో అంతవరకు తీసుకుపోయినాయి. ఈ దేశాల రాజ్యాంగాలలో ఏ పార్టీకి ఎక్కువ ఓట్లువస్తే, ఆపార్టీకే పార్లమెంటులోని స్థానాలన్నీ ముట్టజెప్పాలని వుంది. అల్పసంఖ్యాకములైన పక్షాలు ఈ విధంగా పార్లమెంటు ముఖం అంటూ చూడనవసరం లేకుండా చేయబడినాయి. (ప్రభుత్వం ఇక ఇతర పార్టీలను నిల్వనీయకపోవడం అన్నది రాజ్యాంగ సంబంధమైన యీ అపహాస్యపు పద్ధతిని మరింత అపహాస్యపు పద్ధతిగా చేస్తున్నది.) గడి దాటినవారిదే విజయం అన్న పద్ధతిలో ఏ పార్టీకి విజయం లభించాలన్నా, ప్రతిఒక్క నియోజకవర్గంలోను 100 కి 51 ఓట్లు చొప్పున రావలసిన అవసరమే లేదు. ఉదాహరణకు, ఇక్కడ మూడు పార్టీలు వున్నాయి అనుకుందాము. అప్పుడు 100కి 31 ఓట్లు పడితే చాలు గెలుపు లభిస్తుంది. ఇట్లా నాల్గు పార్టీలు అంటూ వుంటే, 100 కి 26 ఓట్లే చాలు. భద్రమైన ప్రజాస్వామ్యాలలో, విశ్వాసం అన్నది తొలగిపోకుండా, ఇంతమాత్రపు బలంతో ప్రభుత్వాల ఆటలు సాగిపోతూ వుంటాయి. అయితే ఒకకొత్త రాజ్యంలో నువ్వు మైనారిటీకి చెందినవాడివై, నిన్ను ఈ రకం పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని ఆమోదించమంటే అప్పుడు నీకు 100 కి 30 ఓట్లు వచ్చి, పార్లమెంటులోని మొత్తం స్థానాలలో 100 కి 20 స్థానాలు మాత్రం రావడమో, లేక అసలే స్థానం లభించకపోవడమో అంటూ జరిగినప్పుడు, నీకు యీ పద్ధతి పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో విశ్వాసం కుదరమంటే కుదరదు. అల్పసంఖ్యాకులు గనుక పార్లమెంటును ఆమోదించాలి అంటే, వారికి ఆ పార్లమెంటులో చాలినంత ప్రాతినిధ్యాన్ని కల్పన చెయ్యాలి. "మీకు కూడా యీ అవకాశం వస్తుంది" అన్న రకం ఆశ చూపించి బెల్లించినంతమాత్రం చేత అది అర్థవంతము గాని, ప్రయోజనకారిగాని కాదు. రెండు పెద్ద పార్టీలు వుండి, (టోరీలు, విగ్గులు) ఒకరి తర్వాత ఒకరుగా ప్రభుత్వాలను చేతులు మార్చుకుంటున్న పద్ధతి అంటూ వున్నప్పుడు "మాకు అవకాశం వస్తుంది" అనే వాదం నిరర్థకం అవుతుంది. అల్పసంఖ్యాక పక్షానికి చెందినవారికి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసే అదృష్టమే పట్టదు; ఒకవేళ ఆ అదృష్టం అంటూ పడితే, వార్స

కూడా పది సంవత్సరాలకు ఒకసారో, ఇరవై సంవత్సరాలకు ఒకసారో ప్రభుత్వ చక్రాన్ని త్రిప్పగల్గుతారు. కాని వారు కోరుతున్నది ఇది కాదు. వారికి కావలసింది ఇది. ఇప్పుడే కాదు, ప్రతిఒక్క సంవత్సరమూ జరిగే నిర్ణయాలలో వారికి కూడా వంతు వుండాలి. ఆ నిర్ణయాలు చేయడంలో వారికి పాలు వుండాలి. అందులో వారు కూడా పాల్గొనాలి.

బహ్వాంగ సమాజంలో, అనేకసభ్యనియోజక వర్గాలను, పెద్దపెద్ద వాటిని, కొద్దిగా ఏర్పాటు చేసి అక్కడ ప్రెపోర్షనల్ ప్రాతినిధ్యపు పద్ధతిని అమలు పరిస్తే, అది ఏకసభ్య నియోజకవర్గాలు అనేకంగల ఎలక్టోరల్ పద్ధతులు చాలా వాటికన్నా మేలుగా వుంటుంది. ఇందువల్ల అల్పసంఖ్యాకులకు సంతృప్తి కల్గడమేగాక, భౌగోళిక సంబంధమైన వివాదాలను కూడా చాలావరకు సర్దుబాటుచేస్తుంది. ఈభౌగోళికమైన వివాదాలు ఒకటికాదు, అనేకం వున్నాయి. జాతికి సంబంధించినవి, మతానికి సంబంధించినవి, ఇంకా ఇతరమైనవి. ఏకసభ్య నియోజకవర్గాల పద్ధతిని అనుసరించాలి అంటే, ఆ నియోజకవర్గాలలో అంతా ఒకే వృత్తి, అభిప్రాయ అభినివేశాలు గల జనం ఆ నియోజకవర్గ ప్రాంతంలో నివశిస్తూ వుండాలి. అప్పుడే వారికి రాజకీయమైన ప్రాచుర్యం లభిస్తుంది. వేరువేరు వృత్తులుగలవారు అభిప్రాయ అభినివేశములు గలవారు భౌగోళికంగా కేంద్రీకృతమై వుండటం ఇక్కడ విషయం. ఉదాహరణకు పచ్చనిజనం వున్నారు; ఎర్రనిజనంవున్నారు. వీరు సమంగావున్నారు. పచ్చనివారు దేశంలో ఒక ప్రాంతంలో నివసిస్తున్నారు. అక్కడే ఎర్రనివారిలో సగంమంది కూడా నివశిస్తున్నారు. వారిలో తక్కినవారు దేశంలో ఇంకో పెడను వుంటున్నారు. పరిస్థితి ఇట్లా వున్నప్పుడు ప్రెపోర్షనల్ ప్రాతినిధ్యం పద్ధతిని గనుక అనుసరిస్తే పచ్చనివారికి, ఎర్రనివారికికూడా సమానమైన స్థానాలు లభిస్తాయి. కాని అక్కడే గనుక ఏకసభ్య నియోజకవర్గపు పద్ధతిని అనుసరిస్తే, ధాని యొక్క ఏర్పాటునుబట్టి ఎర్రనివారికి నాల్గోవంతు స్థానాలు పచ్చనివారికి నాల్గింట మూడువంతుల స్థానాలు లభిస్తాయి. అప్పుడు దేశం పచ్చనివారి దేశమని, ఎర్రనివారి దేశమని విభక్తం అయిపోతుంది. కొంత ఎర్రనివారి భూమి, కొంత పచ్చనివారి భూమి అయిపోతుంది. ఇచ్చట నిజంగా అన్యాయం అన్నది జరుగుతున్నది గనుక, ఎర్రవారు తమ భాగాన్ని తమకు పంచవలసిందని, తాము విడిపోతామని అనవచ్చు. ఇటువంటి పరిస్థితులు ఏర్పడినప్పుడు భారతదేశంలో ముస్లింలు ఇదే పని చేశారు. ప్రెపోర్షనల్ ప్రాతినిధ్యం పద్ధతి కన్నా ఏకసభ్య నియోజకవర్గాల పద్ధతి వలన దేశాలు తొందరగా విభక్తం అయిపోతాయి. ఏకసభ్య నియోజకవర్గం పద్ధతిలో ఇంకో చెడు కూడా వుంది. అది ప్రాంతీయ దురభిమానాన్ని పెంచుతుంది. ఎర్రపార్టీ నాయకులు, పచ్చపార్టీ ప్రాంతంలో నివశిస్తున్న ఎర్రజాతిజనాన్ని మరిచిపోవడం అంటూ సంభవిస్తుంది. కారణం, వారిఓట్లు వీరికి ఆటురావు. నిష్ప్రయోజనం. ఇదేచోట ప్రెపోర్షనల్ ప్రాతినిధ్యం అంటూ అమలు జరిగే పక్షంలో పచ్చవారి భూమిలో నివసిస్తున్న ఎర్రవారికి కూడా సమమైన బలం వుంటుంది. ఎర్రపార్టీలో వుంటుంది. ఎర్రజనం ప్రాంతంలో నివశిస్తున్న జనంలో వారికి తూకం ఏర్పడుతుంది. ఇందువల్ల పార్టీ విధానంలో ఒద్దిక ఏర్పడుతుంది. తీవ్రత తగ్గుతుంది. ఏకసభ్య నియోజకవర్గాల మూలంగా భౌగోళికమైన విభేదాలు ఘనీభవిస్తాయి. గడ్డకట్టుకుపోతాయి. పచ్చవారి భూమిలో వుండే ఎర్రవారికి ఆ పచ్చవారితో చేరడం తప్ప, రాజకీయంగా పైకి రావడానికి మార్గాంతరం అంటూ ఇంకోటి ఏదీ వుండదు. వారు ఆ పచ్చవారి పార్టీలో చేరిపోతారు. ఎర్రవారి భూమిలో నివసిస్తున్న పచ్చనివారు ఎవరన్నా వుంటే, వారు కూడా ఎర్రజాతివారిలో చేరిపోవలసి వస్తుంది. ఇందుమూలంగా పచ్చవారి నేల మరీ పచ్చనిది, ఎర్రవారి నేల మరీ ఎర్రనిది అయిపోయి, ఒకరి నుంచి ఒకరు విడిపోవడం అన్న ప్రమాదం మరీ అధికమవుతుంది. రాజకీయ విభేదాలు తరగడానికి బదులు, పెరుగుతాయి.

వేరువేరు ఎలక్టోరల్ పద్ధతులు, వేరువేరు ప్రయోజనాలు కలవి అయివుంటాయి. ఏకాకారమైన వర్గ సమాజాలలో పనిచేసే పద్ధతులు మార్క్సు పద్ధతులను అనుసరించని బహ్వంగ సమాజాలలో పనిచెయ్యవు. పని చేస్తాయి అనుకొనడం కూడా తప్పే. పక్షభేదం (Cleavage) ఎక్కడ సమస్యో, అక్కడ అల్పసంఖ్యాకులను మన్నన చేసేది, ప్రాంతీయ దురభిమానాలను ఉపశమింప చేసేది, రాజకీయ పక్షాలయందు ఒద్దికను తెచ్చి, తీవ్రతను తగ్గించేది అయిన పద్ధతి మాత్రమే అక్కడ అక్కరకు వస్తుంది; పని చేస్తుంది. ఇటువంటి పద్ధతి ఒక్కటే వుంది. అది "సింగిల్ ట్రాన్స్‌ఫరబుల్ ఓటింగు" పద్ధతితో కూడిన ప్రొపోర్షనల్ ప్రాతినిధ్యం పద్ధతి. ప్రొపోర్షనల్ ప్రాతినిధ్యం పద్ధతిలో జాబితా పద్ధతి అంటూ ఒకటి వుంది. దీని వలన అల్పసంఖ్యాకులకు రక్షణ చేకూరుతుంది. దురభిమానాలను నిరుత్సాహపరుస్తుంది. ఆ కారణంచేతనే యీ పద్ధతి ఏకసభ్య నియోజకవర్గ, బహ్వంగ పద్ధతుల కన్నను శ్రేష్ఠమైనదవుతున్నది. అయితే ఇందులో, ఓటరు పార్టీల మధ్య తన అభిమతాన్ని తెలుపుకోవలసివుంటుంది. సింగిల్ ట్రాన్స్‌ఫరబుల్ (single transferable) ఓటింగుపద్ధతితోఅభ్యర్థిని కూడా ఎన్నుకోగల అవకాశం ఓటరుకు గనుక వుండే పక్షంలో, అప్పుడు ఆఓటరు వివిధ వృత్తులవారికి వివిధ అభినివేశాలు, అభిప్రాయాలు గలవారికి అంగీకారయోగ్యులుగావుండే అభ్యర్థులను ఎంచుకునే అవకాశం కుదిరి వస్తుంది. అప్పుడు రాజకీయరంగంలో పనిచేసే వివిధ శక్తులు తీవ్రతతగ్గి సహనంతో పని చేయవలసిన అవసరం ఏర్పడుతుంది. రాజకీయ పక్షాలు "జాబితాపద్ధతి"ని నాణ్యం చేస్తాయి. సింగిల్ ట్రాన్స్‌ఫరబుల్ ఓటింగు పద్ధతి గిట్టదు. ఇందుకు కారణం వుంది. ఈ పద్ధతి వలన ఓటరుకు అభ్యర్థిమీద పట్టు చిక్కుతుంది. ఏమైనా 'గెలిచిన వాడిదే విజయం' అన్న పద్ధతి కన్నా, బహ్వంగ సమాజాలకు ఈ పద్ధతులలో ఏదైనా మంచిదే.

పశ్చిమఆఫ్రికా రాజ్యాలకు బ్రిటన్‌నుంచి, ఫ్రాన్సు నుంచి దిగుమతి అయిన ఏ ఎలక్టోరల్ పద్ధతులు వున్నాయో, అవి ఎంతమాత్రము తగినట్టివికాదు. వానిని అక్కడివారు తిరస్కరిస్తున్నారంటే, అందులో ఆశ్చర్యానికి కారణంలేదు. ఈ పద్ధతులు ఏ దేశాలలో పుట్టాయో, ఆ దేశాలలోనే అవి ప్రజాస్వామ్య ధర్మ విహితాలన్న పేరును సంపాయించుకోలేకపోయినాయి. అయితే ఆ దేశాలలోవున్న సమాజాలు వర్గ సమాజాలు గనుక, సరేలే అని, వాటితో సరిపెట్టుకుపోవచ్చు. ఇక బహ్వంగ సమాజాలలో అంటే, ప్రజాస్వామ్యాన్ని అప్రతిష్ఠపాలు చేయడానికి యీ ఎలక్టోరల్ పద్ధతులకన్నా, వేరే ఏమీ అవసరంలేదు.

(సశేషం)

—ఎన్‌కౌంటర్ సౌజన్యంతో.]



# పండితారాధ్య చరిత్ర

## శ్రీ నిడుదవోలు వెంకటరావు

(గతసంచిక తరువాయి)

త్రైలింగాణాలోని పిల్లలమఱ్ఱియందు గల ఎఱుకసాని శాసనమున ఇవటూరి సోమనాథయ్యగారు పేర్కొనబడి యున్నారు. ఈ శాసనకాలము క్రీ. శ. 1215. ఆ శాసనమున "మూలస్థానము మాచిదేవరకు అడ్డ ఇవటూరి సోమయ్య ప్రతిష్ఠ చేసిన శ్రీ బేతేశ్వర దేవర శ్రీ ఎరకేశ్వర దేవతలకు మార్తురులు ౨ శంకులకుంటను మార్తురు ఆచంద్రతారార్కముగా ఇచ్చె" అని కలదు.[1]

ఇందు పేర్కొనబడియే ఇవటూరి సోమయ్యయే పాల్కురికి సోమనాథుడు పేర్కొనిన ఇవటూరి సోమయ్య యని చరిత్రకారు లంగీకరించిరి. దీనినిబట్టి చూడగా, పాల్కురికి సోమనాథునికి పండితారాధ్యునికి నడుమ రెండు తరములు మాత్రమే గడచినట్లు స్పష్టమగుచున్నది.

### పాల్కురికి సోమనాథుడు కాల విపర్యాసము (1)

ఈ గ్రంథము ప్రకటితమగు వఱకు—అనగా క్రీ. శ. 1939 కి పూర్వము సోమనాథుని కాలము క్రీ. శ. 1220 ప్రాంతమని యేర్పడియుండెను. విమర్శకులు దీని నంగీకరించిరి.[2] వాస్తవిక స్థితి యిట్లుండగా, ప్రస్తుత గ్రంథము యొక్క ఉపోద్ఘాతము 16, 17 వ పుటలలో పీఠికాకర్త లిట్లు వ్రాసిరి.

పండితారాధ్య చరిత్రోపసంహార వాక్యములలో కేదారయ్యపుత్రులునలుగురి "ఆత్మసంతానతనయ పరంపరోత్తర పరంపరలఁ బరిఢవిన గురు పరంపర దేజరిల్లు" అని చెప్పబడి ఉన్నది. అంటే వారి తర్వాత అనేక తరములు గడచినవని అర్థము నస్తుందికాని సోమునికాలములో వారున్నారని చెప్ప వీలులేదు. అట్టి శైవ సంతాన విమలాంబునిధి మధ్య విభ్రమానర్ఘ్య నాయకరత్నమై ఒప్పారు ఇవటూరి సోమనాథయ్యగారి ముగ్గురు పుత్రులయిన సూరీశ్వరుడు విశ్వనాథప్పయ్యవారు, సింగణమంచిగారు గురుత్రితయముగా పేరు పొందినారు. ఆ "గురుత్రితయాన్విత తనయ పరంపరోత్తర పరంపరలఁ బ్రభుతర గురు పరంపర దేజరిల్లె" అంటే సోమనాథునికిన్నీ పండితారాధ్యునికిన్నీ మధ్య "చాలా చాలా తరముల" అంతర మున్నదని సుస్పష్ట మవుతున్నది.

పరిష్కర్తలు— 'చాలాచాలా తరముల అంతరము' అన్నారు గాని, ఎన్ని తరములో చెప్పలేదు. ఆపైని, నేను ముందఱ చూపినట్లుగా, పూర్వ ప్రతులలో ఉన్న పాఠములను మార్చినారు. కేదారయ్య తనయులను గూర్చి 'తేజరిల్ల' అని పాఠమున్నది. దానిని 'తేజరిల్లు' గా నుదాహరించిరి. ఇవటూరి సోమనాథయ్య తనయులను గూర్చి చెప్పునప్పుడు పూర్వ ముద్రణములలో 'తేజరిల్లు' అనియు వ్రాత ప్రతులలో 'తేజరిల్ల' అనియు నుండగా, పరిష్కర్తలు "తేజరిల్లె" అని పాఠముతో నిచ్చిరి. (చూడుడు: పై—31, 49 పంక్తులు-). కాని యీ పాఠముతో నిచ్చినందువలన గలిగిన యనర్థమును వారు విచారింపలేదు.

"ప్రభుతర గురుపరంపర తేజరిల్లె" అను పాదమునకు వెనువెంటనే-"త్రిభువనంబులఁ బర్వె" అని కలదు. అప్పుడు— "తేజరిల్లె" అను సమాపక క్రియకు, త్రిభువనంబులు బర్వె— అను దానిలో 'పర్వె' అను సమాపక క్రియకు అన్వయ మెట్లు ?—ఆ వెనుక—తా నిట్లు కృతి సమాప్తంబయ్యె అను మఱియొక సమాపక క్రియ కలదు. దానికి సమన్వయము చేయలేదు.

పై భాగమున, "తనయ పరంపరోత్తర పరంపరలు—" అని ఉన్నంత మాత్రమున—మొదట పేర్కొనిన పురుషులకు పాల్కురికి సోమనాథునికి చాలా చాలా తరము లున్నవనుట ఎంత మాత్రమును సరికాదు. అట్లయినచో, ఒక్కొక్కరిని గూర్చి చెప్పిన తరువాత—తరములను గూర్చి చెప్పునప్పుడు క్రియలు

---

1 Corpus of descriptions in the Telingana Districts of H. E. H. the Nizams Dominions. తెలింగాణా శాసనములు.

2. (1) కీర్తిశేషులు కొమఱ్ఱాజు వెంకటలక్ష్మణరావు గారు. (2) కీర్తిశేషులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. (3) శ్రీ బండారు తమ్మయ్యగారు.

భూతకాలికములుగా నుండవలెను. ఇందట్లు లేనేలేవు. చూడండి.

| | | |
|---|---|---|
| పంక్తి | 18 | రాజ్యము సేయుచుండె— |
| | 23 | క్రియగొన |
| | 24 | గావింప |
| | 26 | చెప్పనొప్పు |
| | 31 | తేజరిల్లు |
| | 40 | ఒప్పారి |
| | 42 | వెలుంగ |
| | 49 | తేజరిల్లు |
| | 50 | సర్వే |
| | 53 | బయ్యె |

ఇందు "రాజ్యము సేయుచుండె" అనునది—'ధృతరాష్ట్రుడు "రాజ్యము చేయుచుండె"- అను నన్నయ ప్రయోగము వంటిదే- (ఆది. 5—6). 'రాజ్యము చేయుచుండగా' అని అర్థము.

ఇక, క్రియగొన—గావింప—వెలుంగ— అనునవి అన్నంతా సమాపక క్రియలు; చెప్పనొప్పు, తేజరిల్లు అనునవి తద్ధర్మార్థకములు. 40 వ పంక్తిలో ఒప్పారి—అనునది క్త్వార్థకము కాదు.

ఒప్పారి + ఇవటూరి—ఒప్పారివటూరి — క్త్వార్థకసంధి కాదు. ఇచట ఒప్పారున్ + ఇవటూరి—అని పదచ్ఛేదము— ఒప్పారున్ అనునది తద్ధర్మార్థక క్రియా విశేషణము. బాల వ్యాకరణమున "ఉదంతమగు తద్ధర్మార్థ విశేషణమునకు నచ్చు పరమగునపుడు నుగాగమంబగు" అని సంధి—33 వ సూత్రము గలదు.— దీని ననుసరించి,

ఒప్పారు + ఇవటూరి—ఒప్పారు నివటూరి—అని కావలెను. కాని యీ సూత్రమునకు— పూర్వమందే — అపవాదము లున్నవి. బాల వ్యాకరణ వ్యాఖ్యాతలు – హంసవింశతిలోని 'వెడలగ్ని దీప్తులు' అనిమాత్రమే చూపిరి. శివతత్త్వసారములో బొందనాథ నాథ మహేశా (పద్యము 147) అనియు, ధూర్జటి శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యములో చిందవృతంబు (4— 32) అనియు ప్రయోగములు గలవు.

సారాంశ మేమనగా, ఏ ఒక్కచోటనైన భూతకాలిక క్రియయే కావించె, వెలింగె—అని ప్రయుక్తము కానప్పుడు 'చాలా చాలా' తరముల వెనుక యని యెట్లు వ్రాయబడి యున్నదో దురూహ్యము.

పరిష్కర్తలు వ్రాసినట్లు, పాల్కురికి సోమనాథునికి పండితారాధ్యులకు "చాలా చాలా తరములు" గడచినట్లయితే సోమనాథుడు కేదారయ్య శిష్యుడగు—ఇవటూరి సోమనాథయ్య ఆయన పుత్రులను ముప్పురను గూడ ఎట్లు పేర్కొన గలిగి నాడు ? కొన్ని తరములే గడిచిన యీ వంశమున తన కాలమున నున్నవారి పేరు చెప్పకుండ కావ్యము నెట్లు ముగించును? అన్న ప్రశ్నలు వారికి కలిగినట్లు లేదు.

తరములు చెప్పకయే పాల్కురికి సోమనాథుడు పండితారాధ్యునికి చాలా వెనుక నున్నాడని నిరూపించుటకుగాను—16 వ పుటలో పరిష్కర్త లిట్లు వ్రాసియున్నారు.

"సోమునికి బసవన గురించి బొత్తిగా స్వయముగా తెలియదన్న మాట స్పష్టము.

అనదృశంబై యొప్పు బసవపురాణ
మెసకంబుతోఁ జెప్ప నిష్టమయ్యెడిని
వరకథా సూత్రంబు నెర వెలిఁగించి
చరితార్థుఁజేయరే కరుణతో ననుచు

పెద్దలకు విన్నవింపగా వారు సోమనకు చెప్పిన బసవన కథలనుబట్టి అతను బసవపురాణమును రచించినట్లు చెప్పుకొన్నాడు.

<u>అట్లే పండితారాధ్య చరిత్రలోని విషయములు కూడా అతడు పెద్దలవల్ల తెలుసుకొన్నవే."</u>

ఈ వాక్య మాపాత రమణీయము. పండితుని గూర్చిన విషయములు సోమనాథు డెంత మాత్రమునూ పెద్దలవలన తెలుసుకొన్నవి కావు. అతడు పండితుని విషయమున పెద్దల వలన తెలుసుకొన్న ట్లెచ్చటనూ వ్రాసియుండలేదు. ప్రస్తుత ముద్రణమునందే, అవతారికా భాగమున నీ కావ్యరచనా సందర్భమున నెట్లున్నదో చూడుడు.

శ్రీశైలమున, భక్తులు, మాహేశ్వరులు ఒడ్డోలగమున నుండి సోమనాథుని చూచి యిట్లు విన్నవించారు.

. . . తొల్లి విఖ్యాతిగాఁ బ్ర
శస్తి సద్భక్త ప్రసాదాతిశయత
ఖ్యాతిగా సద్భక్త గణ లాలనముగ
నూతనంబుగ, జగన్నుతముగా మున్ను
బసవపురాణ మొప్పఁగ రచించితివి;
బసవపురాణ ప్రబంధఁబునందు,
ప్రథిత పురాతన భక్త గణాను
కథనంబు లితిహాస ఘటనఁ గూర్చితివి
వరవీర భక్తి సవైదికంబుగను
విరచించితివి 'చతుర్వేద' సారమున
బసవన్న మహిమశుంభద్భక్తి యుక్తిఁ
బసరించితివి గద్య పద్యాది కృతుల
నార్ణవావృతధాత్రియం దొప్ప బసవ
వర్ణనల్ జేసితి వరుసను నీను
లారంగ గురు మల్లికార్జున పండి
తారాధ్యుల చరిత్ర మర్థి వర్ణింపు
పరిశిష్ట పరిమిత ప్రాక్తన భక్త
చరితంబు లితిహాస సంగతి నొలయ
సంధింపుఁ బండితు చరితంబునందుఁ
బంధుర తన్మహా భక్త్యైక మహిమఁ

బసరింపు మసవ వాక్పాటవ శక్తి
నసలార నొసగితివని ప్రసాదింప.'' (పుట. 11, 12)

సోమనాథుడును భక్త మాహేశ్వరుల యాజ్ఞను శిర సావహించి తనను గూర్చి చెప్పుకొని, పాల్కురికి సూరనామాత్యుని శ్రోతగా నెన్నుకొని 'రచియింతుఁ బండితారాధ్య చరిత్ర' అని ప్రారంభించినాడు.

పైని యుదాహరించిన భాగములో నెచ్చటనూ సోమనాథుడు పెద్దలవలన పండితుని గూర్చి తెలిసికొన్నట్లు లేదు. భక్తులే, ''బసవపురాణమును, చతుర్వేదసారమును రచించినావు. బసవపురాణములో పురాతన భక్తుల చరిత్రలు చెప్పినావు. బసవన్నను గూర్చి, గద్య పద్య కృతులు వెలయించినావు. అతని గూర్చి పురాణము రచించినట్లే మల్లికార్జున పండితారాధ్య చరిత్రను నీవు రచింపవలసినది. అంతేకాదు—బసవపురాణములో చెప్పకుండా విడిచిన భక్తుల చరిత్రలను పండితారాధ్య చరిత్రలో చెప్పవలసినది. అట్టి రచన చేయడానికి తగిన వాక్పాటవశక్తిని నీకు ప్రసాదించాము'' అని అన్నారు.

దీనినిబట్టి పండితుని గూర్చిన సమస్త విషయములే కాక తక్కిన పురాతన భక్తుల చరిత్రలు కూడా, సోమనాథునికి కరతలామలకములనీ, అతనికి వేఱొకరు చెప్పవలసిన యావశ్యకత లేదని స్పష్టపడుతున్నది. ఇంతేకాక, పండితారాధ్య చరిత్ర రచించడానికి శ్రుతి స్మృతి పురాణేతిహాస విజ్ఞానము చాలా అవసరము. దానిని సోమనాథు డంతకుముందే సంపాదించినట్లు ఇందులో పేర్కొనబడిన చతుర్వేదసారము సూచిస్తున్నది. పై సందర్భమునుబట్టి సోమనాథునికి, పండితారాధ్య చరిత్ర రచించడానికి అర్హత, సామర్థ్యము అప్పటికే సంపూర్ణముగా నున్నవని ఆ చరిత్ర రచించుటకు తగిన శక్తిని మాత్రమే ప్రసాదించామని భక్తులు చెప్పిరి. దీనివలన ''పండితారాధ్య చరిత్రలోని విషయములు కూడా అతడు పెద్దలవల్ల తెలుసుకొన్నవే'' అన్న మాట పరాస్తమైనది గదా. ఇక సోమనాథుడు పండితారాధ్యులకు రెండు తరముల తరువాత మాత్రమే ఉన్నాడని బుజువు చేయుటకు బలవత్తరమైన ప్రమాణాన్ని చూపుతున్నాను.

## కన్నడ పండితారాధ్య చరిత్ర

సోమనాథుని బసవపురాణము, మొదట కన్నడభాషలోనికి ఆనెనుక సంస్కృతభాషలోనికి అనువదింపబడినట్లే పండితారాధ్య చరిత్ర కన్నడ భాషలోనికి, సంస్కృతభాషలోనికి పరివర్తితమైనది. క్రీ. శ. 1450 ప్రాంతమున 'గురురాజకవి' యను నతడు పండితారాధ్య చరిత్రను సంస్కృతమున వ్రాశాడు.3 ఆ శివమయుఖుని యేండ్లయిన వెనుక నీలకంఠాచార్యుడు దీనిని కన్నడభాషలోని కనువదించాడు.4 ఈ వివరాలు పీఠికలో ఈయవలసిఉన్నా, పరిష్కర్త ఈయలేదు. ఈ సంస్కృత, కన్నడానువాదములకు రెండింటికి తెలుగు పండితారాధ్య చరిత్రే మూలము. ఈ విషయము స్పష్టపఱచడానికి కన్నడ పండితారాధ్య చరిత్రయొక్క వివరణము లిస్తున్నాను.

పండితారాధ్య చరిత్ర కన్నడభాషలో అనువదించిన కవి నీలకంఠాచార్యుడు. ఇతడు క్రీ. శ. 1482—94 ప్రాంతాలలో మైసూరును పాలించిన వీరరాజేంద్ర వొడయరు కాలమువాడు కావున నితని కాలము సునిశ్చితమే.

ఈతడు పాల్కురికి సోమనాథుని కవిస్తుతిలో స్తుతించుటే గాక సోమనాథు డాంధ్రభాషలో రచించిన కృతినే తాను కన్నడించినట్లు చెప్పుకొన్నాడు. మతగ్రంథము కాబట్టి తూ. చ. తప్పక అనువదించాడు.

కన్నడ కృతి వార్ధక షట్పదీ వృత్తములతో రచింపబడినది ఇందు తెలుగులో వలె అయిదు ప్రకరణము లున్నవి. 65 సంధులుగల పద్య సంఖ్య 3069. గ్రంథాంతమున నాతడు వ్రాసిన వాక్యములను కన్నడ భాషలోనే ఉదాహరించుచున్నాను

''పండితేశ్వర నమగ కేదారార్యనిగె, జగదారాధ్య పట్టి నాయులు. పండితేశ్వరనకరజాత నాద దొన నార్యనిగె భక్తి రాజ్యద పట్టనాయును. కేదారదేశికన మక్కళు (1) మను పండిత, (2) చెన్నవిభు, (3) మహాదేవ, (4) భీమన పండిత ఈ సంతతి యల్లి ఇవటూరి గురు సోమనాథను హుట్టిదను. ఇవన మక్కళు (1) విశ్వనాథ, (2) సూరీశ్వర, (3) సింగణమంచార్య.

శ్రీగిరియల్లియ శివభక్తరు పాల్కురికి సోమేశ్వరనన్ను కరదు పండితారాధ్య చరితవన్ను బరె యెనలు: అతను ఆంధ్ర భాషదల్లి బరదంతయూ దన్ను తాను కన్నడ దల్లి రచిసి దంతయూ కవి హెళుత్తాన.''

క్రీ. శ. 1480 ప్రాంతములో అనువదింపబడిన కన్నడానువాదమున పండితారాధ్యుని వెనుక రెండు తరములు మాత్రమే యున్నవని ఇవటూరి సోమనాథయ్య కుమారులను ముగ్గురిని పేర్కొనడముచేత పై కన్నడానువాదము, తు. చా. తప్పక తెలుగు ననుసరించినదని చెప్పవచ్చును.

ఉపోద్ఘాతములో నెచ్చటను పై విషయము లేనందున ''సోమనాథునికిన్ని పండితారాధ్యునికిన్ని చాలా చాలా తరముల అంతర మున్నదని సుస్పష్టమవుతున్నది.'' అన్న వాక్యము నిరాధారమని, నిష్ప్రమాణమని సుస్పష్టమవుతున్నది.

తమ వాదము నాధారము చేసికొని పీఠికాకర్త లిచ్చిన సోమనాథుని గ్రంథ రచనా కాలమును వివరిస్తున్నాను.

పుట. 19 ''సోమనాథుడు క్రీ. శ. 1247—1280 సంవత్సరములకు మధ్యకాలమున ప్రసిద్ధి కెక్కినవాడు.''

3. ఇది కన్నడార్థములతో, శ్రీ కటీ బసప్పశాస్త్రిగారిచే మైసూరిలో ప్రకటితమైనది.

4. కర్ణాట కవి చరితె. సంపుటము. 2. పుటలు 133—135.

5. కన్నడమున శైవకవుల కృతులలో—ఆశ్వాసవిభాగమునకు 'సంధి' యందురు.

"బసవపురాణ రచనా కాలము క్రీ. శ. 1267 అని యిప్పటికి నిర్ణయించవచ్చును."

పుట. 22 అతడు పండితారాధ్య చరిత్రమును క్రీ. శ. 1300 సం. ర ప్రాంతమున రచించి ఉంటాడని నిశ్చయించ వచ్చును. సోమనాథుడు ..... రెండో ప్రతాప రుద్రుని కాలములోను కూడా ఉన్నవాడు .... ప్రతాపుని కాలమున కాతడు వృద్ధాప్యమును పమీ పిస్తూ శిష్యులతో సంచారము చేస్తూ ఉండేవాడు.

పైవానినిబట్టి క్రీ. శ. 1300 ప్రాంతమునకు సోమ నాథుని జీవితముకాక కవితాజీవితము మాత్రము ముగిసినదని చెప్పవచ్చును.

సోమనాథుని కాలనిర్ణయమును గూర్చి పైని క్రీ. శ. 1939 లో వ్రాసిన విషయములు చర్చింపకుండగనే, కీర్తి శేషులు మల్లంపల్లి సోమశేఖర శర్మగారు మరి ఆరేండ్ల తరు వాత క్రీ. శ. 1945 లో పిడుపర్తి సోమనాథుడు వ్రాసిన పద్య బసవపురాణావతారిక ననుసరించి, క్రీ. శ. 1290 నాటి నీలగంగవరశాసనము నాధారము చేసికొని సోమనాథుడు రెండవ ప్రతాపరుద్రుని కాలములోని వాడని నిర్ణయించారు.[6] వానిలో ముఖ్యాంశములు.

పుట. (108) అ. "ద్విపద బసవపురాణము పదమూడవ శతాబ్ది కడపటి దశకమున శ్రీమత్కాకతి ప్రతాపరుద్ర దేవమహారాజు రాజ్యమునకు వచ్చిన క్రొత్తలో రచియింపబడెనని చెప్పవచ్చును."

పండితారాధ్య చరిత్రమును పాల్కురికి సోమ నాథుడు 1320 కి పూర్వము రచియించి యుండును. ఎట్లయినను బసవపురాణ పండితా రాధ్య చరిత్రలు. క్రీ. శ. 1290 కిని క్రీ. శ. 1320 కిని నడిమి కాలమున బుట్టిన గ్రంథములు."

పై వాక్యములలో రచనా కాలములోనే సందిగ్ధత ఉన్నది.

"బసవ పురాణము— కాకతి ప్రతాపరుద్రుడు రాజ్యము నకు వచ్చిన క్రొత్తలో రచితమైనది." అంటే అతని రాజ్య ప్రారంభము క్రీ. శ. 1295 క్రొత్తలో ననగా క్రీ. శ. 1295 లేక క్రీ. శ. 1296 అగును. అప్పుడు బసవ పురాణము రచనము క్రీ. శ. 1296.

ఇక పండితారాధ్య చరిత్ర రచనా కాలము స్పష్టము గాదు. క్రీ. శ. 1320 కి లోపుగానని పైన కలదు. అది ఎప్పుడో చెప్పబడలేదు. దీనికి కారణము లేకపోలేదు. ఈ వ్యాసమునందే 105 వ పుటలో నిట్లున్నది. "అతడు (సోమనాథుడు) కన్నడ భూమికి వెళ్లినది క్రీ. శ. 1309 ప్రాంతమునగాని క్రీ. శ. 1320 ప్రాంతమునగాని కావచ్చును." సోమనాథుడు కన్నడ భూమికి వెళ్లినది అతని జీవితము చరమ దశలో— ఆకాలము నకుముందే పండితారాధ్య చరిత్ర రచన జరిగినది. 1309 లోనే కన్నడభూమికి సోమనాథుడు వెడలి చో అంతకుముందే పండితారాధ్య చరిత్ర రచన జరిగియున్నది కాబట్టి బసవ పురాణ రచనా కాలము క్రీ. శ. 1295 గా నిదివరకే నిరూపింప బడియున్నది గావున సోమనాథుని కావ్య రచనా జీవితమంతయు 1295—1309—14 సంవత్సరములు మాత్రమే అగు నని సందేహించి వ్యాసకర్తలు—పండితారాధ్య చరిత్ర రచనా కాలము సందిగ్ధముగా నుంచినారు. దీనివలన సోమనాథుని కాల మును గూర్చి వ్యాసకర్తలకే నిర్దిష్టమైన అభిప్రాయము లేదని స్పష్టమగుచున్నది.

ఇది సోమనాథుని గ్రంథాలను పరిశీలింపకుండా, సోమ నాథునిగూర్చి—ఇతరులు వ్రాసిన దానిని గ్రహించడముచేత కలిగిన అవ్యవస్థ. సోమనాథుని కాలాన్నిగూర్చి భాషా సాహిత్యాల లోను, చరిత్రలోను నిష్ణాతులైన ఇరువురి అభిప్రాయాలు ఎంత వ్యత్యాసములుగా ఉన్నవో చూడండి.

చి. నా. గారి ననుసరించి—బసవపురాణ రచనా కాలము క్రీ. శ. 1267

మ. సో. ,, ,, ,, బసవ పురాణ రచనా కాలము క్రీ. శ. 1295

చి. నా. ,, ,, పండితారాధ్యచరిత్ర రచన క్రీ. శ. 1300

అప్పుడు మ. సో. గారి ననుసరించి—బసవ పురాణ పండితా రాధ్య చరిత్ర రచనలకు 5 యేండ్లకాలమే మధ్య వ్యవధి యున్నదన్నమాట—అందుచేతనే క్రీ. శ. 1320 వరకును పొడిగింపు.

చి. నా. గారి ననుసరించి సోమనాథుడు క్రీ. శ. 1300 అయిన తరువాత వృద్ధుడు. మ. సో. గారి ననుసరించి సోమ నాథునికి వృద్ధత్వములేదు. అతని జీవిత కాలము—క్రీ. శ. 1295 లో ప్రారంభమై క్రీ. శ. 1320 లోపుగా ఎప్పుడో ముగిసినది. కేవలము అసంగతములుగానున్న పై విషయములను గూర్చి పాఠకలోకమున కింతకంటె వివరింపవలసిన పనిలేదు.

పరిస్థితు లిట్లుండగా, పై యిరువురి కాలనిర్ణయాల కంటెవిపరీతముగా సోమనాథునికాలముక్రీ.శ. 1280—1340 ప్రాంతమని నిర్ణీతమైనది.[7] దీనినిబట్టి ఈ వాదము ప్రతిపా

6. పాల్కురికి సోమనాథుని కాలము—భారతి ఫిబ్రవరి 1945. పుటలు 102—108 చ. ఇందలి విషయము లన్నియు భారతి ఆగస్టు 1945—107—117 పుటలలో పూర్తిగా విమర్శితములైనవి.

7. పాల్కురికి సోమనాథు డెప్పటివాడు - డాక్టరు నేలటూరి వెంకట రమణయ్యగారు—పుటలు 112. వావిళ్ల ముద్ర ణము—1955. ఈ గ్రంథము సంపూర్ణముగా ఖండితమైనది. చూడుడు. పరిశోధన - సం 9-10 ఆగస్టు-నవంబరు1955. పాల్కురికి సోమనాథ సంచిక 9—36 పుటలు. ఈ పత్రిక ప్రస్తుతములేదు.

దించిన వారిలోనే సోమనాథుని కాలమునుగూర్చి నిశ్చితాభిప్రాయములు లేవని స్పష్టమగుచున్నది. పాఠకులకు సుగమముగా నుండుటకై ఆ వాదములనుబట్టి కాల నిర్ణయముల నీ క్రింద నిచ్చుచున్నాను.

| | | |
|---|---|---|
| మొదటి మతము | క్రీ. శ. 1247—1300 | వృద్ధత్వము |
| రెండవది | ,, 1295—1320 | లోపు |
| మూడవది | ,, 1280—1340. | |

ఈ మూడింటిలోను వ్యత్యాసాలున్నవి. మొదటి దాని ననుసరించి పాల్కురికి సోమనాథుడు క్రీ. శ. 1300 లకు వృద్ధుడు. రెండవ దానినిబట్టి పాల్కురికి రచనా ప్రారంభం క్రీ. శ 1295 లో. మూడవది—పాల్కురికి జీవితం ద్వితీయ ప్రతాపరుద్రుని కాలం వెనుక—17 సంవత్సరాలవఱకూ ఉన్నది. ఇది సర్వాత్మనా విరుద్ధము. ఇవన్నీ పాల్కురికి సోమనాథునిగూర్చి పిడుపర్తి సోమనాథుడు చెప్పిన అంశాలనిబట్టి కిట్టించినవే గాని సప్రామాణికంగా బుజావు చేయబడినవికావు. పిడుపర్తి సోమనాథుడు చెప్పిన ముఖ్యాంశములు రెండు. 1. పాల్కురికి సోమనాథుని బసవ పురాణము ప్రతాపరుద్రుడు వినుట. 2. ఆతడు దేశము తురుష్కాక్రాంతము కాకముందు—దేశమును విడుట. అయితే యీ రెండింటిని ఆధారము చేసికొన్నందువల్ల ఎట్టి అనర్థకము గలిగినది నిరూపించుచున్నాను.

(1) పిడుపర్తి సోమనాథుని కథ ననుసరించి బసవ పురాణము పాల్కురికి సోమనాథుని చివర కృతి—అనగా అప్పటి కాతని జీవిత మంతయు గడచినది. కాబట్టియే పాల్కురికి సోమనాథుడు "దేశంబిక తురుష్కాక్రాంతము కాగలదు. మాబోటి నియమస్థుల కిందునికి పొందుపడదని—కన్నడభూమి కరిగి వార్ధకమువచ్చెనని సమాధి స్థితుడయ్యెను." ఇవి పిడుపర్తి సోమనాథుని వాక్యములు. దీనినిబట్టి బసవపురాణ పఠనమైన కొలది కాలమునకే పాల్కురికి సోమనాథుడు—కన్నడభూమికి వెడలుట జరిగినది. కాబట్టి బసవపురాణ మీతని యంత్య కృతి. దీనికి—పైవారివ్రాత లెంత విరుద్ధముగనున్నవో చూడుడు. వారి మతము ననుసరించి బసవపురాణము—మొదటి కృతి:—ఇక దీని కెట్లు సమన్వయము? పండితారాధ్యుని వెనుక చాలా చాలా తరముల వెనుకకు సోమనాథుని తీసికొని వచ్చుటకు పిడుపర్తి సోమనాథుని "దేశంబిక తురుష్కాక్రాంతంబు కాగలదను వాక్యము—" వీరికి ప్రధానాధారమైనది. అప్పుడు సోమనాథుడు ద్వితీయ ప్రతాపరుద్రుని కాలమువాడైనాడు. కాని—ఈ వాక్యమున కాధారము బసవపురాణ రచన. అదియును ద్వితీయ ప్రతాపరుద్రుని కాలమునకు దీసికొని వచ్చిరి. కాని చిక్కేర్పడినది. పిడుపర్తి ననుసరించి పాల్కురికి బసవపురాణ రచన చివరిదైనది. అది పాల్కురికి రచనా ప్రణాళికకు విరుద్ధము. ఇట్లొక దాని గ్రహించిన ఒక విపర్యాసము—మరొక దానిని గ్రహించిన మఱియొక విపర్యాసము ఏర్పడు చున్నవి. కాని పైవారు దీనిని గమనించినట్లే కానరాలేదు. వారికి కావలసినది పాల్కురికి సోమనాథుడు—ద్వితీయ ప్రతాపరుద్రుని కాలమువాడని చెప్పుటయే. తక్కిన సంగతులు వారి కనావశ్యకము.

ఈవిషయ మింతటితోపోలేదు—నిరాధారమైన యీకాల నిర్ణయాన్ని అనుసరించి, విచక్షణలేకుండా, వాఙ్మయ చరిత్రలలో పాల్కురికి సోమనాథునిగూర్చి వ్రాయుట తటస్థించినది.[8] "ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సర్వస్వము" అను గ్రంథమున పాల్కురికి సోమనాథుడు శివకవులలో పరిగణితుడుగాక—కవిత్రయానుసారులగు కవులలో చేర్చబడినాడు (పుటలు—492—552). సర్వాంధ్ర వాఙ్మయ చారిత్రక సాహితీ విమర్శకాభిప్రాయము లన్నింటికి—అత్యంతమూ విరుద్ధమైన యీ రచనను గూర్చి, యింతకుముందే—"పాల్కురికి సోమనాథుడు శివకవికాడా"[9] అను వ్యాసమున - సంపూర్ణముగ చర్చించి పై కాల నిర్ణయమునందలి అవ్యవస్థను, అప్రామాణికతను—వెల్లడి చేసియున్నాను.

పండితారాధ్య చరిత్రయొక్క ఉపోద్ఘాత మూలంగా ఈ వాదాన్ని ప్రతిపాదించినవారు.....వారిని అనుసరించి వ్రాసిన రచయితలూ సోమనాథుని కాలాన్నిగూర్చి చర్చించినప్పుడు—మత ప్రచార దృష్ట్యా సాహిత్య పరిణామదృష్ట్యా సమకాలిక సాంఘిక చారిత్రక దృష్ట్యా—దీని నెంతమాత్రమూ పరిశీలించినట్లు కానరాదు. అట్లు పరిశీలించడమే సక్రమమూ, శాస్త్రీయమూ అయిన పద్ధతి. దీనిని కొంత వివరిం.

## 1. మతము

క్రీ. శ. పన్నెండవ శతాబ్దిలో, కర్ణాటాంధ్ర దేశముల బసవన పండితారాధ్యుల మూలమున ప్రవర్తిల్లిన వీరశైవ మతమును ప్రథమముగా ప్రచారమునకు దెచ్చి—ఆ మతమును నీ రెండు దేశములలో సుప్రతిష్ఠితము చేసినది పాల్కురికి సోమనాథుడే యని—యందఱు నేకగ్రీవముగా—అంగీకరించిన విషయము. క్రీ. శ. 1050 ప్రాంతముననున్న నన్నయకువెనుక క్రీ. శ. 1250—60 ప్రాంతముల నున్న తిక్కనకుముందు తెలుగుదేశమున—వీరశైవ మతము విజృంభణకాలమని—సాహిత్య మంతయు, శైవ సాంప్రదాయికమేనని అది దేశిరీతుల ననుసరించినదని ఆకారణముచేతనే, మార్గసంప్రదాయానుసారియైన నన్నయ్య మొదలుపెట్టిన భారతము—తరువాతి రెండు శతాబ్దులుపైనగాని— తిరిగి పూర్తి యగుటకు తగిన పరిస్థితి యేర్పడలేదని విమర్శకులు చెప్పిన విషయమందఱికు పరిచితమే. అప్పుడు—పాల్కురికి సోమనాథుడే క్రీ. శ. 1290—1323 ప్రాంతమువాడైనచో—అతడు తిక్కనకు తరువాతివాడగుచున్నాడు. అప్పుడు—

8. ఇది మదరాసు విశ్వవిద్యాలయ ప్రకటితము. గ్రంథకర్త శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రిగారు.

9. భారతి—జూన్ 1962.

(1) వీరశైవ మతవ్యాపనము—తిక్కన భారత రచనానంతరమున తెనుగు దేశమున జరిగినదా? అట్లయిన తిక్కనకుముందు దేశమునన్న మతమేది? క్రీ. శ. 1320 నాటికి ఎఱ్ఱన రచన పూర్తియై—తెలుగు భారతము సంపూర్ణముగా అవతరించినది— భారతమువెనుక శైవమతము వ్యాప్తి చెందిన దనుట కాస్కారమున్నదా?

(2) బసవనగూర్చి—తనకు తెలియదనియు— పెద్దలవలన నాతని చరిత్ర సమకూర్చితిననియు చెప్పి— పండితారాధ్యుని వెనుక మొదటి రెండు తరములవారిని మాత్రమే సోమనాథుడు పేర్కొనుట—వారి తదనంతరము నూటయిరువది యేండ్ల తరువాత ఎట్లు పొసగినది?

(3) తిక్కనకుముందు దేశమున వీరశైవ మతము విజృంభించెననియు, వైష్ణవము, కొంతగా వ్యాప్తిలో నున్నదనియు— మత విద్వేషములతో చీలికలైన సంఘమున మత సామరస్యము కల్పించుటకే—తిక్కన—''హరిహరాద్వైతమును'' నెలకొల్పెనని వాఙ్మయ చరిత్రకారులు—

సోమనాథుడే తిక్కన వెనుకనున్న ఇదియెట్లు సంఘటించినది?

(4) ''కవిబ్రహ్మ (తిక్కన) ఆ అద్వైతమూర్తిని ఆయన ఆవిష్కరించినంతనే ఆంధ్రదేశంలో వీరశైవ వైష్ణవ అంతర్యుద్ధాలు సమసిపోయినవి.'' ఈ వాక్యానికి అన్వయమెట్లు.

## 2. సాహిత్యము

ఆంధ్ర వాఙ్మయమున—నన్నయ తిక్కనల నడిమి కాలము—''శివకవి యుగము'' అని, మల్లికార్జున పండిత, నన్నెచోడ, పాల్కురికి సోమనాథులు, శివకవులని—నిర్ణీతమైన విషయము[10]- అందు పాల్కురికి సోమనాథుడు, మతవ్యాప్తికొఱకు నూతన సాహిత్య ప్రక్రియలను నవతరింప జేసెననియు, నా వెనుకనే వానికి సారస్వతరంగమున వ్యాప్తి కల్గినదని విమర్శకులు వ్రాసిరి. దీనివలన సోమనాథుడు తిక్కనకుముందువాడేగాని, తరువాతివాడగుట తటస్థింపదు.

## 3. ద్విపద

కేవలము, పదకవిత్వమునకు సంబంధించిన ద్విపదకు తెలుగున సాహిత్య స్థాన మిచ్చినది సోమనాథుడేయని—సోమనాథుని తరువాతనే—ద్విపద వాఙ్మయశాఖ వర్థిల్లినదని బసవపురాణ పండితారాధ్య చరిత్రలు—తెలుగున క్రమముగా ప్రథమ ద్వితీయ కావ్యములని నిశ్చితమైనది.

సోమనాథుని కాలము ద్వితీయ ప్రతాపరుద్రుని కాలమన్నచో తెలుగున—మొదటి ద్విపద కావ్యము—రంగనాథ రామాయణమగును. దీని రచనా కాలము క్రి. శ. 1240 ప్రాంతము.[11]

ఈ రచన—సోమనాథునికి వెనుకనే జరిగినట్లు వేరొక సందర్భమున రంగనాథ రామాయణ పీఠికాకర్త లిట్లు వ్రాసిరి.

''సోమన తన వీర శైవ దీక్ష బాగుగా నిరూఢమైన కాలమునందు వ్రాసిన కావ్యములలో తన శరీరదాతలగు తలిదండ్రుల పేరైనను ఉచ్చరింపక వారికి పెంపుడు కొడుకునని చెప్పుకొన్న అధర్మమునకై ఉపాలంభించువాడుపోలె బుద్ధారెడ్డి తన కావ్యమును తండ్రిపేరనే వెలయించి పితృస్థానముయొక్క పూజ్యభావమును సమర్థించెను.''

పైదానినిబట్టి—ఆ పీఠికాకర్తలకు, పాల్కురికి సోమన రంగనాథ రామాయణకర్తకన్న ముందువాడేగదా. అనగా సోమనాథుడు క్రీ. శ. 1240 కి ముందువాడు.

సోమనాథునికాలము—క్రీ. శ. 1280—1340 అని ప్రకటితమైన వెనుక—సోమన సృష్టించిన ద్విపద ఛ్ఛందస్సును గూర్చి నేను వ్రాసిన వ్యాసములో నిట్లే రంగనాథ రామాయణ విషయము ప్రస్తావించితిని.[12] ''పాల్కురికి సోమన కాలము—క్రీ. శ. 1280—1340 అగుచో ద్విపద కావ్య రచనలో క్రీ. శ. 1240 లో వెలసిన రంగనాథ రామాయణమే మొటిదియై, సోమనాథుని ద్విపద రచనలు తరువాతివి కావలసివచ్చును.''

దీనిపై కీర్తిశేషులు మల్లంపల్లివారు—తాము ప్రత్యేకముగా సంపాదకత్వము వహించి, ప్రకటించిన రంగనాథ రామాయణ పీఠికలో—రంగనాథ రామాయణ రచనా కాలమే మార్చివేసిరి.[13] ''రంగనాథ రామాయణ కృతిభర్తయైన బుద్ధభూపతి క్రీ. శ. 1360—1380 ప్రాంతమున నుండినటు చెప్పవచ్చును.''

తాము ప్రతిపాదించిన సోమనాథునికాలముకోసము—రంగనాథరామాయణ రచనా కాలమును మార్చారు—ఇప్పుడు రంగనాథ రామాయణ రచనా కాలము క్రీ. శ. 1360—80 అని వాఙ్మయ చరిత్రలో వ్రాస్తారా? సాహిత్య పరిణామాన్ని అనుసరింపకుండ, కవి కాలములు మార్చుచున్నారని చూపుటకే దీని నుదాహరించాను.

---

10. వీరి ముగ్గురితోపాటు—క్రీ. శ. 1242 లో నున్న యథావాక్కుల అన్నమయ్యయు, శివకవి యని—నేను— ఇరవైయేండ్ల క్రిందట నిరూపించియున్నాను. భారతి— నవంబరు 1944; మార్చి 1945. ఇది వీరశైవ సాహితీ విమర్శకు లంగీకరించినదే. చూ. భారతి—ఆగస్టు—1945.

11. రంగనాథ రామాయణ పీఠిక—పుట 6. ఆంధ్ర విశ్వ కళా పరిషత్ప్రకటితము, 1942.

12. పాల్కురికి సోమనాథ సంచిక—పరిశోధన. ఆగస్టు—నవంబరు. 1955 పుట 59.

13. రంగనాథ రామాయణము—రాయల్ అండుకోవారి ప్రచురణము, పీఠిక—పుట 11. (1957.)

## 4. ఉదాహరణము—

ఉదాహరణ కావ్యశాఖకు సోమనాథుడే ప్రథముడు. ఆతడు తెలుగులోను, సంస్కృతములోను ఉదాహరణలు వ్రాసి యున్నాడు. వానిలో సంస్కృతోదాహరణమునకు లక్షణము విద్యానాథమహాకవి వ్రాసిన ప్రతాపరుద్రయశోభూషణములో ఉన్నది. ప్రస్తుత కాలము ననుసరించి పాల్కురికి సోమనాథుడును, విద్యానాథుడును, సమకాలికులగుచున్నారు. లక్ష్యమున్నగాని లక్షణ మేర్పడదు. లక్ష్య లక్షణకర్త లిర్వురు సమకాలికులైతే, దీని సమన్వయ మెట్లు?

## 5. భాష

(1) శైవమత ప్రచారమునకై—సోమనాథుడు'—గద్య పద్యాది ప్రబంధ—పూరిత సంస్కృతభూయిష్ఠ రచన' వీడి, జాను తెలుగులో, రచనలు సాగించి, కృతకృత్యుడయ్యెనన్న పద్ధతి గ్రహించియే, తిక్కన— తన భారత రచనలో మూడు వంతులు—తెలుగు పదములను, తెలుగు పలుకుబడిని ఉపయోగించెననియు—పాల్కురికి ప్రభావము తిక్కనపై నున్నదనియు విమర్శకులు—

సోమనాథుడు తిక్కన వెనుకనున్నచో, దీనికి సమన్వయ మేమి?

(2) ''తిక్కన నిర్వచనోత్తర రామాయణ పీఠికలో ''పలుకులపొందులేక రసభంగముసేయుచు ప్రాతవడ్డమాటలం దమ నేర్పు సూపి, యొకటన్ హృదయం బలరింప లేక'' అని చేసిన యీసడింపు నన్నెచోడుని, పాలకుర్తి సోమనాథుని గురించి చేసినదే''—అని నవీన విమర్శన—

తిక్కన చేసిన 'యీసడింపు' అతని వెనుకనున్న సోమనాథుని కెట్లు వర్తిస్తుంది?

(3) సోమనాథుడు, తన గ్రంథములలో మణిప్రవాళ శైలి నుపయోగించెననియు, నన్నయ భాషకంటె, విలక్షణమైన—ప్రయోగములు గావించెననియు, తనకాలమునాటికి భాషా రచనలలో భిన్నమార్గము లుండుటచేతనే, తిక్కన సమకాలికుడగు కేతన—ఆంధ్రభాషాభూషణము—అను వ్యాకరణము రచింప వలసి వచ్చినదనియు, ఆంధ్ర వైయాకరణ చరిత్రకారులు చెప్పుదురు. కేతన— శివకవుల రచనలను విమర్శించి— నన్నయ భట్టారక మార్గమునే నిలిపెనని వారి యభిప్రాయము. కేతన కాలము—క్రీ. శ. 1250—60 ప్రాంతము. ఇది నిశ్చితమే. అప్పుడాతడు—క్రీ. శ. 1320 ప్రాంతముననున్న పాల్కురికి రచనల వెట్లు పరిశీలింపగలడు?

పాల్కురికి సోమనాథునిగూర్చి పరిశ్రమ చేయువారు పై విషయములను సావధానముగ పరిశీలించిన—సోమనాథుడు క్రీ. శ. 1160—1240 ప్రాంతమువాడని నిర్వివాదముగా ఏర్పడుతుంది. ఇక ఉపోద్ఘాతములో—మరి రెండు విషయములను గూర్చి ప్రస్తావిస్తాను.

## పండితత్రయము

సర్వైదికమైన ఆరాధ్యశైవసంప్రదాయాన్ని ప్రవర్తింప జేసిన ముగ్గురు మహాపురుషులను 'పండితత్రయము'అని వ్యవహరింతురు. వారు శ్రీపతిపండితుడు, శివలెంకమంచెన పండితుడు, మల్లికార్జున పండితుడు అనువారు. ఈముువ్వురిలో తృతీయుడు మల్లికార్జున పండితుడే—పండితారాధ్య చరిత్ర కథానాయకుడు. కాబట్టి తక్కిన యిరువురి ప్రశంస ఈగ్రంథములో రాక తప్పదు. పాల్కురికి సోమనాథుడు బసవపురాణములోకూడా మొదటి యిరువురివి పేర్కొనియే యున్నాడు. ఇట్లుండగా పరిష్కర్తలు, పండితత్రయమును గూర్చి ఏ విధముగా వ్రాసిరో ఉదాహరిస్తున్నాను,

''ఇక పండితత్రయమని చెప్పబడే శ్రీపతి పండితుడు, పండితారాధ్యుడు, శివలెంకమంచన్న అనేవారు బసవనికి సమకాలికులని చరిత్రకారులందరును అంటున్నారు. వారిలో శ్రీపతి పండితుడు పండితారాధ్యునికంటె చాలా పూర్వుడని ఇంతకు ముందు సూచించినాను. శివలెంకమంచన్నను గురించి సోమనాథుడు బసవపురాణములో స్మరించనేలేదు. విషపు విందులో పాల్గొన్న వారిలో లెంకమంచయ్య పేరున్నదిగాని అతడు శివలెంక మంచెన పండితుడయి ఉండడు. పండితారాధ్యుడు రచించినాడని చెప్పబడే శివతత్త్వసారములో శ్రీపతి పండితుని గురించి తెలుపబడినదికాని మంచన్నను గురించి తెలుపబడలేదు. మంచన్న పండితారాధ్యునికి తరువాతి వాడున్నూ పాల్కురికిసోమనాథునికి పూర్వుడున్ను అయిఉంటాడు కాబట్టి పండితత్రయమనేవారు సమకాలికులు కారని తోస్తుంది. కాని సోమనాథుడు మంచన్నను గణసహస్రములో చేర్చి కీర్తించినాడు''.

ఉపోద్ఘాతము — 67 పుట.

పై వాక్యములవల్ల, పరిష్కర్తలు, పండితత్రయాన్ని గూర్చి, సోమనాథుడు తన గ్రంథాలలో వ్రాసిన విషయాలను కూడా పరిశీలింపలేదని స్పష్టమవుతున్నది. అవి చూచినట్లు యితే—పండితత్రయమువారు సమకాలికులగుదురా, కారా, అన్న సందేహమున కేమాత్రము ఆస్కారములేదు. ఇక పైని వ్రాసిన 67 వ పుటలోని వాక్యాలకు, ఈ ఉపోద్ఘాతములోనే వీరిని గూర్చి వ్రాసిన విషయాలకు— విపర్యాసములు కనిపిస్తున్నవి. వానిని వివరిస్తున్నాను.—

## శ్రీపతి పండితుడు

ఈతనినిగూర్చి ఉపోద్ఘాతములో 22 నుండి 33 వరకు 11 పుటల గ్రంథమున్నది. ఈతనికాలమును గూర్చి— ''ఇతడు రామానుజుడికి పూర్వుడని నే ననుకొంటున్నాను'' అని 31 వ పుటలోను—''ఇందువల్ల కుమారపాలభూర్జరుడు పాల్కురికి సోమనాథునికి చాలా పూర్వుడనిన్ని, కుమారపాలునికి పూర్వుడైన శ్రీపతిపండితుడింకా పూర్వుడనిన్ని తేలుతున్నది'' అని 33వ పుటలోను వ్రాశారు. అయితే యిచ్చట—పాలకురికి సోమనాథుని ప్రసక్తి యెందులకో తెలియలేదు. పై వ్రాతను

బట్టి— రామానుజుని కాలము క్రీ. శ. 1017—1117 కాబట్టి శ్రీపతిపండితు డంతకు పూర్వుడని తెలియవచ్చుచున్నది.

## శివలెంక మంచెన

శివలెంకమంచన పేరు, మంచణ—మంచణ అని ణకారాంతముగా కన్నడసంప్రదాయము ననుసరించి పరిష్కర్తలు వ్రాయుటలో అర్థమేదియో అవగతముకాలేదు. ఆపైగా "శివలెంకమంచణ్ణను గురించి సోమనాథుడు బసవపురాణములో స్మరించనేలేదు" అని వ్రాశారు. కాని పరిష్కర్తలు బసవపురాణముము సరిగా పరిశీలించనట్లు స్పష్టము. ముద్రిత బసవపురాణములో షష్ఠాశ్వాసము14లో వీరశంకరుని కథ తరువాత 58 పంక్తులలో శివలెంకమంచెయ్య కథ ఉన్నది. బసవపురాణములో గాని పండితారాధ్యచరిత్రలోగాని— ఎచ్చటనూ, మంచెన— అని 'న'కారాంతముగానే యున్నదిగాని మంచెణ్ణ అని లేదు. ఇంక "శ్రీరమణుండు మంచెన పండితయ్య" అనుచోట 'సేయుడు లెంకమంచెన పండితుండు' అను రెండుచోట్ల 'మంచెన' అని ఎకరము నిర్ధారకముగా నున్నది. ఈతని కాలమును గూర్చి తెలుపుతూ "మంచెణ్ణ పండితారాధ్యునికి తరువాతి వాడున్నూ—పాల్కురికి సోమనాథునికి పూర్వుడున్ను అయి ఉంటాడు" అని వ్రాశారు. ఇది పండితారాధ్యచరిత్రలో సోమనాథుడు అవతారికలోనే పండితత్రయమునుగుఱించి వ్రాసిన పంక్తులు చూడకుండగనే వ్రాసినది. ఆ పంక్తుల నీక్రింద నిచ్చు చున్నను.

"కడుసర్గ నుత్పత్తి కర్తనా బ్రహ్మ
వడి బ్రహ్మమును బ్రహ్మవాదులఁ ద్రుంచి
హరభక్తి యుత్పత్తి కధిపతినాఁగఁ
బరగెఁదా దొల్లి శ్రీపతిపండితయ్య
స్థితికర్త హరి నుమాపతికి మ్రొక్కించి
క్షితి విష్ణువాదులఁ గీటణంగించి
చెనసి భక్తి క్రియాస్థితి కర్తయనఁగ
జనియెను లెంక మంచెన పండితయ్య
గాథగా సంహార కర్తయ యనుచు
సాధారణముగ నీశ్వరుఁ బల్క భక్తి
దూరాస్య సమయ సంహారుడై చనియె
శూరుండు మల్లికార్జున పండితయ్య
ఖ్యాపిత భక్తికిఁ గారణ పురుషు
లై పండిత త్రయుంబన భువి జనియె."15

పై పంక్తులలో స్పష్టముగా శ్రీపతి పండితుడు—శివలెంక మంచెన, మల్లికార్జున పండితుడు—అని చెప్పబడినది. కాబట్టి వారొకరి తరువాత యొకరు వెలసిరని వేఱుగా చెప్ప నక్కరలేదు. ఇంతేకాదు. వారు సమకాలికులగుట తటస్థింప నేరదు. పండితత్రయంలో మువ్వురును, త్రిమూర్తుల మువ్వురి ఆధిక్యమును ఖండించి, శివుడే సృష్టి స్థితి లయకారుడని సిద్ధాంతము చేశారు.

| | | |
|---|---|---|
| బ్రహ్మవాదము— | శ్రీపతి పండితుడు | —సృష్టి |
| విష్ణువాదము— | శివలెంక మంచెన | —స్థితి |
| మహేశ్వరవాదము— | మల్లికార్జున పండితుడు | —లయము |

ఒకవాద మొక రొక కాలమున ఖండించి, శైవము ప్రవర్తిల్ల జేసినకదా తరువాతి వాదమునకు ప్రసక్తి వచ్చును - ఇదియే క్రమముకూడ. బ్రహ్మవాదము ఖండించిన వెనుకనే— శివలెంకమంచన— విష్ణువాదము ఖండించెను. ఆయుద్దరివెనుక మల్లికార్జున పండితుడు సంహార కర్త రుద్రుడన్న వాదము ఖండించి—మువ్వురి వాదములను సమీకరించి శివుడే ప్రధాన దైవమని ఆరాధ్య దైవమని, మాహేశ్వర సంప్రదాయము ప్రతిష్ఠించినాడు. దీనినిబట్టి, శివలెంక మంచన—మల్లికార్జున పండితున కెంతమాత్రము సమకాలికుడు కానేరడని యేర్పడుచున్నదిగదా. పండిత త్రయమునుగూర్చి—యింత విశదముగా సోమనాథుడే చెప్పియుండగా, పరిష్కర్తలు, దీనిని విస్మరించుట యెంతమాత్రమును సరికాదు. ఇన్ని పుటలు కూడ యనవసరము. ఇక వీరి కాలములు నిర్వివాదములే.

మల్లికార్జున పండితుడు— క్రీ. శ. 1160 ప్రాంతము. శివలెంక మంచెన పండితు డీతనికి ముందున్నవాడు. ఎంతముందు వాడో తెలిసికొనుట కాధారమున్నది. పండితారాధ్య చరిత్ర కన్నడ భాషలో రచించిన నీలకంఠాచార్యుడు—క్రీ. శ. 1480 ప్రాంతమువాడు. ఈతని కాలమింతకుముందే తెల్పితిని. ఆతడు తన వంశ వర్ణనలో, శివలెంక మంచన పండితునివద్ద నుండి 15 తరములు వర్ణించియున్నాడు. వరుసగా వారిపేరుల నుదాహరించియున్నాడు. తరమునకు 30 సంవత్సరముల చొప్పున లెక్కించినట్లయితే— మంచనకాలము- క్రీ. శ. 1030 ప్రాంతమగుచున్నది. శ్రీపతి పండితుడు శివలెంక మంచెనకు ముందువాడు గావున నాతడు 1030 కి పూర్వముననుండి యుండవలెను. ఆతడు క్రీ. శ. 1017 లో జన్మించిన రామానుజులకు పూర్వుడు. కాబట్టి శ్రీపతి పండితుడు క్రీ. శ. 950 ప్రాంతమువాడు16. అప్పుడు పండితత్రయ కాలక్రమమిట్లుండును.

---

14. బసవపురాణము—ద్వితీయ ముద్రణము — ఆంధ్ర గ్రంథమాలా ప్రచురణము. పుటలు 171, 172.

15. పుట. 7. ఈ పంక్తులకు పైన—'పండిత త్రయము'అని శీర్షిక యుండవలెను.

16. "పండితత్రయము" భారతి సం. 3. సం. 3 మార్చి 1926. పండితత్రయమునుగూర్చి యీ వ్యాసమును ప్రకటించిన మఱి ముప్పదేండ్లకు అనఁగా క్రీ. శ. 1956 లో నా తెలుగు కవుల చరిత్రమున శ్రీపతిపండితునిగూర్చి విపులముగా చర్చించి, యుద్ధమల్లుని బెజవాడ శిలా శాసనమునకు శైవమతమునకుగలసంబంధమము నిరూపించితిని- (పుటలు68–82), ఆపై శ్రీ డాక్టరు నేలటూరి వెంకట రమణయ్యగారు పండితత్రయమున రెండవవాడగు శివలెంక మంచన ప్రసక్తి లేకుండనే శ్రీపతి పండితుని కాలము క్రీ. శ. 1100 ప్రాంతమని నిర్ణయించిరి. (ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక—సం. 53. సం. 1—6) పై వివరణమునుబట్టి-యిది యెంతమాత్రము గ్రాహ్యముకాదు.

శ్రీపతి పండితుడు క్రీ. శ. 950— ప్రాంతము
శివలెంక మంచెన— క్రీ. శ. 1030 ,,
మల్లికార్జున పండితుడు— క్రీ. శ. 1160

## పండితారాధ్యుని రచనలు

పండితారాధ్యుని రచనలనుగూర్చి కలవరపాటు గలిగించినది ప్రస్తుత గ్రంథముయొక్క ఉపోద్ఘాతమే యని చెప్పవలెను. సోమనాథుడు పండితుని కవిగా పేర్కొనుటయే గాక, ఆతని రచనలను యుచ్చియున్నాడు. మఱియు వీరశైవమత సంప్రదాయాన్ని అనుసరించి, పండితు డాయాసమయాల్లో పఠించిన యుతర స్తుతులను గ్రంథాలను కూడా సోమనాథుడు వివరించాడు. తన స్వంత రచనలను వానితో చేర్చాడు. అవి ప్రజాసామాన్యంలో వ్యాపించిన విధంకూడా తెలిపాడు. పండితుని రచనలేకాక, ఆకాలములో వీరశైవమత సంప్రదాయానికి చెందిన గ్రంథాలన్నింటిని ప్రచారములోనికితెచ్చి, సాహిత్యంలో వానికి స్థాన మేర్పరచడమే సోమనాథుని ఆశయం. మత సంప్రదాయాలను సాహిత్య ప్రక్రియలతో సమ్మేళనము చేసిన సోమనాథుని పద్ధతిని కనిపెట్టలేకపోవడంవల్ల పండితుని రచనలనుగూర్చి సరియైన నిర్ణయానికి విమర్శకులు రాలేకపోయారు. సోమనాథుడు పేర్కొన్నవన్నీ పండితుని రచనలుగా గ్రహించారు.

మొదటిలో శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు శివతత్త్వ సార పీఠికలో పాల్కురికి సోమనాథు డిచ్చిన గ్రంథముల నుదాహరించి యిట్లు వ్రాశారు.

''పై ద్విపదలలో చెప్పబడినవన్నియు నితనిచే రచియింపబడినవని చెప్పుటకు వీలులేదు—మహిమ్నాదులు సంస్కృతము నందలి ప్రాచీన స్తుతులు. వానినే యీతడు చదివెనని యర్థమో? లేక వానిని తెనిగించెనని యర్థమో స్పష్టముగ తెలియుటలేదు. ఈతనిచే రచింపబడినదని స్పష్టముగా దెలిసిన 'శివ తత్త్వ సారము' బసవ గీతములును గూడ నిందు జేరియున్నవి. కనుక మిగిలినవి గూడ నీతనిచే రచియింపబడెనేమోయన్న సంశయము గలుగుచున్నది.'' (పుటలు 11, 12, 13.)

దీని ననుసరించే ప్రస్తుత గ్రంథోపోద్ఘాతంలో పరిష్కర్త లిట్లు వ్రాశారు—

పండితారాధ్యుడు గొప్ప వీర శైవ కవిగా సోమనాథుడు పేర్కొన్నాడు. హారలీల, మహిమ్నస్తవము, మలహణము, అనామయము,హలాయుధము, పంచగద్యములు, శివతత్త్వసారము, రుద్రమహిమ, సంసారమాయాస్తవము, శంకరగీత, ఆనందగీతములు, బసవగీతములు, దక్షాధ్వరము, వ్యాసాష్టకము, గణాడంబరము, శారభము, తుమ్మెద పదములు, ప్రభాతపదములు—పర్వత పదములు, ఆనందపదములు, శంకరపదములు, నివాళి పదములు, వాలేశుపదములు, గొబ్బిపదములు, వెన్నెల పదములు, పంజవర్ణన, గణవర్ణన పదములు, బాణ గద్య, అక్షర గద్య, వర్ణాడంబరము, నీలకంఠస్తవము, మయూరస్తవము, మలయు రాజీయము,మౌనిదండకము, మహాస్తోత్ర సూక్తములు, శతకము, దీపకళిక, మహానాటకము, ఉదాహరణములు, ముక్తకములు, గీత సూక్తములు, భృంగీస్తవము, రుద్రసహస్రనామములు మొదలైన గ్రంథముల పేళ్లను సోమనాథుడు మల్లికార్జున పండితారాధ్య రచితములుగా ధ్వనించేటట్లు సూచించినాడు.'' (ఉపోద్ఘాతము—పుటలు 78, 79.)[17]

ఈ నడుమనే వెలువడిన 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం'లో మల్లికార్జున పండితారాధ్యుల చరిత్రలో[18] పై రచనలనుగూర్చి యీ రీతిగా నున్నది.

''సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో అక్కడక్కడ పేర్కొన్న వాటిన్నిన్నింటిని క్రోడీకరిస్తే పండితయ్యగారి రచనల సంఖ్య 44 దాకా తేలుతుంది.

1. అక్షరగద్య
2. అనామయము
3. ఆనందగీతములు
4. ఆనందపదములు
5. ఉదాహరణములు
6. గణవర్ణనపదములు
7. గణాడంబరము
8. గీతసూక్తములు
9. గొబ్బి పదములు
10. తుమ్మెద పదములు
11. దక్షాధ్వరము
12. దీపకళిక
13. నివాళిపదములు
14. నీలకంఠస్తవము
15. వ్యాసాష్టకము
16. పంచగద్యములు
17. పర్వతపదములు
18. ప్రభాతపదములు
19. బసవగీతములు
20. బాణగద్య
21. భీమేశుగద్య
22. భృంగీస్తవము
23. మయూరస్తవము
24. మలయురాజీయము
25. మలహణము
26. మహానాటకము
27. మహాస్తోత్ర సూక్తములు
28. మహిమ్నము
29. ముక్తకములు
30. మౌనిదండకము
31. రుద్రమహిమ

---

17. పండితారాధ్యచరిత్ర— ప్రస్తుత ముద్రణము—
18. మొదటి సంపుటము—చాళుక్య యుగము—పుట 242. రచయిత శ్రీ ఆరుద్ర.

32. రుద్ర సహస్రనామములు
33. వర్ణాడంబరము
34. వాలేశుపదములు
35. వెన్నెల పదములు
36. శంకరగీత
37. శంకర పదములు
38. శతకము
39. శారభము
40. శివతత్త్వసారము
41. సంజవర్ణన
42. సంసారమాయాస్తవము.
43. హారలీల.
44. హాలాయుధము.

ఈ పట్టికలో కొన్ని పునరుక్తులు ఉన్నట్టు తోచక మానదు—అక్షరగద్య, బాణగద్య, భీమేశుగద్య, బహుశా పంచ గద్యలలో చేరి ఉంటాయి. అలాగే గణాడంబరం, గణవర్ణన పదములు ఒకటే కావచ్చు. ఆనందగీతములు ఆనందపదములు కూడ ఒక రచనకే రెండు పేర్లేమో! ఇంక కొంత పరిశోధన చేస్తేనే గాని పండితయ్య రచనల లెక్క యింత అని తేల్చి చెప్పడానికి వీలులేదు..''

వాస్తవంగా పండితయ్య రచనల లెక్క యింత అని తేల్చి చెప్పడానికి పరిశోధన ఏమాత్రమూ అవసరములేదు. ఇదంతా, మూల గ్రంథమును పరిశీలింపకుండా, ఒకరు చెప్పిన దానినే, ఆధారంగా గ్రహించడమువల్ల వచ్చిన అనర్థం. ఈ విషయాన్ని వివరిస్తున్నాను.

పండితారాధ్య చరిత్రలో, పై పట్టిక అంతా ఒకేచోటున లేదని విమర్శకులు మొదట గ్రహించాలి. అవి మూడుచోట్ల ఆ గ్రంథంలో ఉన్నవి.

1. దీక్షా ప్రకరణంలో పండితుని లింగార్చనా సమయ ఘట్టము 1 వ భాగము. 181, 182 పుటలు.
2. వాద ప్రకరణంలో పండితయ్య వెలనాటి చోడుని సభకు బయలుదేరు ఘట్టము— 512, 513 పుటలు.
3. పర్వత ప్రకరణంలో శ్రీశైలమున శివరాత్రినాడు భక్త జనుల స్తుతి ఘట్టము. 2 భా. 432— 433. చదువరులకు సుగమమగుటకై, పండితుని రచనలు పై ఘట్టములలో నేవేవి ఉదాహరింపబడినవో చూపుచున్నాను.

మొదటి ఘట్టము

హారలీల
మహిమ్నము
మలహణము
అనామయము
హాలాయుధము
పంచగద్దెలు
శివతత్త్వ సారము
రుద్రమహిమ
సంసారమాయాస్తవము
శంకరగీత
ఆనందగీతములు
బసవగీతములు

రెండవ ఘట్టము

దక్షాధ్వరము
వ్యాసాష్టకము
గణాడంబరము
శారభము
శ్రుతిపంచగద్యలు
రుద్రమహిమ
శతకము
శివతత్త్వసారము
సంసారమాయాస్తవము
తుమ్మెద పదములు
ప్రభాతపదములు
పర్వతపదములు
ఆనంద పదములు
శంకర పదములు
నివాళి పదములు
వాలేశు పదములు
గొబ్బి పదములు
వెన్నెల పదములు
సంజవర్ణన—
గణ వర్ణన—

మూడవ ఘట్టము

బాణగద్య
అక్షరగద్య
పంచ గద్యలు
గణాడంబరము
వర్ణాడంబరము
వ్యాసాష్టకము
నీలకంఠస్తవము
రుద్రకవచము
శారభము

మయూరస్తవము
హాలాయుధము
అనామయము
మల్హణము
మహిమ్నము
మలయరాజీయము
మౌనిదండకము
శతకము
దీపకళిక
మహానాటకము
ఉదాహరణలు
రుద్రమహిమ
గీతసూక్తములు
ముక్తావళులు
భృంగిస్తవములు
అష్టకములు
హరలీల
రుద్రసహస్రనామము
మహాస్తోత్ర సూక్తములు.

మూడవ ఘట్టములో దాసయ్య అఱువత్తు మువ్వురి చరితంబులు, బసవ పురాణము, బసవన గీతములు కూడ పేర్కొనబడినవి. పై పట్టికలనుబట్టి సోమనాథుడు ఋషి ప్రోక్తములు, కవిప్రోక్తములు, పౌరాణికములు, దేశభాష రచనలు, పండితుని రచనలు, తనరచనలు అన్నియు నిందుదాహరించెనని విశదమగుచున్నది. పై పట్టికలో మొదటి ఘట్టమునను, మూడవ ఘట్టమునను నున్న ఈ క్రింది రచనలు—రెండవ ఘట్టమున లేకుండుట గమనింపదగినది.

| | | |
|---|---|---|
| 1. హరలీల. | ఇది సంస్కృత స్తుతి | ఉద్భటాచార్యుని రచన |
| 2. మహిమ్నము | ,, | పుష్పదంత రచితము. |
| 3. మల్హణము | ,, | మల్హణకవి రచితము. |
| 4. అనామయము | ,, | దండి రచితము. |
| 5. హాలాయుధము | ,, | హాలాయుధుడు. |
| 6. మయూరస్తవము | ,, | మయూర మహాకవి. |
| 7. మలయరాజీయము | ,, | మలయరాజు |
| 8. నీలకంఠస్తవము | ,, | పౌరాణికము |
| 9. బాణగద్య | ,, | బాణభట్టు. |
| 10. రుద్రకవచము | ,, | పౌరాణికము |
| 11. రుద్రసహస్రనామములు | ,, | ,, |
| 12. మౌని దండకము | ,, | ఋషిప్రోక్తము |
| 13. మహానాటకము | ,, | ఆంజనేయ ప్రోక్తము |

దీనినే హనుమన్నాటకమందురు.

పై వానిలో మహిమ్నము, మల్హణము, అనామయము, మలయరాజీయము, హాలాయుధము—అనునవి ''శివపంచ స్తవములు''19 అను పేర ప్రసిద్ధములు. కొన్నింట మలయరాజీయమునకుబదులు 'నీలకంఠస్తవ'మున్నది. నాదెండ్ల గోపమంత్రి మంత్రి— ఊరదేచయామాత్య ఈ శివపంచస్తవములకు వ్యాఖ్య గావించియున్నాడు. ఈ స్తవముల ప్రభావము శైవ కవులలోనేగాక, ఎఱ్ఱన, హరిభట్టు, మూర్తికవి మున్నగువారిపై గలదు. గ్రంథవిస్తర భీతిని వివరము లీయులేదు. హరలీల రచనము:-శివతత్త్వసారమున, నన్నెచోడని కుమారసంభవమున గలదు; మయూరస్తవము:-మయూర మహాకవి రచితము20. ఈ కథ పండితారాధ్య చరిత్ర మహిమ ప్రకరణమున గలదు. అందే బాణగద్య—బాణ మహాకవి రచన యన్న కథ ఉన్నది.

పై వానిలో శివపంచస్తవములు, హరలీల, శైవులు లింగార్చనా సమయమున పఠింపవలసినవి. కావుననే అవి మొదటి ఘట్టమున, శివరాత్రి లింగార్చనా సమయమున పేర్కొన బడినవి. పై వివరణమునుబట్టి 13 కృతులు పండితారాధ్యునివి కావని తేలినది. ఇక-(1)సంసారమాయాస్తవము, (2)వ్యాసాష్టకము,(3)శారభము—ఇవిసంస్కృత స్తుతులే. ''వ్యాసాష్టకము''-

''గంగాతరంగకమనీయజటాకలాపమ్
గౌరీ నిరంతర విభూషిత వామభాగమ్
నారాయణప్రియ మనంగమదాపహారమ్
వారాణసీ పురపతిం భజ విశ్వనాథమ్.'' అనునది.21

వీనితో భృంగిస్తవము, మహాస్తోత్ర సూక్తములు (ఇవి వేదములకు సంబంధించినవి) గీత సూక్తములు అను వానిని చేర్చినచో నాఱు కృతు లగును. ఇవి యన్నియు సంస్కృతములే. ఇవి పండితుని రచనలు కావు.

పదములు : ఈ పేరితోనున్న తుమ్మెద, ప్రభాత, పర్వత, ఆనంద, శంకర, నివాళి, వాలేశు, గొబ్బి, వెన్నెల అను తొమ్మిదియు—తెలుగు పద రచనలు. ఇవి పండితుని రచన లెంత మాత్రమును కావు. పండితుని కాలమునకు ముందే ఎంత కాలమునుండియో ప్రజాసామాన్యములో ఉన్నవి. ఇవి మొదటి మూడవ ఘట్టములలో లేకుండ, రెండవ ఘట్టములోనే సోమ

---

19. శివపంచస్తవి. శ్రీ చిదిరె మఠము వీరభద్ర శర్మ గారి సంపాదితము. ఇందుపై స్తవములు టీకాతాత్పర్యాంధ్రానువాదముతో నున్నవి. దీని పీఠికలో శివతత్త్వమును గూర్చిన లోకోత్తరమైన పీఠిక గలదు.

20. సూర్యశతక రచన చేత సంస్కృత వాఙ్మయ ప్రపంచమున మహా ప్రసిద్ధుడైన మయూరుని శివస్తవ రచన, సంస్కృత సారస్వత చరిత్ర కెక్కనేలేదు. దీనిని గూర్చి నేను ముప్పదేండ్ల క్రిందట వ్రాసి లోకమునకు దెలిపితిని.
Mayura Stava—A forgotten work of Mayura - K. V. Rangaswami Iyengar Commemoration Volume. PP 24—32.

21. ఈ స్తవము—'విశ్వనాథాష్టకము' అను—పేర విశాఖ ముద్రణ పండితారాధ్య చరిత్రలో ముద్రితమైనది. పుట 247. మూల తాళపత్ర ప్రతులలో నిది యున్నది.

నాథుడు పేర్కొనుట గమనింపదగినది. పండితారాధ్యునితో వేడలు చున్న జనసామాన్యము వీనిని పాడుచుండిరని యర్థము. వీని వివరణానికి చోటులేదు. తుమ్మెద పదము—

22శివశివ యన మేలు తుమ్మెదా, శివ
శివ యంటెను మేలు తుమ్మెదా !
శ్రీకంఠుడను పువ్వు తుమ్మెదా ! మూడు
లోకంబులా యేనే తుమ్మెదా
ఆఱు ఱేకుల పువ్వు తుమ్మెదా! అందు
విూఱిన వాసనే— తుమ్మెదా
యువ్వనముండగాన తుమ్మెదా! నీ
కెవ్వి నేరము లేవు తుమ్మెదా. ఇత్యాది.

వీనితో23 సంజవర్ణన, గణవర్ణన చేర్పదగును. అప్పు డివి పదునొకం డగును.

శ్రీఆరుద్రగా రిచ్చిన పట్టికలోఉన్న నలభై నాల్గింటిలో మీద నిచ్చిన 19 సంస్కృత రచనలు, 11 తెలుగు రచనలు మొత్తము 30 రచనలు పండితారాధ్యునివి కావని స్పష్ట మైనది. ఇక మిగిలినవి 14 రచనలు. వీనిని పరిశీలిద్దాం.

1. అక్షరగద్య— దీనిని పంచగద్యలకన్న భిన్నముగా చెప్పుటచేత నిది వానిలో జేరదని చెప్పవచ్చును.

2. ఆనంద గీతములు— ఆనంద పదములు వేఱుగా నున్నవిగాన నివి వేఱు.

ఈ రెండును పండితుని రచనలని మనము నిరూపించుట కాధారములేదు.

3. ఉదాహరణములు — సోమనాథుడు, పండితారాధ్యుడు ఉదాహరణ కావ్యములు చెప్పి నట్లెచ్చటను వ్రాయలేదు. ఇవి మూడవ ఘట్టమున, బసవపురాణముతోపాటుగాను నుదాహరింప బడినవి గావున నివి సోమనాథుని ఉదాహరణములు రెండును నని గ్రహింపవలెను. (సంస్కృత, తెలుగు బసవోదాహరణ ములు.)

4. దీపకళిక—దీనికి 'దేవకళిక' అను పాఠాంతర మున్నది. కాని 'దీపకళిక' యనియే పెక్కు ప్రతులు. ప్రాచీన శివభక్తులలో 'దీపదకళియారు' అను భక్తుడు గలడు. అతని చరిత్ర బసవపురాణము ద్వితీయాశ్వాసమున 78 పంక్తులలో కలదు. 'దీపదకళి' అను నామాంతరము. ఆ భక్తుని సంబంధించిన కృతి అగునో కాదో పరిశీలింపదగినది. కాబట్టి కర్తృత్వము అనిశ్చితము.

5. భీమేశుగద్య—సోమనాథు డెచ్చటను పండితుని కృతులలో దీనిని స్పష్టముగా పేర్కొనలేదు. పండితుని రచనల నా కాలమునందు పంఠించుచున్నట్లు పైనయున్నది గదా. ఆ ఘట్టములలో నిది లేదు. సోమనాథుని కాలమునాటికి 'భీమేశు గద్య' ప్రచారమున నున్నదానిని పై ఘట్టములలో నొకదానిలోనైన పేర్కొనకపోవుట సంభవింపదు. కాబట్టి దీనిని పండిత రచనగా గ్రహింప వీలులేదు.

6. వర్ణాడంబరము, 7. శంకరగీత—వీనిని పండితుని రచనలని చెప్పుట కాధారములేదు.

పై 14 కృతులలో 7 కృతులు పోగా మిగిలిన ఏడు మాత్రము పండితారాధ్యుని రచనలని చెప్పవచ్చును.

1. గణాడంబరము—శివతత్త్వసారములో "గణాడంబర విభవము వర్ణించితి" అని—385 పద్యములో గలదు.

2. దక్షాధ్వరము—ఇదియును 300, 319 పద్యము లలో శివతత్త్వసారమున గలదు.

3. పంచగద్యములు—పండితుని గద్య కృతులలో "శ్రీముఖ దర్శన గద్య" లభించినది, లింగోద్భవదేవు గద్య—ఆతడు చెప్పినది సోమనాథుడు పేర్కొన్నాడు. ఇంకను మూడు దొరక వలసి యున్నవి.

4. బసవగీతములు—ఇవి ఈతని రచనములని సోమ నాథుడే చెప్పినాడు (దీక్షాప్రకరణము).

5 రుద్రమహిమ—ఇది పండితుని కృతిగా వాద ప్రకర ణాంతమున సోమనాథుడు చెప్పినాడు.

6. శతకము—ఇది 'శ్రీ గిరి మల్లికార్జునా' అను మకుటము గలది. ఇందొక్క పద్యమును మాత్రమే లాక్షణికు లుదాహరించినది లభ్యమైనది.

"'లోకములన్ని నీ తనువులోనివ నీవట యెంత కల్గుదో
నాకిప పద్మసంభవ జనార్దను లాదిగ నెల్ల పెద్దలున్
నీ కొల దింత యంత యన నేరక మ్రొక్కు దొడంగిరన్న ని
న్నే కరణి న్నుతింతు పరమేశ్వర శ్రీ గిరి మల్లికార్జునా."

కన్నడమున నిట్టి మకుటము గల శతక మున్నది. దాని మొదటి పద్య మిది.

శ్రీపతి వాక్పతి ప్రముఖ దేవతెగళ్ బహువేద పాఠ వా
గ్రూపగళిందకాణదిహ శైవ మహత్త్వ మనల్పబుద్ధియిం
రూపిసలాసమర్థన కృతార్థన దంతహ నల్పదిర్కు చి
ద్రూపన వాచ్యనం నుతిపనై శివ పర్వత మల్లికార్జునా.

దీనిని చూడగనే శివతత్త్వసారమునందలి ప్రథమ పద్యము జ్ఞప్తికిరాకమానదు. కన్నడ కృతి పండిత రచనయే కావచ్చును.

"శ్రీపతి వాక్పతి ముఖ్య మ
హా పురుషులు నెఱుగనోప రతి వాఙ్మనస
వ్యాపారమైన నీ నిజ
రూపము నే నిట్టిదని నిరూపింతు శివా."

---

22. ఈ పదము— భారతి 1 సం. సం. 2 (ఫిబ్రవరి— 1924)లో ప్రకటితమైనది.

23. ఇది 'సంజవర్ణన' కాదు. సెజ్జవర్ణన. (వి. ము) మూర్తి శయ్యా వర్ణనము.

7. శివతత్త్వసారము. ఇది యావలకు సుపరిచిత మైనదే.

విషయనిర్ధారణకొఱకు పండితారాధ్యుని రచనలని ఉదాహరించిన వానిని మువ్మాఱుదాహరించివలసి వచ్చినది.

పండితారాధ్య చరిత్రను జాగరూకతతో పరిశీలించిన వారికి సోమనాథు డింకను, కొన్ని పండితుని రచనల నందు సంగ్రహించెనని తెలియగలదు. అట్టి వానిని మూడింటిని చూపుచున్నాను.

## స్తుతిశ్లోక పంచకము

ఇది పండితుడు లింగోద్భవ దేవాలయ ప్రాంగణమున తన కన్నులు రెండును తానే గోరుగండ్లతో పెకళించుకొనుటకు ముందుగా చెప్పినది.24

''శ్రీమల్లినాథాయ ! జితమన్మథాయ
సోమాంకజూటాయ! శూలాయుధాయ
భస్మీకృతాఘాయ ! పరమేశ్వరాయ
తస్మై నమోస్తు కుధరవల్లభాయ. 1

శ్రీవీరభద్రాయ సింహాజినాయ
దేవాధిదేవాయ తేజోమయాయ
విస్మేర దహనాక్షి విగతాధ్వరాయ
తస్మై నమశ్శ్రీ కుధరఖేలనాయ. 2

శ్రీవృషభేంద్రాయ శివవాహనాయ
శైవాగమపురాణశాస్త్రాధిపాయ
సస్మేరవదనాబ్జ శాంతోదయాయ
తస్మై నమశ్శ్రీ కుధరమందిరాయ 3

ప్రమథాయ రుద్రాయ భక్తిప్రదాయ
విమలాయ నిత్యాయ విశ్వస్తుతాయ
భస్మాంగరాగాయ పాపాపహాయ
తస్మై నమశ్శ్రీ కుధరవల్లభాయ 4

శ్రీదేశికేంద్రాయ శివసన్నిభాయ
వేదితాత్మీయార్థ వీరవ్రతాయ
సస్మృతిశ్రుతి సదాచారాధిపాయ
తస్మై నమశ్శ్రీ కుధరవందితాయ. 5

ఇట్లే— పర్వతాష్టకము— పండితుడు లింగైక్యసమయమున చెప్పిన కన్నడగౌళ రాగమునందున్న 'శివశరణు' పదము— మొదలగునవి కలవు.

ఒక ఉదాహరణ: పండితుడు లింగార్చనా సమయమున విభూతి రుద్రాక్షలు ధరించి యుండగా అక్కడి బ్రాహ్మణులువచ్చి— అన్నమాట

''పండితయ్యా! నీవు పౌరాణికుడవు''

ఇచట, పండితయ్యా నీవు పౌరాణికుడవు'—అను పాదమునకు గసడదవాదేశము చేసినందువలన— నెట్టి యర్థము:

24. మహిమ ప్రకరణము. 29 వ పుట.


మూలశంకకు
త్వరగా నమ్మకమైన
హెడన్‌సాతో
చికిత్సను పొందండి
-శస్త్రచికిత్స
అవసరములేదు!

సహించలేని బాధ ఉందా! తీవ్రంగా దురద వుందా? మంటతో నెత్తురు పడుతుందా? అమోఘమైన చికిత్స ఎంతమాత్రము కాల యాపన చేయవద్దు! ఉపేక్షిస్తే తీవ్రమైన పరిస్థితులకు దారితీసి. శస్త్ర చికిత్స తప్పనిసరి ఔతుంది. సకాలంలో హెడెన్‌సాతో ఉపశమనాన్ని పొందండి. ఇది నమ్మకమైన జర్మను మూలశంక విరేచనము. 108 దేశాలలో వైద్యులందరూ శిఫారసు చేస్తున్నారు. హెడెన్‌సా శీఘ్రంగా గుణాన్నిచ్చి బాధను దురదను శమింపజేస్తుంది—విరేచనము ఎంతమాత్రము కష్టమనిపించదు. హెడెన్‌సా లోఉండే అమోఘమైన మందులు సామర్థ్యంగా గుణాన్ని కలిగించిరక్తశంకలను ముకుళింపజేసి ఆరోగ్యకరమైన టిస్యూ రంధ్రాలప్రవృద్ధికి సహకరిస్తుంది. గమనించండి. మూలశంకలకు సకాలంలోహెడెన్‌సా చికిత్సచేసుకుంటే ముమ్ముందు శస్త్ర చికిత్స అవసరముండదు! హెడెన్‌సాలో మత్తును కల్గించే మందులు ఏమియు లేవు.

అసలైన జర్మన్ సూత్రాలకు అనుగుణంగా ఇండియాలో వీరిచే తయారు చేయబడుచున్నది.

ది డాలర్ కంపెనీ
337, తంబుచెట్టి స్ట్రీటు మద్రాసు-1.
ప్రసిద్ధి పొందిన కెమిస్టు లందరివద్ద లభిస్తుంది.

B3-DOL-2ATG

వచ్చినదో చదువరులకు వెంటనే స్ఫురింప గలదు. ఇట్లు పకారమునకే గాక కరణమునకు గరణమని— చింతామణికి— సింతామణి—అని—గ్రంథమందన్ని చోట్ల లూ —యాదేశము పాటింప బడ్డది.[25]

ఇట్టిసందర్భములలో ప్రాచీన గ్రంథములు ముద్రించునప్పుడు— గసడదవలురాని— పూర్వరూపమునేయుంచి, పుటయడుగున వ్రాతలలోవున్న రూపములు చూపవచ్చును. అట్టి రూపములు హెచ్చుగా నున్నచో – ముద్రణమునందీ నియమము పాటింపబడలేదని అయినను— ప్రాచీనభాషా సంప్రదాయము తెలుసుకొనగోరువారు వారికి తెలియుటకొఱకు కొన్నిరూపములు ప్రదర్శించబడినవని తెలుపుట సరియైన పద్ధతి.

స్థాలీపులాక న్యాయంగా ఈ మహాగ్రంథంలో కొన్ని విషయాలు మాత్రమే చర్చింప గలిగాను—

పండితారాధ్య చరిత్ర అనగా, పండ్రెండవశతాబ్దినాటి ఆంధ్రుల మత, సాంఘిక,సాహిత్య, సంస్కృతులు ప్రతిబింబించిన సర్వస్వము: భాషాసమైక్యత, జాతీయసమైక్యత సమస్యగా పరిణమించిన ఈ నాడు అటు ఆర్యావర్త సంస్కృతిని ఇటు దాక్షిణాత్య సంస్కృతిని సమ్మేళనము చేసిన పండితారాధ్య చరిత్ర—విపుల విశేష వ్యాఖ్యానసమేతంగా, తిరిగి ముద్రితమయితే, అప్పుడాంధ్ర సాహిత్యానికి, ఆంధ్రభాషకూ, యావద్భారత వర్షంలోను., ఎట్టిస్థానమున్నదో నిరూపితమవుతుంది. తెలుగులో వెలువడుతూన్న విజ్ఞాన సర్వస్వాలు, విజ్ఞానకోశాలు, ఇంకను ఎంతగా పెంపొందవలెనో, అన్న విషయము వ్యక్తమవుతుంది.

ఆంధ్రమహాజనులు సత్వరముగా, ఈమహాకావ్య ముద్రణమునకు గడంగుదురు గాక అని విన్నవిస్తూ ఈ వ్యాసమును ముగిస్తున్నాను—

---

25. ఇట్లు గసడదవాదేశము చేసినందువలన లోకవ్యవహార జ్ఞానము నశించునని యే చిన్నయసూరి బాలవ్యాకరణమున సంధిపరిచ్ఛేదము 14 వ సూత్రమున "తెనుఁగుల మీఁది సాంస్కృతిక పరుషములకు' గసడదవలురావు" అని వీనిని నిషేధించియున్నాడు.



# అక్షిక్ష్వేదము

## శ్రీ హారీత శివశర్మ

బాలాహస్కర బభ్రువల్కల పటీ
భాభాసి సంధ్యాంగనా
లాలోటోగ్ర విలాస రేఖికలు వేలాకోళముల్ చేసెడిన్*
బాలా! నీతనువెల్ల నాకసము దివ్యం
బాత్మబోధంబు
సిగ్గేలా! మోమున తూర్పుదిక్కుపొడిచెన్
హేలామనోహారియై

పడతుక చిడిముడినడరుచు నిలచెన్
ప్రబ్బిన నిప్పుల కన్నులతో
విడివడు దళముల చెదరెడి
మధుపప్రేంఖణముల్ రణ పెట్టినటుల్
బెడగయి గడుసరి మధువులు పిండిన
డెందము నందున దెప్పరమై
అడిదము మెదలెను
విధురపు శిశిరం బామనిలో నుదయించినటుల్.

అతివకు కన్నులున్నవిని
అందమయున్నది కన్నులందు
దుస్థితి మరియెచ్చుటో కడును దెప్పర
మాంతరమైన ఆత్మ యం
దతివకు దుఃఖమా విరహమా
కఠినమ్మగు పద్ధతిన్ దృఢ స్థితిని
ఉపాసనా క్రమము చేయుటయా
అరమోడ్పు కన్నులై.

* ఈ పంక్తులు చాలవరకు ఒక అర్వాచీనకవి వ్రాసిన ఒక పద్యమునుండి గ్రహింపబడినవి.

కన్నులయందు మన్మథులుకావలెనిల్చిరి
పూవు బాణవున్ తెన్నులు పన్ని
చూపులకు తెల్వికి మొత్తని చాళ్లు గటి
నిప్పున్నరస ప్రసిద్ధమగు పటు లలో
హృదయంబునందునన్
దున్నని నేలగా ఫలము తోచని తెన్ను
నమర్చ నేటికిన్.

అలుపపు టూహలున్ యెడద నగ్నులు
చూపులలోన మచ్చరంబులు
కను సన్నలన్ బెదురు పూనినతీరులు
ఆభిముఖ్యముల్ కలుగని చోటులున్
కరకు కత్తులు కన్నులలోన నూరుటల్
కలిగి కలంగి జీవితము కార్శ్యము చెంగుటలున్
తపస్యయో.

ఎవడేస్వామి, శివుండు తా నటవె
దీప్తేచ్ఛావిహారాత
ఉద్భవ లీనాగ్రహ వృత్తియై జడుడు
తా దండించె నేత్రాగ్నిచే నెవనిన్
వాడును మన్మథుండు బ్రతికెన్
హేలావిలాసాప్తి మచ్ఛవి రంభోరువు
తల్లి దేహమున స్వచ్ఛంబైన సౌందర్యమై.

తమ యరమేన శ్రీ శివులు తాల్చుట పార్వతినేలనన్న
పశ్నమునకు ఉత్తరం బదియు సాధ్యమ యేనియు
పుట్టు నర్థపున్ శ్రమ
విదితాత్మ డాత డపరాజితుడె చను మన్మథుండు
మొత్తము శివుమేను గెల్చుటకు
తక్కువ కానిదియె రహించెడున్.

నే నయి నిన్ను చూచి మదినెంచితి చక్కదనంపు టెల్లలన్
ఆనిను నేను చూచి హృదయంబున నట్టె కరంగి పోయితిన్
ఏ నిను చూచి యాత్మయను నెక్కటి వసు వు
చిక్కబట్టుకోగా

అ శీ ర్వా ద ము

సమిషంబు నోర్వగను కానని యట్టిస్థితిన్
చరించితిన్.

కత్తులునూరకే కలికికన్నులయందున
చూపుతూపులన్ మత్తిలునాగుబాములను
మన్నన చేయకువే తలోదరీ
చిత్రము నీవుకన్నులను చిమ్మిన
కమ్మనిజాలవలి లో నత్తితి
వాత్రబోకుము విషాక్తముగా నొనరింపబోకవున్.

అగు నరమూత యందముల నందిన
సుందరి నేత్ర యుగ్మ మం
దాగినాగి వేయి వేయి మధురోహాలు
మాదనమాన్మథాకృతుల్ తగి
యొకడైన మన్మధుడు తాల్చిన యాకృతులైన యట్టులై
ఒగి తిగకంటి మంటలవివో
అధమమ్మయినట్టు లొప్పెడిన్.

తపములు చేసిచేసి అరుదారగనారగ నెన్ని జన్మలై
ఇపు డిటు లిట్టి జన్మమున నే నిను గాంచగ నోచినోచి
సత్రవుడను దీనుడన్ ఎడదరాయిడిచెందినవాడనె మరిన్
అపగత ధైర్యుడన్ మనము నందున తీక్ష్ణత దాల్చి కుందెదన్.

ఈ హృదయమ్ము నీకునయి నే నిడినట్టి ప్రవాళపద్మ నం
దోహ నవార్చనా విధము తోరము నెంచవు; నంతరంగరేఖన్
హవణిళ్ల ప్రేమమను క్ష మధువ్రతచంచరీకమున్
ఈహ దలిర్పనాడవు
కనీనికలం దమృతంబు చిందవున్.

అవిరళమోహభావపరమార్థము నెంచరు
దేవతల్ ఋషుల్
వృతమనస్కు లార్యులు
పవిష్టనిజేష్ట నివిష్ట నిష్ఠులై
అవునవు నేను ఒక్కడన ఆర్తుడ చిక్కితి

నెల్లభావపున్ సవురులు మొగ తిల్లపడి
సాగిన దుఃఖమునా నిలంబడన్.

తొంగలి రెప్పలం దుదయ తోరణముల్ గిలకొటి పట్టి దీ
ప్తాంగములై మహాస్సుఖ కలాంచిత వంచిత విష్ణు చక్రముల్
చుంగులు చుట్టుకోనయిన చోద్యము పథ్యము కాదయేని
పుణ్యాంగన! పుణ్యముండును
అహంకృతి నా యెడ పట్టబోకువే.

ఒకడై మన్మధుడార్తిపొందినదినంబో హా!
నవీనాధ్వవర్ధక మాహేశ్వర దివ్య భావ పదవి
తాత్పర్య పర్యాప్తిగా
సకలంబున్ సమహాత్మ్వంబుగను
సాక్షాత్కారమ్మైరాగ
అంబిక దృగ్దీప్తులలో వెలింగినవిపో
పీయూషధారాధునుల్.

నీ చూపున్ బడివచ్చు యందమున తన్వీ!
ఎన్ని వేలైన మాధ్వీచాతుర్యము
లాచిపట్టిన వణుస్వేచ్ఛా ప్రకంపంబులన్
నా చేతమ్మున నగ్నిపర్వతములందాగ్నేయ
ధూమాకృతిప్రాచుర్యమ్ములు
భాసురమ్మయినవే ప్రాకామ్యరమ్యాకృతీ.

అణువునుగూర్చి ఆకలినిఅంటి రచింపని కావ్యమేమి
చిక్కణమని నిష్ప్రయోజనము కాద
యటందురు కొందరార్తులై
అణుకణజాల సంహతిని అందముః చెందిన కాంత కన్నులం
దణువును ఆకలిన్ కనిన అబ్బుర మెంచరు వారు మూర్ఖులై.

అణు అణు సంహతిన్ పదలినట్లి శరీరమునం దనుశ్రుతా
ర్థనిపుణతల్ తలల్ మెరసి రాయిడి చందుట యెప్పుడున్నదే
కనుగని కాంతచూపులవి కట్టిన కొట్టిన పెల్లుగ బాటలో
అణువణువున్ విదీర్ణమగుటన్నది క్రొత్తగపుట్టె నిత్తరిన్.

అ కి ర్వే ద ము

అనీనే్రతములందునన్ కలికి ఆగ్నేయదివ్యాస్త్ర సం
ధానంబున్ పొనరించినావొ మరి నేత్రాధ్వాంతరాళమ్ములో
నేనై పొందిన వేడుముల్ విధురమై ఏర్చున్
శరీరాత్తరోమానీకమ్మునజేసి లోనబడి
సంరంభించు కార్చిచ్చులై.

తీర్చిన సర్వలోక సుదతీ వినయాంబక కాంతి మార్గణ
ప్రార్చిత దృగ్విలాస విభవంబులు
నీకనులందు చూచి
తీవ్రార్చులు చల్లబడ్డవి
నవార్ధ్ర మధూక మధుప్రసక్తలై
అర్చనచేతురే నిను అహంకృతితగ్గి
సుపర్వభామినుల్.

కన్నులలో వసంతములు
కన్నులయంచులలోన గ్రీష్మముల్
కన్నులకొల్కులందు నుదకమ్ములునిండిన మేఘమాలికల్
కన్నులచూపులో శిశిరకాంతులు చల్లని జిల్లువెన్నెలల్
అన్నువ, నీదు కన్నులకు నందిన
ఈ ఋతుశోభ ' గొల్చెదన్.

కన్నులలోన యందములుక్రమ్ముకొనెన్
తొలివారివాహరేఖోన్న మితంబులె
నవనవోత్థిత భావవిహంగసంగతిన్
చిన్నరిలేతనవ్వు విరచించు ముఖ మ్మఖిలంబు నవుగా
కన్నది హృద్వియత్తలము క్రందగు
వర్షవికాసిహాసమున్.

కన్నులలోన దేవతలు
కన్నుల కాంతులయందు దేవతల్
కొన్నెలమోడ్పు కన్నులను కొల్చిన యందములందుదేవతల్
మన్ననసిల్పినిన్ను బహుమానము
చేయుచునుంటయెంచి
ఓసన్నుతగాత్రి !
నీ కనుల చక్కదనంబులనే నుతించెదన్.

# భా ర తి

నేత్ర సరోజ మండల వినిర్గతనిర్మలకాంతివారిధా
రా త్రిపథాత్మక ప్రభలురా నతిచెందిన వాహినీతరం
గ త్రివిధాత్మభోగములు క్రమ్మిన యంత మరేను
మీనభావ ప్రతపచెంది
తారితి నవప్రభుడై తవ నేత్రకాంతిలో.

అజితుడు మన్మధుండనిన యర్థము నీ కనులందుగాంచి
దివ్యజము పవిత్రమున్ మధురభావము
నీ కనులందు గాంచి
అర్థిజనుడనై నినున్ దలచి
తీర్థమువోని త్వదీయ నేత్ర
దిగ్విజయము కొల్చి
ఆత్మ కనువిచ్చిన యట్లుగ నైతి దివ్యుడై.

నాకు మనస్సన్యాసికి
ఈ కదలిక హృదయమందు నేలా కలుగున్
సాకిరి బాకిరి విషయ
వ్యాకరణములెల్ల క్రొత్త వ్యాహృతి కనెనో.

---



# జాను తెనుగు-
# స్వరూప నిరూపణము

శ్రీ పంతరాం రామకృష్ణరావు

మహాకవి పాలకురికి సోమనాథుడు ప్రశంసించిన జానుతెనుగు స్వరూపము ఈ నాటికిని ఇతమిత్థమని తేలని సమస్యలలో ఒకటి. ఇప్పటికి చేయబడియున్న నిర్ణయము ఎంత అస్తవ్యస్తముగానున్నదో మొదట మనవి చేయుదును. సోమన తన వృషాధిప శతకములో జానుతెనుగును ఇట్లు పేర్కొనియున్నాడు.

చ. బలుపులితోలు సీరయును
బాపసరుల్ గిలుపారుకన్ను వె
న్నెలతలఁ జేఁదుకుత్తుకయు
నిండిన వేలుపుటేఱు పల్కుఁ బూ
సలు గల ఱేని లెంకవని
జానుఁ దెనుంగున విన్నవించెదన్
వలపు మదిందలిర్ప బసవా!
బసవా! బసవా! వృషాధిపా!

ఈ పద్యమునుబట్టి జాను తెనుగు—అనగా అచ్చ తెనుగేమో అన్న భ్రాంతి కలుగుచున్నది. కాని బసవ పురాణ పండితారాధ్య చరిత్రలలో సోమన వాడినది అచ్చ తెలుగు కాదు. కనుక జాను తెనుగు అనగా అచ్చ తెలుగు కాదు. ఆయన బసవ పురాణము లోను పండితారాధ్యచరిత్రలోను జాను తెనుగును గూర్చి యిట్లు వ్రాకుచ్చియున్నాడు.

''ఉరుతర గద్య పద్యోక్తులకంటె
సరసమై పరఁగిన జానుఁ దెనుంగు
చర్చింపగా సర్వ సామాన్యమగుటఁ
గూర్చెద ద్విపదలు కోర్కి దైవాఱ'' (బసవ)
''ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠ రచన
మానుగా సర్వ సామాన్యంబుగాదు
జానుఁ దెనుఁగు విశేషము ప్రసన్నతకు''
(పండితా)

ఇవి సోమన మాటలు. వీనినిబట్టి సంస్కృత భూయిష్ఠ రచనకాక ప్రసన్నమును సర్వ సామాన్యమును అగు తెనుగు జానుతెనుగు. సోమన రచనలో సంస్కృత సమాసాదులు గలవే! యీ నిర్ణయ మెట్లు సరిపడును? అన్నచో ఆయన జానుతెనుగు వ్రాయుటలో కృతార్థుడు కాలేకపోయెను—ఇది మనవారి ధోరణి. ఇంకను నయము. అచ్చతెలుగు కావ్యమునే వ్రాసెదనన్నాడుగాని అందులో కృతకృత్యుడు కాలేకపోయెనని అననందుకు మనము సంతోషింపవలెను! సంస్కృత భూయిష్ఠ రచన జానుతెనుగు కానిచో అంత ధారాళముగా వాడునా? అదేమి కర్మమోకాని సోమన అంతర్యమును గురి ంచుటలో మన పరిశోధకులు ఏ విషయములోను ఋజుత్వమును వహింపలేదు. లక్షణ సేతూల్లంఘనము చేయరాదని అమ్మహాకవి ఉద్ఘోషించుచున్నను వినక పరిష్కర్తగారు లక్షణ సేతూల్లంఘనము చేయుటయే శివకవి సంప్రదాయ

మన్నారుగదా! కవి ఉద్ఘోష నేటికిని మహాబధిర శంఖారావముగానేయున్నదిగదా! జానుతెనుగు అనగా అచ్చ తెలుగు కాదని సోమన గ్రంథములలోని భాషను బట్టి నిర్ణయించుట అభినందనీయమే. సందేహము లేదు. కాని జానుతెనుగు అనగా సంస్కృతభూయిష్ఠ రచన కాదని చెప్పి కవి జానుతెనుగు వ్రాయలేక పోయెనని మన అశక్తిని కవిపై నెట్టుటమాత్రము సమంజసముకాదు.

కవి అన్నమాటలను నిదానముగా పర్యాలోచించినచో అతని ఆంతర్యము తెలియవచ్చును. "జానుఁ దెనుంగు సర్వసామాన్యముగుటఁ గూర్చెద ద్విపదలు" అన్నాడు కనుక జాను తెనుగు సర్వ సామాన్యము— అనుచున్నారు. కాని జాను తెనుగు సర్వ సామాన్యముగుట ద్విపదలు వ్రాయుటకు హేతువుగా చెప్పబడినది గదా! ఇట హేతు హేతుమద్భావ మెట్లు సంగత మగునో యెవ్వరును ఆలోచింపలేదు. జాను తెనుగు సర్వసామాన్యమైనప్పుడు జానుతెనుగు వ్రాయవలెను గాని, ద్విపదలు వ్రాయుటేమి? పృష్ఠతాడనాద్దంత భంగః— అన్నట్లు లేదా? యిది. మరి సోమన ఆశయ మేమి? ఇట రెండు మాట లున్నవి (1) ఉరుతరగద్య పద్యోక్తులు (2) జానుతెనుగు. అనగా (1) ఉరుతరు గద్య పద్య నిబద్ధమైన తెనుగు (2) జానుతెనుగు— అన్నమాట. కాగా జాను తెనుగు ఎట్టిది అయి యుండును? ఉరుతర గద్యపద్యనిబద్ధము కానిదై యుండును గదా! అదేది? దేశీయచ్ఛందో నిబద్ధము కావచ్చునుగదా! ఇప్పుడు హేతు హేతుమద్భావము సరిపడును గదా! ఎట్లనగా ఉరుతర గద్య పద్యోక్తుల కంటె జానుతెనుగు—అనగా దేశీయచ్ఛందో నిబద్ధమైన తెనుగు సర్వసామాన్యముగుట కూర్చెద ద్విపదలు— అన్నాడన్నమాట. ఇట్లు గ్రహింపనిచో ఈ ద్విపదలకు అర్థమేలేదు.

ఈ దేశీయచ్ఛందో నిబద్ధమైన తెనుగు ఎట్లుండవలెను? అన్న ప్రశ్న లేనేలేదు. తత్సమము కానిండు. తద్భవము కానిండు. దేశ్యముకానిండు. అన్య దేశ్యము కానిండు. తుదకు సంస్కృత భూయిష్ఠ రచనయే కానిండు, అది దేశీయచ్ఛందో నిబద్ధమైనచో జాను తెనుగు. ఇది సోమన ఆశయము. సంస్కృత భూయిష్ఠ రచన సర్వ సామాన్యంబుగావి—అని సోమన అనుచుండగా సంస్కృత భూయిష్ఠ రచన జాను తెనుగు—ఎట్లగును? అన్న ప్రశ్న రావచ్చును. అసలు సంస్కృత భూయిష్ఠ రచన సర్వసామాన్యము కాదని సోమన అనెనా? ఆయన అన్నదేమి? మనము అన్నాడని అనుచున్నదేమి? ఆయన యెట్టి సంస్కృత భూయిష్ఠ రచన సర్వ సామాన్యముకాదు—అన్నాడు? "ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ పూరిత సంస్కృత భూయిష్ఠ రచన సర్వ సామాన్యంబుగావి" అన్నాడు. దీనిలో ఏకదేశమును తీసికొని ఆయన ఆశయమును నిర్ణయించుటసంగతమా? ఇటకూడరెండు విషయము లున్నవి. (1) ఆరూఢ గద్య పద్యాది ప్రబంధపూరిత సంస్కృత భూయిష్ఠ రచన (2) జాను తెనుగు. ఆరూఢ గద్యపద్యాది ప్రబంధ పూరితముకానిది దేశీయ చ్ఛందః పూరితము కావచ్చునుగదా! దీనినిబట్టి ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ నిబద్ధముకాక దేశీయచ్ఛందో నిబద్ధమై నప్పుడు సంస్కృతభూయిష్ఠ రచన కూడ జాను తెనుగు—అగునను సోమన ఆశయము వెల్లడి యగుచున్నదిగదా! ఇట్లు గ్రహింపనిచో ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ పూరితము—అన్న దానికి అర్థములేదు. ఇట మరియొక మాట. సోమన జాను తెనుగును సర్వ సామాన్యము, ప్రసన్నము—అని అనలేదు. ఉరుతర గద్య పద్యోక్తులకంటె జానుతెనుగు సర్వ సామాన్యమన్నాడు. ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ నిబద్ధమైన సంస్కృత భూయిష్ఠ రచనకంటె జాను తెనుగు—అనగా దేశీయచ్ఛందో నిబద్ధమైన తెనుగు సర్వ సామాన్యము, విశేషము ప్రసన్నతకు—అన్నాడు. సర్వ సామాన్యము, ప్రసన్నము అన్నవి ఉరుతర గద్య పద్యోక్తులతో పోల్చినప్పుడు గాని విడిగా కావు. అందుచే అక్షర జ్ఞానముగల ఎల్లరకు తెలియు బజారు భాషం వ్రాయుదునని సోమన చెప్పలేదు.

జానుతెనుగు—అనగా దేశీయచ్ఛందో నిబద్ధమైన తెనుగు—అని నిర్ణయించినచో ఒక ప్రశ్న

పుట్టును. సోమన "బలుపులితోలు సీరయును" అను చంపకమాలను జాను తెనుగు—అన్నాడే! ఇది యెట్లు సరిపడును? అన్నచో ఈపద్యమునుబట్టి సంస్కృత భూయిష్ఠ రచన కానిది జాను తెనుగు— అని శతక కాలమునాటి సోమన ఆశయ మనవచ్చును. మరియు శతకములో మకుట నియమాదులుండుటచే చంపక మాల వ్రాయుట అనివార్యమైనది; కనుక దేశీయ చ్ఛందోమయ రచన చేయుటకు వీలులేకపోయినదని చెప్పవచ్చును. ఒకవేళ సంస్కృతవృత్తములో వ్రాయ వలసిన నిర్బంధ మేర్పడినచో ఎట్టి భాష జాను తెనుగు—అనిపించుకొను ననగా "బలుపులితోలు సీర యును" వంటి సంస్కృతభూయిష్ఠముకాని రచన జానుతెనుగు అనిపించుకొనునన్నమాట. ఈ వృషాధిప శతకమును దృష్టిలోపెట్టుకొనియే సోమన జాను తెనుగు నిర్వచించుచోట్ల ఉరుతర గద్య పద్యోక్తుల కంటె ఆరూఢ గద్యపద్యాది ప్రబంధ పూరిత సంస్కృత భూయిష్ఠ రచన—అని ఉరుతరము, , ఆరూఢము అను విశేషణములను గద్యపద్యములకు చేర్చియుండును. వృషాధిప శతకమునుబట్టి సంస్కృత భూయిష్ఠ రచన జాను తెనుగు కారాదుగదా! బసవ పురాణములోసంస్కృత భూయిష్ఠ రచన యేలచేసెను? అని స్థూలదృష్టితో కొందరు సోమన కాలములోనే ఆక్షేపించియుందురని యూహింపవచ్చును. దానికి సమాధానముగా ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ పూరిత సంస్కృత భూయిష్ఠ రచన సర్వ సామాన్యంబుగామి జాను తెనుగు—అనగా దేశీయచ్ఛందో నిబద్ధమైన తెనుగు, సంస్కృత భూయిష్ఠమైనను సర్వ సామాన్యమును విశేషముగా ప్రసన్నమును కావచ్చునని పండితారాధ్యచరిత్రలో సోమన స్పష్టపరిచియుండును. ఇట్లే ద్విపదలో ప్రాసయతిని వాడుటను యతిర్వా ప్రాసోవా-అను ఛందో వినిహితోక్తి కలదని చెప్పి సమర్థించెను. "సంగీత కవితాయాంతు గణాదౌ యతి రుచ్యతే ప్రాసోవా నాతి సామీప్యే నాతి దూరే విధీయతే" (ఇతి పదకవితా సామాన్యలక్షణమ్— అహోబల పండితుడు) అను అధర్వణ వచనముతో సోమన వాక్యము సంవదించుచున్నది. లక్షణ సేతూల్లంఘనము చేసెనను భ్రాంతిని నివారించుటకు కుకవినింద సందర్భమున లక్షణ సేతూల్లంఘనము చేసిన కృతులు కృతులే కావని తీవ్రముగా నిరసించెను. ఇంత చేసినను మన పరిశోధకులు తిన్నగా అర్థము చేసికొనక సోమనకు మహోపచారము చేసినారు.

సరే! యీ సమన్వయము సోమన రచనలపట్ల సరిపడుచున్నది. కాని నన్నెచోడుడు జాను తెనుగును ప్రశంసించెనే! ఆయన కీ నిర్ణయమెట్లు సమన్వ యించును? అని ప్రశ్నింపవచ్చును. నిజమే. అడుగ వలసిన ప్రశ్న. ఆయనవి ఉరుతర గద్య పద్యోక్తులు. మరియు ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ పూరిత సంస్కృత భూయిష్ఠ రచనయే కాని ఆయనది సామాన్యమైన రచనయుకాదు. మరి జానుతెనుగు— కావలెనుగదా! ఎట్లగును? అన్నచో మార్గదేశిపద వ్యవహారములోను, జాను తెనుగు అనుటలోను నన్నె చోడునకు సోమనకు కొంతభేదము గలదు. నన్నె చోడుడు సంస్కృతమును మార్గకవిత యనును. మార్గానుసారియైనను దేశ భాషా కవితయైనచో చాలును దానిని దేశికవిత యనును. "మునుమార్గకవిత దేశంబున వెలయఁగ దేశికవితఁ బుట్టించి" అన్న నన్నె చోడుని అభిప్రాయమును ఇట్లే మనవారు సమన్వయించి యున్నారు. సోమన మార్గానుసారి దేశభాషాకవితను మార్గకవితయే అని అనును. నన్నెచోడునివలె దేశికవిత అని అనడు. ఇదియు మనవారు నిర్ణయించినదే. నన్నె చోడుడు దేశికవితనే జాను తెనుగు—అన్నాడు. జాను తెనుగు అని యేల అనెను? ఊరక తెనుగు—అన్నచో చాలదా? అని ప్రశ్నింపవచ్చును. 'జాను' శబ్దమునకు స్పష్టమని అర్థము చెప్పుచున్నారు. ఇది సరియే. తిక్కన "ఈ ఖగము జానుగ నన్ను నెఱింగె" (అను 1—155) అని 'జాను' శబ్దమును స్పష్టార్థమున ప్రయోగించియున్నాడు. దేశికవిత దేనికంటె జానుగా తెలియును? అనగా మార్గ కవితకంటె జానుగా తెలియును. మార్గ కవిత యనగా సంస్కృతముగదా!

సంస్కృతముకంటెదేశభాషాకవిత జానుగానుండునుగనుక దేశభాషాకవిత "జాను" శబ్ద వాచ్యము కాగలదు. కన్నడ మున "జాణ్ణుడి" అను శబ్దము కొందరి చేత వాడ బడియున్నది. నన్నెచోడుడు కన్నడమువారి జాణ్ణుడి ననుసరించియే జానుతెనుగు—అని వ్యవహరించి యుండును. ఈవిషయమును శ్రీ దివాకర వేంకటావ ధానిగారు "సాహిత్యోపన్యాసములు" అను గ్రంథమున తెలిపియున్నారు. కాని కన్నడపు 'జాణ్ణుడి' స్వరూప మును కర్ణాట లాక్షణికులు నిర్వచించియుండలేదు. మార్గ కవితకంటె దేశభాషాకవిత (దేశి) జానుగానుండు నను ఆశయముతోనే కన్నడమువారు తమ దేశ భాషా కవితను 'జాణుడి'గా వ్యవహరించియుందురు. తదను యాయి నన్నెచోడుడును దేశి కవితను జానుతెనుగు— అని యుండును. సంస్కృతముకంటె దేశ భాషా కావ్యములు రసావిష్కరణ సమర్థములని నన్నయయు పేర్కొనియున్నాడు.

> "స్వస్థాన వేష భాషాభిమత స్సంతో
> రసప్రలుబ్ధధియః
> లోకే బహుమన్యంతే వైకృత కావ్యాని
> చాన్య దపహాయ" (అం. చిం.)

ఇందు వైకృత కావ్యములపై పండితుల కాదర మేర్పడుటకు రెండు కారణములు చెప్పబడినవి. (1) స్వస్థాన వేష భాషాభిమానము (2) రసప్రలోభము. ఏమీ! సంస్కృత కావ్యములు రసావిష్కరణ సమర్థములుకావా? ఇందుకు వైకృతకావ్యములనే ఆశ్ర యింపవలెనా? ఆ ఆశ్రయించువారైనను పృథగ్జనులు కారే! సంతః అనుచున్నాడే! నన్నయ ఆశయమేమి? ఈనాడు ఆంగ్ల భాషలో విద్యాబోధన జరుగుచున్నది. "కానని వాని నూతగొని కాననివాడు విశిష్ట వస్తువుల్, కానని భంగి" అన్న సూక్తి అనుభవమగుచున్నది. కాన మాతృభాషలో విద్యాబోధన ఆవశ్యకమని గుర్తింప బడినది! ఇటి భాషా సమస్యయే ఆనా డేర్పడి యుండును. సంస్కృత పురాణాదులు ఆకాలమున ప్రచారములో నుండెను. ఎంత పాండిత్యము గడించినను పరభాష పరభాషయే. మాతృభాషద్వారా తెలిసికొను టయే నిజముగా తెలిసికొనుట. రసప్రతీతి మాతృ భాషలోనే సులభసాధ్యము. కావున నన్నయ నాటి పండితులు భాషాభిమానముతోను, రస ప్రలోభముతోను వైకృత కావ్యముల నాదరింప నారంభించిరని స్పష్టపడుచున్నది. ఇట నన్నయ సంస్కృతకావ్యము కంటె వైకృతకావ్యము సుబోధమను పండితాశయమును వ్యక్తము చేసినాడుగదా! వైకృత కావ్యమనగా దేశ భాషా కావ్యము. దీనినే నన్నెచోడుడు దేశికవిత యనెను. నన్నయ సంస్కృతమును ఆద్య ప్రకృతి యనెను. తెనుగును వికృతియనెను. "ఆద్యప్రకృతిః ప్రకృతి శ్చాద్యే ఏషా తయోర్భవేద్వికృతిః" (అం.చిం.). ఇచ్చటి ప్రకృతి వికృతి భావము "ప్రకృతి వద్వికృతిః" అనుమీమాంసా న్యాయమున తోచు ప్రకృతివికృతి భావము. "తదనుక్తస్య కార్యస్య వక్తా భవతి పాణినిః" అని అథర్వణాచార్యులు దీనిని వివరించియున్నారు. (అహెూ 14 పు. నూ. ము.). నన్నెచోడుడు ఆద్య ప్రకృతిని మార్గ కవిత యనెను. వికృతిని దేశికవిత యనెను. వ్యవహరించిన పదములు భిన్నములు గాని ఉద్దేశము మాత్రమొక్కటే. సంస్కృతముకంటె వైకృతకావ్యము సుబోధమన్న ఆశయమునే నన్నె చోడుడు 'జాను తెనుగు' శబ్దముచే సూచించెను. మార్గ కవిత కంటె దేశికవిత (దేశ భాషా కవిత) జానుగా నుండును గనుక దేశికవితను జానుతెనుగు—అని నన్నెచోడుడు వ్యవహరించెను. ఇది పిండితార్థము.

సోమన మతమున దేశికవిత యనగా దేశీయ చ్ఛందో నిబద్ధమైన దేశభాషా కవిత. ఇదే జాను తెనుగు. జాను శబ్దమునకు స్పష్టమనికదా!అర్థము. ఇది దేనికంటె స్పష్టముగా నుండునని సోమన ఆశయము? ఉరుతర గద్య పద్యోక్తులు లేదా ఆరూఢగద్యపద్యాది ప్రబంధ పూరిత సంస్కృత భూయిష్ఠ రచనలు దేశ భాషలో నున్నంత మాత్రమున ప్రసన్నములు కావు. సర్వ సామాన్యములును కావు. అంత కంటె దేశీయ చ్ఛందో నిబద్ధమైన రచనలు ప్రసన్నములు, సర్వ సామాన్యములు. కనుక ఉరుతర గద్యపద్యోక్తుల కంటె

జానుతెనుగు అనగా దేశియచ్ఛందో నిబద్ధమైన తెనుగు సర్వ సామాన్యమగుటచే సోమన ద్విపదలు కూర్చెద ననుట సందర్భించుచున్నది. ఉరుతర గద్యపద్యోక్తులు, ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ పూరిత భూయిష్ఠ రచనలు సోమన మతమున మార్గ కవితయే అగును. ఇట్టి మార్గ కవిత కంటె దేశికవిత యనగా దేశీయ చ్ఛందో నిబద్ధమైన దేశ భాషా కవిత జానుగా నుండును కనుక ఈ దేశికవితను జాను తెనుగు అని సోమన వ్యవహరించెను. ఇది పిండితార్థము.

కాగా నన్నెచోడుని మతమున దేశి యనగా దేశభాషా కవిత. ఇది మార్గ కవితకంటె (సంస్కృతము) జానుగా నుండును. గనుక జాను తెనుగు—అనిపించు కొనును. ఇక సోమన మతమున దేశి యనగా దేశీయ చ్ఛందో నిబద్ధమైన దేశ భాషా కవిత. ఇది మార్గ కవితకంటె అనగా— ఉరుతర గద్య పద్యోక్తులు, ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ పూరిత సంస్కృత భూయిష్ఠ రచనలు అగు మార్గానుసారి దేశభాషా కవిత కంటె జానుగా నుండును గనుక జాను తెనుగు అని పించుకొనును. నన్నెచోడుని మతమునను, సోమన మతమున జానుతెనుగు తత్సమమైన కావచ్చును. తద్భవమైన కావచ్చును. దేశ్యమైన కావచ్చును. అన్య దేశ్యమైన కావచ్చును. తుదకు సంస్కృత సమాసభూయిష్ఠమైన రచనయైన కావచ్చును. సోమన నిర్వచించిన జానుతెనుగు స్వరూపమును, నన్నెచోడ సోమనలు వాడిన భాషను పర్యాలోచించినచో ఈ నా నిర్ణయము కవి హృదయ సమ్మతమే అని తత్త్వాన్వేషణ తత్పరులకు తోచకమానదు. గుణ గ్రహణ పారీణులగు పరిశోధకులు సావధానముగా పరికింతురుగాక!

---



# ఆదిమ ప్రాణులు : అమృతత్వ లక్షణము

"విజ్ఞాని"

గ్రహాలలో ప్రాణిజాతం ఏమన్నా వున్నదేమో తెలుసుకుందామని, అంతరిక్ష యాత్రలు, పరిశోధనలు జరుగుతూవుండగా, భూమిమీద ప్రాణియొక్క ఆవిర్భావ రహస్యాలను శాస్త్రజ్ఞులు ఛేదిస్తూ వస్తున్నారు. భూమిమీద రాతి ఉప్పు గనులు ఉన్న ఒక చోట Micro-Organisms శాస్త్రజ్ఞులకు కనిపించాయి. Micro-Organisms అనగా సూక్ష్మాతి సూక్ష్మమైన ప్రాణి విశేషాలు. ఈ ప్రాణులు ఇంకా జీవించే ఉన్నాయి. కొన్నికోట్ల సంవత్సరాల క్రిందటి ప్రాణులు ఇవి. వాటికి ఇప్పటికి అభావం కల్గలేదు. ఇవి ఇట్లా ఉన్నట్లు తేలడం అద్భుతాలలో అద్భుతం. వీనివలన "ప్రాణం" అనే దానిని గురించి ప్రాతిపదకమైన ఎరుక కల్గడానికి గూడా ఆస్కారం ఏర్పడుతున్నది.

ఈ సూక్ష్మజీవులులేక ప్రాణులు ఇప్పటివికావు. చరిత్రఅంటూ, మనకు తెలిసిన చరిత్ర ప్రారంభం కాకముందుఎంతోపూర్వంనుంచీ వుంటున్నాయి. వీనిని దర్శించిన విజ్ఞానవేత్త డా. దోంబ్రోవ్స్కీ. ఒకచోట ఉప్పుగనలు త్రవ్వుచున్నారు. ఆ త్రవ్వకాల సందర్భంలో యీ సూక్ష్మప్రాణులను గురించి ఆచూకీ తెలిసిందని ఆయన అన్నారు. ఆ రాతి ఉప్పుగనులు Zechstein యుగంనాటివి. ఇవి పద్దెనిమిది లేక ఇరవై కోట్ల సంవత్సరాల నాటివని శాస్త్రజ్ఞులు అంచనా. ఇవి కన్పించిన అనంతరం శాస్త్రజ్ఞుల మరియు అన్వేషణ ఆరంభం చేశారు. ఇతరమైన రాతి ఉప్పుగనులలో కూడా ఇటువంటి 'సూక్ష్మప్రాణిజాతం వున్నదేమోనని పరిశోధనలు ప్రారంభించారు. ఈ పరిశోధనలవలన తేలిన విషయం ఇది: భూమికి ఒక చరిత్రవుంది. ఆ చరిత్రలో రాతియుగం ఒకటి. ఇది అనుస్యూతమైంది. ఇప్పుడు మనం ఎరిగిన భూమి యొక్క చారిత్రక విభాగాన్ని Cenozoic era అంటున్నారు. దీనిని మనం అద్యతన అశ్మ యుగం అని అనవచ్చు. ఇచ్చట Ceno అనే మాటకు New, అని అర్థం. Recent అని అర్థం. అనగా అర్వాచీనమైనదన్న మాట. అందువలన యీ రాతియుగాన్ని పైన అన్నట్లు అద్యతన అశ్మయుగం అనిగాని, అర్వాచీన అశ్మయుగం అనిగాని మనం చెప్పుకోవచ్చు. లేదా అచ్చ తెనుగులో "క్రొత్తరాతి"యుగం అనుకోవచ్చు. ఈ కొత్తరాతియుగంలో కూడా అనేక విభాగాలు ఉన్నాయి. అందులో Tertiary యుగ విభాగం ఒకటి. ఈ మాటను లాటినుభాషలోంచి సాధించారు. Tertiarius అన్నమాటవుంది. అనగా మూడవది అని అర్థం. ఇప్పుడు Tertiary అనగా మూడవ విభాగము అని అర్థం. ఈ విభాగం క్రొత్తరాతియుగంలోపాతకాలానికి చెందిన వానిలో ఒకటి. భూగర్భశాస్త్రంప్రకారం 20 లక్షలు మొదలు 600 లక్షల సంవత్సరాల వెనుకటి కాలం. ఇది కాక Mesozoic యుగం అని ఇంకొక రాతియుగంవుంది. Meso అనగా 'మధ్య'. అనగా నడిమి విభాగం. దీనిని

మధ్య రాతియుగమనిగాని, నడిమి రాతియుగమనిగాని అనవచ్చు. అయితే ఇక్కడ ఇది యే యే రాతియుగాల నడిమి భాగమని ప్రశ్న ఉదయిస్తున్నది. భూమికి సంబంధించిన యీ రాతియుగాలలో Cenozoic యుగాన్ని గురించి పైన చూచాము. అంతకుముందు Paleozoic యుగం అన్నది ఒకటి వుంది. Paleo అనగా, 'పురాతనము' అని అర్థం. 'పాత' అని అర్థం. కాబట్టి దీనిని పాతరాతి యుగమని, లేక పురాతన అశ్మయుగం అని అనవచ్చు. ఇప్పుడు చెప్పిన ఈ Cenozoic యుగానికి , Paleozoic యుగానికి మధ్య నడచిన భూమియొక్క చరిత్రను, లేక కాలాన్ని Mesozoic యుగం అంటున్నారు. అనగా ఇది మధ్య రాతియుగం అన్నమాట. ఇక ఇప్పుడు ప్రాణి కోసం అయిన అన్వేషణలో శాస్త్రజ్ఞులు తెలుసుకున్న దేమంటే, సూక్ష్మజీవులు—సజీవమైనవి— Tertiary యుగానికి చెందిన రాతి ఉప్పుగనుల లోను, Mesozoic యుగానికి చెందిన రాతి ఉప్పుగనులలోను మాత్రమేగాక, భూమియొక్క చరిత్రకు చెందిన అన్ని రాతి యుగములకు సంబంధించిన అన్ని రాతి ఉప్పుగనులలోను, యీ సూక్ష్మజీవులు లేక యీ Bacteria ఉనికి కొనివున్నవి—అని. ఇప్పుడు పైనచెప్పిన రాతియుగాలకన్నా కూడా పురాతనమైన రాతియుగాలు వున్నాయి. ఆ యుగాలకు చెందిన రాతి ఉప్పుగనులలో కూడా యీ ప్రాణిజాతం ఉన్నదీ—అని.

ఈ రాతియుగాలలో Cambrian Era అన్న విభాగం ఒకటి వుంది. ఇది Paleozoic era లేక పురాతన అశ్మయుగంలో ప్రథమ విభాగం. ఈ యుగానికి చెందీన అశ్మాకృతులు లేక Fossils చాలా లభించాయి. ఇప్పుడు ఏ సూక్ష్మ ప్రాణులను శాస్త్రజ్ఞులు దర్శించారో, అవి ఈ పాత రాతియుగంకన్నా కూడా పూర్వపువి. రాతి ఉప్పు గనులలో 50 కోట్ల సంవత్సరాలకు పూర్వమునాటి సూక్ష్మజీవులు Microbes కనుపించాయి. ఇంతకంటే పూర్వపువి అని చెప్పదగిన సూక్ష్మప్రాణిజాతం వేరే లేకపోవచ్చు. ఎందుచేతనంటే ఇప్పుడు యీ సూక్ష్మజీవులు కనిపించిన యే ఉప్పుగనులైతే వున్నాయో, వానికన్నా పురాతనమని చెప్పడానికి తగిన ఉప్పుగనులు, భూగర్భశాస్త్రజ్ఞులకు ఎక్కడా కన్పించలేదు.

ఈ కారణంచేత ఇప్పుడు కన్పించిన యీ సూక్ష్మజీవులే అనాది ప్రాణిజాతం అయివుంటాయి. ఇది భూమిమీద సంగతి. ఇతర గోళాలు—కుజుడు మొదలైనవి వున్నాయి— వానిలో సంగతి ఏమో ఇప్పుడు చెప్పలేము. ఆ విషయాన్ని గురించికూడా పరిశోధనలు సాగుతున్నాయిగాని, అవి ఇంకా ఒక్క రూపానికి రాలేదు.

జర్మన్ శాస్త్రజ్ఞులు జరిపిన యీ పరిశోధనలో అత్యంతము కుతూహలాన్ని కలిగించే విషయం ఒకటివుంది. ఈ సూక్ష్మజీవులు వున్నాయంటే, అవి ఇంతకాలం, ఇన్ని కోట్ల సంవత్సరాలు ప్రాణశక్తిని కోల్పోకుండా ఎలా బ్రతికివున్నాయి?

ఈ అంశాన్ని పరిశీలించేముందు మరికొన్ని విషయాలను ఇచ్చట పరామర్శించవలసిన అవసరంవుంది. భూమండలంయొక్క తొలి చరిత్రలో ప్రాణాన్ని ఉద్భవింపజేసిన, లేక ప్రాణశక్తి ని ప్రసాదించిన ప్రక్రియా కలాపాలు కొన్ని జరిగి ఉన్నాయి. ఇక్కడ ముందు వానిని గురించి కొంత తెలుసుకొనవలసిన అవసరం వుంది. సూక్ష్మజీవులు ఉన్నాయంటే వానిలో ఒక రసాయనిక క్రియాకలాపం అనుక్షణమూ కొనసాగుతూ ఉంటున్నది. దానిని ఇక్కడ పేర్కొనడం అవసరం. ప్రతి జీవంలోను, ఆఖరికి ఏకకణాంగ జీవులలో గూడా రెండు రకాల పనులు జరుగుతూ వున్నాయి. ఒకజరిగేపనిని అనబోలిజం అని అంటున్నారు. అంటే ఆ జీవంలోను జీవకణంలోను అది గ్రహించిన ఆహారం ప్రోటోప్లాజంగా మారేందుకు జరిగే పని అన్నమాట. మళ్లీఆప్రోటోప్లాజం తేలికఅయిన మిశ్రణములుగా మారుతూ వుంటుంది. ఇది గూడా ఒక పద్ధతిని

అనుసరించి జరుగుతుంది. దీనిని కేటబోలిజం అంటున్నారు. ఈ జరిగే పనులను Metabolism అంటున్నారు.

'మెట' అనే గ్రీకుమాటకు 'కూడి', 'కలిసి', 'తరువాత'—ఇట్లా అర్థాలు ఉన్నాయి. దానికి'బోల్' అనే ఇంకో గ్రీకు మాటను చేర్చి దానితో సహా యీ 'మెటబాలిజం' అనే మాటను సాధించారు. 'బోల్' అనగా మార్పు అని అర్థం. అదేవిధంగా కేటబోలిజం అనే మాటను గూడా గ్రీకు శబ్దాలతోనే కూర్చారు. కేట, బోల్—అనేవి ఆ మాటలు. కేటబోల్ అనగా త్రోయు, క్రిందికిత్రోయు, ఎదురుతిరుగు—మొదలైన అర్థాలు ఉన్నాయి. ఇక్కడ విజ్ఞానశాస్త్రంలో విభజించు, నాశనముచేయు అన్న అర్థాలతో యీ మాటను వాడుతున్నారు. ఇప్పుడు ప్రతి జీవంలోను జీవకణంలోనుకూడా యీరెండుపద్ధతులు ఒకేవిధంగా ఉంటున్నాయి. ఇది శాస్త్రవేత్తలకు ఆశ్చర్యాన్ని కల్గిస్తున్నది. పాతరాతియుగంనాటి కాంబ్రియన్‌కాలము, సిలూరియన్ (Silurian) కాలములనాటి సూక్ష్మజీవులలోనేమి, డెవోనియన్‌కాలమునాటి సూక్ష్మజీవులలోనేమి, జీవరసాయనగుణములు లేక లక్షణములు ఆట్టే లేవు. ఇచ్చట పైన పేర్కొనబడి Silurian Period అన్నది, Devonian Period అన్నది కూడా భూమియొక్క చరిత్రకు సంబంధించిన రాతి యుగముల విశేషాలే. వీనిలో డెవోనియన్ విభాగము, సిలూరియన్ విభాగము తరువాతిది; సిలూరియన్ విభాగము ఆర్డోవిషెన్ విభాగానికి ముందునాటిది. ఈ ఆర్డోవిషెన్ (Ordovician) విభాగం కూడా Paleozoic యుగానికి చెందినదే. అయితే సూక్ష్మజీవులు ఎంతగా పురాతనమైనవైతే, వానిలో మార్పులు అంత ఎక్కువగా వుంటాయి. ఇక్కడ శాస్త్రజ్ఞులు ఈ సూక్ష్మజీవులను లేక క్రిమి జాతాన్ని గురించి మరో విషయం కూడా తెలుసుకున్నారు. డెవోనియన్ అశ్మ విభాగకాలం నాటివిన్నీ, అంతకు ముందుకాలం నాటివిన్నీ అయిన సూక్ష్మజీవులు కుడ్యకాయాలను నిర్మించుకునేవి. ఇంగ్లీషు భాషలో యీ కుడ్యకాయాలను Spores అన్నారు. Spore అన్న మాటకు రసాయన శాస్త్రంలో ఇటువంటి అర్థాన్ని కుదిర్చారు. A spore is a walled body that contains or produces one or more uninucleate organisms that develop into an adult individual- అనగా యీ కుడ్యకాయం ఒక విధమైన లక్షణం కలిగి వుంది. అది యేమంటే, అది ఒక్కటి ఏకాణు జీవకాయాలను అనేకం సృష్టించగలదు. లేదా అవి ఆ కాయంలోనే ఉండవచ్చును. అవి క్రమశః పెద్ద వియ్యై ఆకారవిశేషాలతో మూర్తికట్టగలవు. ఇటువంటి కుడ్యకాయాలన్నీ "gram-positive" అని శాస్త్రజ్ఞులు నిరూపణ చేశారు. సూక్ష్మజీవులను వర్గీకరించే పద్ధతి ఒకటి వుంది. దానిని 'Gram's method' అంటారు. ఈ పద్ధతిని హెచ్. సి. జె. గ్రామ్ కని పెట్టారు. ఈయన 1853 లో పుట్టి 1938 లో


ఆయుర్వేద భూషణ
పండిత నోరి రామశాస్త్రులవారి

*** క్షీరవర్ధని ***

**చనుబాలను వృద్ధిచేయు రసాయనము. దీనిని** వాడుటవలన చనుబాలు స్వచ్ఛమై సమృద్ధిగా పసిపాపకు సరిపోవునట్లుచేసి, తల్లిపిల్లల యారోగ్యమును కాపాడును.
వెల 100ml రు. 3/- : 200ml రు. 5/-

*** జీవనవటి ***

**ధాతుపుష్టికి, నరముల పటుత్వమునకు ప్రసిద్ధి గాంచినది.** శుక్లనష్టము, నపుంసకత్వములచే పీడింపబడు వృద్ధులకు సైతము శక్తి నిచ్చి, ఓజస్సును వృద్ధి చేయును.
వెల 30 మాత్రలు రు. 6/-

మాచే దీర్ఘవ్యాధులకు పోస్టుద్వారాకూడ సలహో యిచ్చి, ప్రత్యేకచికిత్స చేయబడును. క్యాటలాగు, సలహా ఉచితము.

డాక్టరు నోరి వెంకటేశ్వరశాస్త్రి,
A.V.A.C., A.L.I.M.
**చీఫ్ ఫిజిషియను. ఆయుర్వేద నిలయం,**
పోస్టుబాక్సు 32, **విజయవాడ-1.** ఆంధ్రప్రదేశ్.

చనిపోయారు. ఆయనపేరనే యీ సూక్ష్మజీవులను వర్గీ కరించే పద్ధతికి "Gram's Method" అన్న పేరు వచ్చింది. ఈ పద్ధతులు రెండు. ఒకటి Gram's positive రెండవది Gram's negative. Gram's Method ప్రకారం సూక్ష్మజీవులను వర్గీక రించేప్పుడు ముందు ఆ సూక్ష్మజీవులు వున్న పొరను Crystal voilet తో రుద్దుతారు. తర్వాత దానికి Gram's Iodine ను పట్టిస్తారు. ఆ సూక్ష్మజీవులు Gram-positive అయినటయితే అవి ఊదారంగు (violet)గా ఉంటాయి. Gram's Negative అయితే రంగు విరుగుతాయి. ఇప్పుడుఈస్పైకాలాలకు చెందిన సూక్ష్మజీవులను గురించి శాస్త్రజ్ఞులు తెలుసుకున్న విషయంయొక్క అర్థం ఇది. Grams' Method ను అనుసరించి యీసూక్ష్మజీవు లను వర్గీ కరించినప్పుడు, ఇవి ముదురు నీలపురంగు (Deep Blue) ను నిల్పుకుంటాయి. Gram's Negative తరగతికి చెందినవి అయితే ఎరుపు రంగుకు మారుతాయి.

ఈ పరిశోధన ఫలితంగా మరొక విషయం కూడా తేలింది. అతి సూక్ష్మమైన కుడ్యకాయాలను ఉత్పత్తి చేయని సూక్ష్మజీవులలో 'గ్రామ్-నెగిటివ్' సూక్ష్మజీవులు మొదట దృశ్యమానం అవుతాయి. పురాతనములు, మరీ పురాతనములు అయిన సూక్ష్మ జీవులు, దండాకారంలో ఉండి కన్పించాయి. కొంత అర్వాచీనమైన ఉప్పు నిల్వలలో—ఇవి కూడా దాదాపు $2\frac{1}{2}$ కోట సంవత్సరాలనాటివి—కాకస్ జాతికి చెందిన సూక్ష్మజీవులను వేరు చేయుటం సాధ్యమైంది.

ఇప్పుడు ఇక ఈ సూక్ష్మజీవులు ఇప్పటివరకు జీవించివున్న విషయానికి వద్దాము. సూక్ష్మజీవులను ఎండబెట్టి వానిప్రధానమైన కార్యాలకు ఏమాత్రందెబ్బ తగులనీయకుండా వాటిని అనేక దశాబ్దాలపాటు భద్ర పరచవచ్చును. ఇందుకు మరోమార్గం ఉన్నది. అది వాటిని ఉప్పులో ఉంచటము. ఈ పద్ధతివలన సూక్ష్మ జీవులను భద్రపరచవచ్చును. అప్పుడు తిరిగి వానికి ప్రాణశక్తి పునరుద్భవం అయ్యేటు కూడా చేయువచ్చును. డాక్టర్ దంబ్రొవ్‌స్కీ సూక్ష్మజీవులు కొన్నింటిని ఏడేళ్లపాటు ఉప్పుగడ్డలలో ఉంచారు. తర్వాత వాటిని బలవర్థకము, పోషణసమర్థము అయిన ఒక సొల్యూ షన్‌లో ఉంచారు. వెంటనే వాటికి తిరిగి ప్రాణం వచ్చి అవి వృద్ధి కావడం ప్రారంభమైంది.

మూడవ పద్ధతి: అవి బాగా గడ్డకట్టుకుని పోయేటట్టుచేయుటం. ఈ పద్ధతివల్ల తక్కువరకము సూక్ష్మజీవులను వాని మామూలు ఆయుఃప్రమాణానికి మించి అనేక వందలరెట్లు ఎక్కువ కాలము భద్రపరచ వచ్చును. ఈ సూక్ష్మజీవులను దాదాపు "సున్నా" డిగ్రీల ఉష్ణోగ్రతలో ఉంచితే వాని ప్రధానధర్మాలు ఏమాత్రంలోపించకుండా అవి కోట్లకొలదిసంవత్సరాలు జీవించటం సాధ్యం కావచ్చును.

ఇటువంటి ఉష్ణోగ్రతలలో ప్రోటీన్, న్యూక్లిక్ యాసిడ్ల నిర్మాణ స్వరూపం విడిపోవటం అంటూ జరిగితే,అది చాలా నెమ్మదిగా జరుగుతుంది. ఇందువల్ల మనం అతి ప్రాకృతమైన రూపంలోవున్న ప్రాణం—ఏమైనా అది ప్రాణమే—దాదాపు చావులేనిదని చెప్పు కోవచ్చును.

డాక్టర్ దంబ్రొవ్‌స్కీ పరిశోధనల ప్రకారం మృత్యువు అనేది ప్రతి ప్రాణికి సహజంకాని, తప్పనిసరి కాని కాదు. ప్రాణులు బాగా అభివృద్ధి చెందటంతో మృత్యువు వచ్చింది. ప్రాణి ఎంతమేరకు అభివృద్ధి చెందుతుందో అంత మేరకు ఆయుఃప్రమాణం తగ్గి పోతుందనేది యథార్థ విషయం. ఈ విషయంలో ప్రాణికోటిని మూడు రకాలుగా విభజించవచ్చునని డాక్టర్ దంబ్రొవ్‌స్కీ భావిస్తున్నారు. మనుష్యులు, జంతువులు అన్నిటికన్నా తక్కువ ఆయుఃప్రమాణం కల ప్రాణులు. కొన్ని వృక్షాలు—మనుష్యులు, జంతు వులకన్నా ఎంతోఅధికకాలం బతికివుంటాయి. అయితే యీ అన్నిరకాల ప్రాణులలోను సూక్ష్మజీవులకు

అత్యధికమైన ఆయుః ప్రమాణం వున్నదని ఏటువంటి సందేహము లేకుండా చెప్పుకోవచ్చును.

సూక్ష్మజీవుల ప్రపంచములో అతి ప్రత్యేకమైన వింతలక్షణం ఒకటి కనబడుతుంది. సూక్ష్మజీవి ఏక ప్రోటోజోవన్ వృద్ధి చెందుతూవుంటే అనగా విభక్తం అయివుంటే మృత్యువుకు సంబంధించిన లక్షణాలన్నీ మాయమై పోతున్నాయి. శవంలో ప్రాణం లేకుండాపోతుంది. సూక్ష్మజీవులయొక్క "పూర్వులు" తమ సంతతిలో జీవిస్తూనే ఉంటాయి. ఈవిధంగా అవి దాదాపు చావులేనివిగా ఉంటున్నాయి. ఇటువంటి సూక్ష్మజీవులలో, ప్రాణం ఎంత కాలమైనా, అట్లానిలచిఉంటుంది. ఇంకా చాలాకాలంవరకు అలానే చెక్కు చెదరకుండా నిత్య నూతనంగాఉంటుంది.

ఉన్నత జాతికి చెందిన సూక్ష్మజీవులలో కూడా అనగా బాగా అభివృద్ధిచెందిన సూక్ష్మజీవులలోకూడా యీ అమృతత్వబీజంఅంటూ ఒకటి ఉన్నటే తోస్తుంది. డా. దంబ్రోవ్స్కి ఇట్లా అంటున్నారు: "బాగా అభివృద్ధి చెందిన ఉన్నత జాతి సూక్ష్మజీవులుకూడా బీజరూపంలో ప్లాస్మాస్థితిలో ఉన్నప్పుడు, ఏకకణ సూక్ష్మజీవులవలెనే అవి గూడా అమృతత్వమైన స్థితిలోనే వుంటూఉంటాయి. అందువల సజీవం అయిన ప్రతి ఒక్క ప్రాణిలోను ఆ అమృతత్వశకలం లేక, అంశ వుంటూనేవుంది. అదిలేకపోతే అసలు జీవించడం అన్న వ్యాపారమే జరగదు."

---



# ఇరుగు పొరుగు

## శ్రీ వి. ఎస్. సుఖ్‌ఠణ్‌కర్

ఇరుగు పొరుగువారైన సంతూ షెనాయ్, పావ్‌లోడిసా తగువులాడుకున్నారన్న పుకారు ఫుల్‌గాంవ్ గ్రామంలో లేచినప్పుడు ఎవరూ నమ్మారుకారు. కాని మరుసటిరోజు ఆ ఇద్దరూ పెద బజారులో అంగళ్లవద్ద ఒకరి నొకరు మాటలనుకోవడం ప్రత్యక్షంగా చూసే సరికి అంతా నమ్మక తప్పలేదు. అటు పక్కి అటు పక్కి వారి తగువు వార్త గ్రామస్థులకు చర్చనీయాంశ మైంది. ఇద్దరూ పెద్దమనుషులు. వారి కుటుంబాలు కూడా అంతే. అంతా వారిని ఎంతో గౌరవంగా చూచేవారు. అటువంటివాళ్లు పోట్లాడుకున్నారనే సరికి వూరు వూరంతా ఏమి జరిగిందా అన్న కుతూహలం కనపరచింది. గ్రామంలో ఏ వ్యాజ్యాలు వచ్చినా, రైతుకూ భూస్వామికీ మధ్య ఎట్టి పేచీ ఏర్పడ్డా, ఏ కుటుంబంలో ఎటువంటి కలత వచ్చినా వీ రిద్దరికీ చెప్పుకొనేవారు. వీరి సలహాను పాటించేవారు. ఏదీ వీరిదాకా రాకుండా పోయేదికాదు. వీరి సలహా లేకుండా పరిష్కారమయ్యేదికాదు. సంతూ షెనాయ్ హిందువు. పావ్‌లోడిసా క్రైస్తవుడు. అయినా ఇరుగు పొరుగుగా ఎంత అన్యోన్యంగా ఉండేవారంటే—కొన్ని తరాలుగా ఆ రెండు కుటుంబాల వారి మధ్య పెరుగుతూ వచ్చిన స్నేహం, అనురాగం అంత హఠాత్తుగా భంగపడతాయని ఎవరూ వూహించనేలేదు. పైగా వారి మధ్య వచ్చిన పొరపొచ్చెములకు కారణం కూడా ఎంత అల్పమైనదో !

దీని కంతటికీ కారకుడు సంతూషెనాయ్ మనుమడు. అంటే ఆయన కూతురి కొడుకు. వాడి పేరు సోనూ. పదిహేడేళ్లవాడు. సెలవులో తాతగారింటికి వచ్చాడు. వచ్చి వారం రోజులైనా కాకమునుపే ఆ రెండు పెద్ద కుటుంబాలకూ చిచ్చు పెట్టాడు.

ఎలాగైతేనేమి, సోనూకు ఒకానొక ఘనత అబ్బింది. అతను బస్తీలో ఉంటున్నాడు. ఆ బస్తీ గోవాకు పూనా వంటిదని పేరు. ఆ బస్తీలో పైకి వస్తూఉన్న ఒక రకం కుర్రకారుకు సోనూ మచ్చుతునక వంటివాడు. ఆ రకం ఎటువంటిది ? పెద్ద బజార్లో జరిగే సభలకూ—సమావేశాలకూ వెళ్లి అక్కడ ఉపన్యాసాలనూ చర్చలనూ విని, లైబ్రరీలకు వెళ్లి పుస్తకాలు చదివి కొంత మిడి మిడి జ్ఞానం సంపాదించి ఏదో వాగుతూ ఉంటారు. ఆ కోవకు చెందినవాడు సోనూ ! పరిపక్వానికి రాని, బాగా జీర్ణించుకోని విజ్ఞానం అతనిది. పైగా దాదాపు అరడజను విద్యార్థి సంఘాలకూ, సౌభ్రాత్ర సమితులకూ అతను కార్యదర్శి. అవి ఎలా పుడుతూ ఉంటాయో అలాగే అంతం కూడా అవుతూ ఉంటాయి. ఏదీ పదిరోజులపాటు నిలకడగా ఉండదు. ఈమధ్య సోనూ స్థానిక సభలలో సభాధ్యక్షుని పేరు ప్రతిపాదించడం, లేదా మరొకరెవరైనా ప్రతిపాదిస్తే తాను బలపరచడం, సభ ముగిసే ముందు కృతజ్ఞతాభివందనలు చెప్పడం వంటి పనులు కూడా చేస్తున్నాడు. చెప్పుకోదగ పేరు గల బస్తీలో అందులోనూ ప్రజాజీవితానికి సంబంధించిన కార్యకలాపాలలో ఇటువంటివి చేయడమంటే అతని స్థాయి పెరిగిందన్నమాట. అతనూ ప్రజానాయకుడు కాబోయ్యే ముందరి దశలో ఉన్నాడన్నమాట !

పైగా తాను చేస్తూఉన్న ప్రజాహిత కార్యకలాపాలను చూచి వారూ వీరూ తనను ప్రశంసిస్తున్నారు. వీపు తట్టుతున్నారు. ఇవన్నీ చూస్తూవుంటే తనకు కుణ్ణంగా తెలియని విషయమంటూ లేదన్న భావం (లేదా అహంభావం) సోనూకు కలిగింది. ప్రపంచంలో ఏ విషయంపైనైనా ఉపన్యాసం దంచడా

నికి సిద్ధమయ్యేవాడు. కొన్నినెలలుగా అతను బ్రిటిషిండియాలో హిందూ ముస్లిం కలహాలనుగూర్చిన పత్రికల వార్తలు చదివి అదేపనిగా ఆలోచిస్తున్నాడు. హిందూ మతం ఘోర ప్రమాదానికి గురి అయ్యే స్థితిలో ఉందన్న ధోరణితో తీవ్రపరిశీలన చేయసాగాడు. మరి గోవా పోర్చుగీసువారి ఇండియా. ఇక్కడ కయ్యానికి కాలుదువ్వేవాడు క్రైస్తవుడే నన్న విశ్వాసం అతనికి కలిగింది. కనుకనే క్రైస్తవమతమన్నా, దానికి సంబంధించిన మరేవిషయమన్నా అతనికి ఎక్కడలేని ఏవగింపు. పొడవాటి నల్లని అంగీ వేసుకున్న పాదిరీ, చర్చిపైగల శిలువ, చర్చి గంటల మ్రోత—అంతా తన సనాతనధర్మానికి మహాపద్రవమేఅనుకుంటాడు. బ్రిటిషిండియాలో హిందూ ముస్లిం సమస్యనుగూర్చి దేశభాషా పత్రికలు వ్రాసిన వ్యాసాలన్నీ అతనికి కొట్టిన పిండి అయ్యాయి. ఆ భోగట్టా అంతా దట్టిస్తూ, దృష్టాంతాలు చెబుతూ, తర్కించేస్తూ తనకు అభిమానపాత్రమైన ఆ విషయంపై ఏకధాటిగా ఉపన్యాస మివ్వడం అలవరచుకున్నాడు.

ఫుల్‌గాం గ్రామంలోని సాంఘిక పరిస్థితుల నన్నిటినీ సమీక్ష చేయగా హద్దనేది లేకుండా ఉభయ మతాలవారి మధ్య మరీ అంతగా స్నేహ సద్భావాలు ఉండడం సోనూకు ఎంతో ఆందోళన కలిగింది. వీళ్ళెంత గుడ్డివాళ్ళు! ఏమైనా తన మతస్థులను వెంటనే వారి దీర్ఘ నిద్రనుంచి లేపాలనుకున్నాడు. అప్పుడు వారిలో జాగృతి కలిగి రాబొయ్యే క్రైస్తవ ప్రమాదాన్నుండి తమను తాము కాపాడుకోవడానికి ఒక రక్షణశ్రేణి నిర్మించుకో గలుగుతారు. అతను తలపెట్టిన ఈ మహోద్యమానికి తగిన వేదిక అతనికి లభించింది. అది తాతగారి ఇంటిముందరి పెద్ద అరుగు. ఉపన్యాసకుడైన వాడికి అంతకంటె ఏం కావాలి? అది గ్రామానికే చర్చావేదిక. ఆ వూరి పెద్దలు సాయంకాలం ఆ అరుగుపై చేరి లోకాభిరామాయణ మంతా చెప్పుకొని, ప్రతి సమస్యనూ కూలంకషంగా చర్చించి ఒకపరిష్కారమంటూ తేల్చుకొని గాని అక్కడి నుంచి కదలరు.

సోనూకు ఈ అరుగుపై జరిగే సమావేశాలు ప్రాణప్రద మయ్యాయి. రెండు మూడు రోజులలోనే అక్కడి శ్రోతలను ఆకట్టుకున్నాడు. అతని ప్రసంగాలు ఫుల్‌గాం ప్రజా జీవితంలో ముఖ్యాంశా లయ్యాయి. జలపాతం వంటి వాగ్ధాటితో ఆర్యనాగరికత వైభవాన్ని గూర్చి, సనాతన ధర్మ విశిష్టతను గూర్చి, ముస్లిం—పోర్చుగీసుల మతోన్మాదాన్ని గూర్చి, ఇంకా వాస్కోడ గామాను గూర్చి, క్రైస్తవులలో ఒక తెగవారైన జెసూట్లనుగూర్చి, జిజ్ఞాసనుగూర్చి, ఆర్యసమాజాన్ని గూర్చి ఉపన్యాసం దంచేవాడు. పాపం అభం శుభం ఎరుగని గ్రామీణులు తమ దినసరి లోకాభిరామాయణం సంగతి కూడా మరచి నోళ్ళు తెరుచుకొని అలా వింటూ ఉండిపొయ్యేవాళ్ళు.

వాస్కోడగామా హైందవ జీవితాన్ని ఎంత అపవిత్రం చేశాడో, డయోగ్ రోడ్రిగ్స్ ఎన్ని హిందూ దేవాలయాలను నేలమట్టం చేశాడో సోనూ దారుణ కథలుగా గాధలుగా వర్ణించి చెబుతూఉంటే గ్రామీణు లంతా నిట్టూర్చుతూ, అతని ఉపన్యాస ధోరణికి తల లూపుతూ విని, ఎవరి ఇండ్లకు వారు పొయ్యేటప్పుడు మాత్రం దారిలోనో లేక తమ ఇంటి పొరుగుననో ఉన్న క్రైస్తవ కుటుంబాలవారి ఇంటిముందర ఆగి, అలవాటు ప్రకారం కుశలప్రశ్నలు వేసి, వా రిచ్చిన బీడీలు కాలుస్తూ చివరికంటూకాల్చి వ్రేలుచురుక్కుమంటే గాని అక్కడినుంచి కదిలేవారు కారు.

ఇలా జరుగుతూ ఉండగా తన శ్రోతలకు తాను చెప్పే అంశాలపై నిజంగా భక్తిశ్రద్ధలున్నాయా లేవా అన్న సందేహం సోనూకు కలిగింది. ఇన్నాళ్ళూ తాను నోరు చించుకొని అంతగా వాగాడే ! అదంతా బూడిదలో పోసిన పన్నీరే అయిందా! 'మీ ప్రాచీన మతాన్ని సంరక్షించుకోండి!' అని తాను ఇచ్చిన పిలుపు నందుకొని ఫుల్‌గాం హిందువులు కదులుతారా లేదా ? ఏమైనా వారిని వెంటనే పరీక్షకు నిలబెట్టడం మంచిదనుకున్నాడు. ఒక సాయంకాలం తన కెదురుగా ఉన్న జనసమూహానికి నూకదంపుడుగా ఉపన్యాసం కొడుతూ వారంతా ఉదాసీనతను వీడి

క్రైస్తవులపై దండయాత్ర కుపక్రమించాలని ప్రబోధం చేశాడు.

సోనూ కథలూ గాథలూ చెబుతూఉంటే గోవుల వంటి గ్రామీణులకు అదొక విధంగా తోచింది. కాని ఇప్పుడు దండయాత్ర అనేసరికి తబ్బిబ్బు అయ్యారు. ఏమిటీ కొత్తమాట ? ఇదేదో గొడవే అనిపించింది వారికి. ఒక రిద్దరు తలలూపి చల్లగా జారుకున్నారు. తక్కినవారికి ఇదేదో పరిహాసం అనిపించింది. ఒకతను మాత్రం "అవునవును. ఇప్పటికైనా మనం సోనూ బాబు సలహా పాటించాలి . లేకపోతే హిందువులుగా పుట్టి ప్రయోజన మేమిటి ? కాని ఎటూగాని కాల మైందే. వచ్చేది వర్షాకాలం. అంతా పనిపాటలతో తీరిక లేకుండా ఉన్నారు. ఈ మూడు నెలలూ గడిచి వానల తగ్గాక దసరా శుభదినాన మనం పవిత్రోద్యమాన్ని ఆరంభించాలి" అన్నాడు చమత్కారంగా !

అంతట్లో ఒక ముసలాయన లేచి పెడసరంగా మాట్లాడడం మొదలుపెట్టాడు. గోవా క్రైస్తవులు హిందువులపై అత్యాచారాలు చేసిన దృష్టాంత మొక్కటీ తన జీవితంలో చూడలేదన్నాడు. బ్రిటిషిండియాలో హిందూ ముస్లిముల మధ్య జరిగినట్లుగా పోర్చుగీసిండియాలో హిందువులకూ క్రైస్తవులకూ మధ్య ఎప్పుడూ కొట్లాటలు జరగలే దన్నాడు. కనుక క్రైస్తవులైన ఇరుగు పొరుగులు తన పూర్వీకులతో ఎలా సఖ్యతతో వుంటూ వచ్చారో తానూ అలాగే ఉంటానని కుండలు బద్దలు కొట్టినట్లు చెప్పాడు. పైగా సోనూను అనుభవంలేని కుర్రాడనీ పుస్తకాలు అతిగా చదివి సరిగా జీర్ణించుకోలేకపోయిన పిల్లకాకి అనీ హేళన చేశాడు.

తనను ఇలా అవమానించడంతో సోనూ ఆగ్రహో దగ్రుడైనాడు. తనతో ముఖాముఖి వాదానికి రమ్మని ఆ ముసలతన్ని సవాలు చేశాడు. కాని ఆయన ఒప్పుకో లేదు. పైగా తాను సోనూను చిన్నపిల్లవా డప్పటినుంచి ఎరుగుదుననీ, ఉయ్యాలలో ఉన్నప్పటినుంచి అతన్ని ఎత్తుకు తిప్పాననీ, ఒకసారి అలా ఎత్తుకొని ఉండగా తన ధోవతి పాడుచేశాడనీ, తర్వాత పెరిగి పెద్దవా డవుతూ ఉండగా ఏవో కొంటెపనులు చేస్తే ఒకటి రెండు సార్లు చెవులు కూడా మెలిపెట్టాననీ అన్నాడు. అటువంటి పెద్దమనిషి ఈ పిల్లకాకితో వాదానికి దిగుతాడా ? గంభీరంగా ప్రక్కనే ఉన్న షాప్‌లో ఇంటికి వెళ్లాడు.

సోనూ పూర్తిగా భంగపడ్డాడు. అతను పెట్టు కొన్న గొంతెమ్మ కోర్కెలన్నీ పటాపంచలై పొయ్యాయి. ఇక గ్రామ పెద్దల ఎదుట అతని మాటలకు విలు వేమి ఉంటుంది ? హిందూమతాన్ని ఉద్ధరించబోయి ఈ పల్లెటూరి బైతులపై ఆశ పెట్టుకోవడం తనదే తప్పు అనుకున్నాడు. ఇవన్నీ ఎండిన మోడులు. వీటికి ఎంత నీరుపోసి ఏమి లాభం ? చిగిర్చుతాయా ? కొత్త మొలకలు పుట్టుకొస్తాయా ? ప్రయోజనంలేదు. వీళ్లకంటే చిన్న పిల్లలలో తన ఆదర్శ బీజాలను నాటడం ఎంతో మేలు. మొలకలైనా పుట్టుకొస్తాయి. పిల్లలతోటే రేపటి నాయకత్వాన్ని నిర్మించవచ్చు. రేపటి హిందూమత నాయకులను తయారు చేయ వచ్చు అనుకున్నాడు.

మరునాడే సోనూ తన నూత్న కార్యక్షేత్రం లోకి దిగాడు. వీధి అరుగులపై ప్రసంగాలు చేసి కాలహరణం చేయడం నిరర్థకం. కనుక ఇక ఆ చాయ లకే పోక వీధులలో, కొబ్బరి తోపులలో పొలాలలో తిరుగాడే పిల్లలను తన శిష్యులుగా చేసుకోవాలని ఉవ్విళ్లూరాడు. అతను అనుకున్నట్లుగానే పిల్లలు అతని సందేశాన్ని ఆలకించారు. ఉత్సాహం ఆవేశం చూపారు. తామూ అమరవీరుల మవుతామన్న ఆకాంక్ష వెలిబుచ్చారు. పైగా సోనూ వాక్చాతుర్యం వాళ్లపై బాగా పనిచేసింది. అతను చెప్పే కథలలో సత్యం ఉందో లేదో తెలియదుగాని వాటిలో ఆకర్షణ మాత్రం అత్యధికంగా ఉంది.

ఒక సాయంకాలం సోనూ తన చుట్టూ బాలల నందరినీ కూర్చోబెట్టుకున్నాడు. వారిలో ఇరుగు పొరుగువారి హిందూ బాలురితోపాటు భీసూ, వీసూ

కూడా ఉన్నారు. వాళ్లిద్దరూ సోనూకు వరసకు తమ్ముళ్లవుతారు. భీసూ ఎనిమిదేళ్ళ వాడు. పీసూ పదేళ్ళ వాడు. శివాజీ బాలుడుగా ఉన్నప్పుడు కసాయివాడైన ఒక మహమ్మదీయుని తల ఎలా నరికిందీ మంచి వర్ణనలతో సోనూ చెప్పుకుపోతున్నాడు. ఇంతలో పావ్‌లో మనుమడైన ఆంటోనియో పరుగెత్తుకుంటూ వచ్చి ఆ పిల్లలతో చేరాడు. ఎట్లా? వాడు క్రైస్తవబాలుడే! వాడి మెడలో బంగారపు గొలుసు ఉంది. ఆ గొలుసు నుంచి వ్రేలాడుతూ దంతంతో చేయబడ్డ శిలువ ఉంది. సన్నని దారంతో సీతాకోకచిలుకను కట్టి దానిని తన చేత బుచ్చుకొని ఏవో ముద్దు పలుకులు పలుకుతున్నాడు.

ఆంటోనియోను చూడగానే సోనూకు కోపమొచ్చింది. తన ఉపదేశ ప్రసంగాన్ని ఆపి ఆ పిల్లవాడి కేసి తీక్షణంగా చూచాడు. కాని వాడు లెక్కచెయ్యలేదు. వాడికి వూహ అంటూ వచ్చినప్పటినుంచీ సంతూషెనాయ్ గారి ఇంటి ఆవరణలో స్వేచ్ఛగా ఆడుకుంటున్నాడు. వద్దన్నవాళ్ళు ఇంతవరకూ లేరు. భీసూ, పీసూ అతని జతగాళ్లు. రోజూ వాళ్లతో ఆడుకోవడం అతనికి అలవాటు. అయితే ఒక్క నిబంధన మాత్రం ఉంది. వాళ్లను అంటుకొనేవాడు కాడు. అంటుకొంటే క్రైస్తవ స్పర్శతో వారి బట్టలు మైల పడతాయేమో! పాపం ఆంటోనియో ఈ నిబంధనను తు. చ. తప్పక పాటించేవాడు. ఒకవేళ ఆటల సందడిలో పడి అనుకోకుండా వాళ్లను తాను అంటుకోవడం జరిగితే వాళ్లు 'ఏమిటోయ్ అంటుకున్నావు' అని మళ్లీ ఆటలలో పడేవాళ్లు. అంతకుమించి ఎన్నడూ ఏమీ చేయలేదు.

ఈరోజు ఎప్పుడూ లేనంతమంది పిల్లలు సంతూ షెనాయ్‌గారి ఆవరణలో ఉండడం చూచి ఆంటోనియోకు మరీ ఉత్సాహం కలిగింది. వాళ్ళందరితో కలిసి ఆడుకుంటే ఎంత బాగు అనుకున్నాడు. వాళ్లందరి దృష్టిని తన చేతిలో దారంతో బంధింపబడి రెక్కలాడిస్తూ ఉన్న సీతాకోకచిలుక కేసి మళ్లించడానికై బ్యాండుమేళం వారిని అనుకరించేవాడి వలె రాగం తీస్తూ గంతులువేస్తూ రంయ్‌మని తిరుగుతూ అక్కడికి వచ్చాడు. కాని వాడి అమాయకపు ఆనందం సోనూ హృదయాన్ని కదిలించలేకపోయింది.

సోనూ మండిపడుతూ "చూచారా, ఈ శిఖనష్టుల (తలపై పిలకలు లేనివారు!) పెంపకం ఇలా ఉంటుంది! చూడండి, వీడు ఆ నోరులేని ప్రాణిని ఎలా హింసిస్తున్నాడో! వీడు పెరిగి పెద వాడైతే గోవులను వధించే కసాయి వాడవుతాడు. ఈ క్రైస్తవ తుంటరి పిల్లకాయలకు మన హిందువుల ఇండ్లలో ఆడుకొనే స్వాతంత్ర్య మేమిటి? వీళ్లను ఈ దరిదాపులకే రానివ్వకూడదు. వీణ్ణి ఇక్కడినుంచి తరిమేయండి" అని పొలికేక పెట్టాడు.

ఆ సీతాకోకచిలుక అందరిదీ అని చెప్పి దాన్ని చేజిక్కించుకుందామని భీసూ, పీసూ చూసున్నారు. ఆంటోనియోతోపాటు వాళ్లూ సరదాగా రోజూ సీతాకోక చిలుకలను పట్టుకొనే ప్రయత్నం చేసేవాళ్లు. దొరికితే పట్టుకొని రోజంతా దానితో ఆడుకొనేవాళ్లు. కాని సోనూ మాటలు విన్న తర్వాత వాళ్లకు కొత్త బుద్ధిపుట్టుకొచ్చింది. వారి హిందూ రక్తం వేడెక్కి కుతకుత లాడింది. ఆంటోనియోతో అంతకుముందు వారికున్న స్నేహం ద్వేషంగా మారినట్లున్నది. అతన్ని తాకకుండా జాగ్రత్తపడుతూ అతనిపైకి లంఘించారు. మొదట ఇదంతా తమాషాలే అనుకున్నాడు ఆంటోనియో. కాని తన్ను వేధిస్తూ వెక్కిరిస్తూ వాళు తన చుట్టూ గెంతడము ఎగరడం చూచి ఇందులో ఏదో ఉందనుకున్నాడు. తాను ఆశించనట్టి ఈ ప్రవర్తనకు విస్తుపోయాడు. వాళ్లను తప్పించుకు పారిపోదామని ప్రయత్నించబోయి భీసూను తాకాడు. ఇది అతను అనుకోకుండా జరిగిన పొరపాటు. ఎంత ఘోరమైన పాపం! క్రైస్తవుడు అంటుకోవడమంటే మైలపడడమన్నమాట. "ఆంటోనియో భీసూను అంటుకున్నాడు. ఆంటోనియో భీసూను అంటుకున్నాడు." అంటూ పిల్లలంతా కేకలు పెట్టారు.

సోనూ పట్టరాని కోపంతో "ఇవ్వాళ అంటు కున్నాడు. రేపు పంది మాంసం తెచ్చి మీ నోళ్లలో కుక్కుతాడు!" అన్నాడు.

సోనూ మాట వెంటనే పనిచేసింది. భీసూ ఆంటోనియో పైకి పోయి వాణ్ణి చెంపమీద కొట్టాడు. తక్కిన పిల్లలంతా కొబ్బరిచిప్పలు, కర్ర పుల్లలు, రాళ్లు ఏది చేతికి దొరికితే దాన్ని ఆంటోనియో పైకి విసిరారు. ఎదురు దెబ్బ తీయడం వాడికి చేతకాలేదు. అంతమంది ఉంటే ఎలా! ఏడుస్తూ, బొబ్బలు పెడుతూ తన ప్రత్యర్థులందరినీ తిడుతూ ఇంటిదారి పట్టాడు. భీసూ వాడి వెంట పడ్డాడు. ఆంటోనియోకు వాళ్ల ఇంటికి చేరుకున్నా నన్న ధైర్యం కలుగగానే చేతి కందిన ఎముక ముక్కను పుచ్చుకొని బలంగా భీసూ పైకి విసిరాడు. కాని అది గురితప్పి దగ్గరి బావిలో పోయి పడింది.

ఆ ఎముక భీసూకు తగిలినా అంత ప్రమాద కరంగా పరిణమించేదికాదు. వాడిని స్నానం చేయించి అంటు పోయిందని చెప్పి ఇంటోకి తీసుకెళేవారు. ఆ గొడవ అంతటితో సమసిపోయేది. కాని బావిలో ఎముక పడిందంటే ఎంత ఘోరం! అంతకన్నా అశుచి మరొకటుందా! ఆ బావి సంతూషెనాయ్ ఇంటివెనక దొడ్డికీ, పావ్‌లో ఇంటిముందరి అవరణకూ మధ్య ఉంది. ఆ రెండు కుటుంబాలవాళ్ళూ ఆ బావినీరు వాడుకొనేవారు. మరి ఇపుడు ఆ నీరు హిందువులకు పనికిరాదు. అపవిత్రమై పోయిన నీరది!

సోనూ బిగ్గరగా "వీళ్లెప్పుడూ ఇంతే. మీరు హిందువులు పిరికివాళ్లు. ఈ క్రైస్తవులు మీ బావులలో ఎముకలు, రొట్టెముక్కలు పారేస్తూ వాటి నీటిని అపవిత్రం చేస్తూ వచ్చారు. మీరిక ఇలాగే విధి అనుకొని నోరు మూసుకొని పడిఉంటారా?" అని అడిగాడు.

ఈ వత్తుళ్లకు భీసూ వీసూ చలించి "ఎప్పటికీ పడిఉండము. ఆంటోనియోను శిక్షించకుండా వదలి పెట్టము. వాడు ఇంట్లోనుంచి ఇలా కొబ్బరితోట లోకి వస్తే అప్పుడు చెబుతాం వాడి పని. వాడి వొళ్ళు హూనం చేస్తాము." అన్నారు ఏక కంఠంతో.

సోనూ ఉగ్రుడై "అంతేనా? అది చాలదు. ఎముకను తీసినా మూడు రోజులవరకూ బావి నీళ్లు ముట్టుకోవడానికి వీలులేదు. పైగా ఇది వేసవికాలము. దగ్గరిలో ఉన్న బావులు ఎండిపోయి ఉంటాయి. 'దూరపు బావులనుంచి నీరు తెచ్చుకోవా లంటే చచ్చేది మనం. పావ్‌లో కుటుంబానికి ఇది మంచి అవకాశం. మామూలుగా వాడుకొనే నీటికంటె ఇప్పుడు ఎక్కువ నీటిని వాళ్లు వాడుకోవచ్చు. అంతేగాక ఈ ఉపాయాన్ని ఈ స్వార్థపరులైన క్రైస్త వులు ఒక ఆయుధంగా పెట్టుకొని తడవ కొక ఎముకముక్క బావిలో పడేసి హిందువులు దాని నీటిని వాడుకోకుండా చేస్తారు. ఇలా ఎన్నటికీ జరగనివ్వకూడదు. వీళ్లకు తగిన శాస్తి చెయ్యాలి. నాకొక మంచి ఆలోచన తట్టుతూఉంది. దీన్ని మీరు ఆచరణలో పెట్టారంటే పావ్‌లో కుటుంబానికి గంటలో చక్కగా బుద్ధి చెప్పవచ్చు" అన్నాడు.

సోనూ సూచించిన పద్ధతి పిల్లకాయలకు సరి కొత్తదిగా ఆకరవంతంగా తోచింది. వెంటనే ఆ పటాలమంతా వెనుక పెరడులో ఉన్న ఆవుల కొట్టానికి వెళ్లారు. అక్కడ దొరికినంత పేడను బుట్టల కెత్తుకొని సరాసరి బావి దగ్గరికెళ్ళి అందులో వేశారు. బావి నీరు శుభ్రపడాలంటే సోనూ సూచించిన సంస్కార పద్ధతి అది. అంతే అలా చేయడంవల పొరుగున ఉన్న క్రైస్తవులకు ఆ బావినీరు కొన్ని రోజుల వరకు ఉపయోగపడ కుండా పోతుంది కదా అంటే అది సోనూ వికృతాప హాస్యములో ఒక భాగమే తప్ప మరొకటి కాదు.

ఈ పిల్లలు చేసిందంతా ఆంటోనియో కిటికీలో నుంచి చాటుగా చూచాడు.

పూర్వం ఆంటోనియోకూ భీసూకూ అప్పు డప్పుడు ఏవో కీచులాటలు జరగకపోలేదు. కాని

పోట్లాడుకున్న ఆ కాసేపు తర్వాత వెంటనే ఆ సంగతి మరచిపోయేవాళ్లు. ఇప్పుడు భీసూ తన చెంపమీద దెబ్బ కొట్టడాన్ని కూడా ఆంటోనియో మరచి పొయ్యేవాడే. కాని తా నెంతో కష్టపడి పట్టుకున్న సీతాకోకచిలుక కాస్తా తనకూ వాళ్లకూ జరిగిన కొట్లాటలో తుర్రుమని ఎగిరిపోయింది. అది మళ్ళీ దొరకదు. అందుచేత ఆంటోనియో సమాధాన పడ లేక పొయ్యాడు. ఇంటో కి వెళ్లి జరిగిందంతా పెద్దవాళ్లకు చెప్పాడు.

ఆడవాళ కు కోపం వచ్చింది. పావ్‌లో ఇంటికి రాగానే సంగతి అంతా ఆయనకు చెప్పాలను కున్నారు. చెప్పితే సంతూషెనాయ్ ఆ తుంటరి పిల్లలను తప్పక శిక్షించేట్టు చేస్తాడని వారి నమ్మకం.

హిందువులకు ఆవుపేడ పవిత్రమైన వస్తువు. శుచికీ శుభ్రతకూ దాన్ని వాడతారు. కాని అవుపేడను ఇలా బావిలో పడవేసి త్రాగే నీళ్లను పాడుచేయడమనేది కక్షకొద్దీ, ద్వేషంకొద్దీ చేసిన పని. కాబట్టే పావ్‌లో కుటుంబంలోని ఆడవాళ్లకు అంత ఆగ్రహం కలిగింది.

ఆడవాళ్లు ఆశించినదానితో అక్కడికి ఆ వ్యవహారం ముగిసిఉండేది. ఇరుగు పొరుగు తాత లిద్దరూ భీసూ వీసూలకూ, ఆంటోనియోకూ లెంపలు వాయించడంతో ఫుల్‌గాం గ్రామంలో సోనూ రెచ్చ గొట్టిన మత యుద్ధం సమాప్తమై శాంతి నెల కొనేది. కాని పరిస్థితులు మరొకవిధంగా పరిణ మించాయి.

ఆడవాళ్లు అంత సులువుగా ఆ వ్యవహా రాన్ని ముగింపజేయ దలచడం ఆంటోనియోకు నచ్చ లేదు. వెంటనే వెళ్ళి తండ్రి కేటానోకు జరిగిందంతా చెప్పాడు.

కేటానోకు అది కునుకు సమయం. ఆయన 'కునుకు' అంటే ఏమిటో ఫుల్‌గాంలో అందరికీ తెలుసు. కనుక ఆవేళప్పుడు ఎవరూ అతనితో పని ఉన్నప్పటికీ వెళ్లేవారు కారు. ఆయనకు నలభై ఏళ్లుంటాయి. మనిషి స్వభావం మంచిదే. సౌమ్యుడు గానే ఉంటాడు. కాని మధ్యాహ్నం దాటిందంటే ఎలుగుగొడ్డులా చిరచిరలాడుతూ ముంగోపంతో కన్పి స్తాడు. కొన్నేండ్లుగా అతను అపరాహ్ణవేళ జీడి పప్పుతో కాచిన సారా త్రాగి వెంటనే కొంతసేపు కునుకు తీయడం అలవాటుగా పెట్టుకున్నాడు. అందువల్ల మరీ అర్భకమైన తన వళ్లు ఒక మాదిరిగానైనా బాగుంటుందని అతని విశ్వాసం. అందుచేత ఆ 'కునుకు' ను ఎవరైనా చెడగొట్టి నప్పుడు అల్ప విషయాలైనా అతన్ని ఆగ్రహో దగ్రుణ్ణి చేసేవి. ఆంటోనియో తన గోడు చెప్పు కోవడానికై తండ్రి దగ్గరికి వెళ్లగానే సరిగ్గా అదే జరిగింది. పిల్లవాడి చెంపపై భీసూ బలంగా కొట్టగా పొంగిన గుర్తు తండ్రికి కన్పించింది. కేటానో ఆగ్రహానికి అంతులేకపోయింది.

సోనూ ఉపకారబుద్ధితో పూశో చేస్తూవున్న ప్రసంగాలను గూర్చి కేటానో ఇదివరకే విని ఉన్నాడు. కాబట్టి ఈ గొడవకు మూల కారకుడు సోనూయేనని వెంటనే వూహించాడు. సారాత్రాగి ఉండడంవల్ల కేటానో ముఖం అసలే ఎర్రబారి ఉంది. ఈకోపంతో రక్తవర్ణానికి మారింది. కళ్లు జ్యోతులకు మల్లే ఉబ్బాయి. తక్షణమే పక్కమీదినుంచి లేచి సంతూషెనాయ్ ఇంటికేసి పళ్లు పటపట కొరుకుతూ దూసుకు వెళ్లాడు. వెడుతూ "ఆ వసపిట్ట వెధవాయ దీని కంతటికీ కారకుడు. వాడికి బుద్ధి చెపుతా" అంటూ కేక పెట్టాడు.

దారిలో జామచెట్టు కొమ్మను విరిచి చేత పుచ్చుకొని సంతూషెనాయ్‌గారి ఆవరణంలోకి వెళ్లి "ఒరే దుష్టా, ఒరే కుంకా, ఏమిటెరా ఈ నీ గడబిడ అంతా. నీ తిత్తి వలుస్తా ఇటురా. బావిలో పేడ వేయిస్తావురా !" అని సవాలు చేశాడు.

సోనూ తానక్కడికి గొప్పవాడైనట్లూ ఎదుటి మనిషి తనకంటె తక్కువవాడైనట్లూ "ఏమయ్యోయ్,

పొరుగబ్బీ, నీ కొడుకు మొదట ఈ బావిలో ఎముక పడేసి దీని నీటిని అపవిత్రం చేశాడు. దేనినైనా శుద్ధి చేయడానికి మాత్రమే మేము హిందువులం. పేడ వాడుతావు. మా మతం అలా చెబుతున్నది. కనుక ఈ పిల్లలకు నేను చెప్పిన సలహా ఎటువంటిదో బాగా ఆలోచించి మాట్లాడు'' అన్నాడు.

కేటానోను తికమక పెడదామన్న ఉద్దేశంతో సోనూ అలా అనివుంటే అతను ఆశాభంగం చెందా డనే చెప్పాలి. కేటానో త్రాగివున్న కోపంలో ''వెధ వాయా, నేనేం క్షురకుంకనా, నీ దగ్గిర పాఠాలు నేర్చుకోవడానికి. నువ్వు హిందూ మాతాధిపతివేం బావులు శుద్ధి చేసుకోమని చెప్పడానికి. ఈ కల్ల బొల్లి కబుర్లు చెప్పి నన్ను మభ్యపెడదా మను కుంటున్నావా గాడిదా'' అని కసిరాడు.

సోనూ వినయంతో ''మీ పాదిరీలు ప్రార్థన చేసి ద్రాక్షసారాయిని రక్తంగా మారుస్తామని అంటే మీరు నమ్ముతారు. కాని మా మత విశ్వా సాలను హేళన చేస్తారు. అయినా ఇప్పుడు మీరు మంచి స్థితిలో లేరు. దయచేసి నన్ను ఇంటికి వెళ్లనివ్వండి. మీరు శాంతచిత్తులైన తర్వాత వచ్చి మా మతం సంగతి వివరంగా చెబుతాను. ఇక వెళ్లండి'' అన్నాడు.

ఈ మాటలకు తన ప్రత్యర్థి చిత్తు అయి పోతాడనుకున్నాడు సోనూ. అతను మాట ముగిం చాడో లేదో కేటానో చేతిలో ఉన్న కర్ర దెబ్బ అతని వీపుపై బలంగా పడింది. సోనూ పెడ బొబ్బలు పెట్టాడు. ప్రయోజనం లేకపోయింది. తన కోపం తగ్గేదాకా కేటానో అతన్ని బాది వది లాడు. ఈవిధంగా ఆ గ్రామంలో తగాదా ఆరంభ మైంది.

ఉభయపక్షాలవారు కాస్త శాంతంగా ఆలో చించిఉంటే ఈ ఛిద్రం అంతటితో సమసిపోయేది. కాని మనస్సులను ఆగ్రహం మెలిబెట్టినప్పుడు హేతు బద్ధంగా ఆలోచించడానికి అవకాశ ముండదు. అసలు మూలకారణ మేమిటి ? దానిపై జరిగిం దేమిటి ? అన్న ప్రశ్నలే కలుగవు. ఒకవేళ ఒకరు చెప్పినా వినే స్థితిలో ఉండరు. సంతూషెనాయ్, పావ్‌లోల విషయంలో సరిగ్గా ఇదే జరిగింది.

సంతూషెనాయ్ ఇంటి గడపలో కాలు పెట్టాడో లేదో జరిగిన దౌర్జన్యం అతని చెవిని పడింది. త్రాగి మత్తులో ఉన్న కేటానో సోనూను చావ బాదాడుట. కాస్త అయితే ప్రాణం పోయేదే అని తెలిసింది. కారణంలేకుండా కొట్టాడట. పెద్దమనిషి సంతూకు చిత్తక్షోభ కలిగింది.

''నా మనమడు, అంత చురుకైనవాడు, తెలివి కలవాడు ఎంతో కాలం తర్వాత నన్ను సంతోష పెట్టడానికి వచ్చాడు. వాణ్ణి నా పొరుగువాళ్లు ఇలాగా మర్యాద చేసేది ! నాలుగు తరాల నుంచి మా రెండు కుటుంబాలు ఎంతో స్నేహంగా అన్యోన్యంగా ఉంటూ వచ్చాయే! ఆ ముసలాడు పావ్‌లో ప్రాణం కాస్తా పోతే వాడి కొడుకు త్రాగుబోతు అప్పుడు ఏమైనా చేస్తాడు. ఇవాళ జరిగిందాన్నిబట్టి అయినా ఇక ఈ స్నేహ సంబంధాలు తెంచుకొని ముందు ముందు ఈ తగాదాలు రాకుండా చూచుకోవాలి'' అనుకున్నాడు సంతూ.

ఇక్కడ ఇలాఉంటే పక్క ఇంట్లో పరిస్థితి ఇందుకు దీటుగానే ఉంది. పావ్‌లో ఇంటికి వచ్చాడో లేదో జరిగిన దారుణం విని ఉడికిపొయ్యాడు. సంతూ మనమడు సోనూ హిందూ బాలురను రెచ్చగొట్టి ఆంటోనియోను కొట్టించాడట. బావిలో పేడ వేసి త్రాగే నీళ్లు చెడగొట్టారట. కేటానోను తిట్టా రట. పవిత్ర గ్రంథమైన బైబిలును దూషించారట.

ఈ కథంతా విన్న పావ్‌లో సంజాయిషీ అడగ డానికై చకచకా సంతూషెనాయ్ ఇంటికేసి నడి చాడు. ఇద్దరూ ఆగ్రహావేశులై ఉండడంచేత ఒకరు చెప్పేది ఒకరు సావధానంగా వినే అవకాశం లేక

పోయింది. మాటకు మాట పెరిగాయి. ఒక అపోహ మరొక అపోహకు దారితీసింది. ఒకరిపట్ల ఒకరు మర్యాద చూపుకోవడం పోయి తెగబడి ఒకరిపై ఒకరు నిందారోపణలు చేసుకున్నారు. 'ఇక నీ ఇంటి గడప తొక్కను' అని శపథంచేస్తూ పావ్‌లో వెళ్లిపోయాడు. పిల్లవాళ్ల గిల్లికజ్జాలు ఆ రెండు కుటుంబాల మధ్య తగాదా రేపి మత కలహానికి బీజారోపణ చేశాయి.

ఈ రెండు కుటుంబాలవాళ్లు కొన్ని తరాల నుంచి ఎంత స్నేహంగా ఉన్నారు! పావ్‌లోకు వ్యవసాయంలో చిక్కులొచ్చినా, కుటుంబ విషయాలలో సలహా అవసరమైనా సంతూషెనాయ్ దగ్గరికి వచ్చేవాడు. సంతూషెనాయ్ సొంత పనిపై ప్రభుత్వ కచేరీలకు, కోర్టులకు పోవలసివస్తే పావ్‌లో సహాయం కోరేవాడు. ఇంటినీ, కుటుంబాన్నీ వదిలి వ్యవహార నిమిత్తం పొరుగూరిలో మకాం అంటే ఎవరికైనా ఆందోళనగానే ఉంటుంది. కాని పావ్‌లో, సంతూషెనాయ్‌లకు ఆ బెడద లేదు. ఒకరు పొరుగూరికి పోవలసివస్తే మరొకరిని కేకేసి "మా యింటినీ పిల్లల్నీ కనిపెట్టి ఉండు" అని చెప్పి నిశ్చింతగా వెళిపోయేవారు. సంతూ షెనాయ్ ఇంటి ఆడంగులు నిత్యం పావ్‌లో ఇంటి ఆడవాళ్లతో కూర్చొని కుట్టుపని, అలికపని చేసుకునేవారు. పూలదండలు కట్టించుకొని తలల్లో పెట్టుకొనేవారు. పావ్‌లో ఇంటి స్త్రీలు ఊరగాయ పచ్చళ్ళకూ, అప్పడాలకూ, మురబ్బాలకూ సంతూషెనాయ్ ఇంటికి వెళ్లేవారు. పిల్లలెవరికైనా సుస్తీ చేస్తే అక్కడినుంచి చిట్కా మందులు తెచ్చుకొని వాడేవారు. వారానికి ఒకటి రెండు మార్లు పావ్‌లో ఇంటి తోట నుంచి చంపక, వకుళ, మలె పుష్పాలు, సీతాఫలాలు, బొప్పాయిపండు, జామపండు, బుట్టలతో సంతూషెనాయ్ ఇంటికి వొచ్చేవి. సంతూ షెనాయ్‌గారింటో పండుగ పబ్బాలు శుభకార్యాలు జరిగాయంటే ఆడంగులు తాము చేసిన పదార్థాలను, వండిన వంటకాలను పెద్ద పెద్ద పళ్లాలతో పావ్‌లో యింటికి పంపేవారు.

ఈ రెండు కుటుంబాల పిల్లలు ఒకకుటుంబపు పిల్లలుగా ఆడుకొనేవాళ్లు. ఒకరిని విడిచి ఒకరు ఉండరు. భీసూ, వీసూ, ఆంటోనియోలు పొలాలలో, బయళ్లలో తిరుగుతూ పిట్టల గూళ్లను వెదుకుతూ, గాలిపటాలు ఎగురవేస్తూ జీడిపప్పు బేరీపండు తింటూ గడిపేవారు. మరి యిప్పుడు అదంతా మారిపోయింది. సంబంధాలు తెగతెంపులయ్యాయి. ఎప్పుడైనా ఈ రెండు కుటుంబాల పిల్లలు ఒకరి కంట ఒకరు పడడం జరిగితే ఒకరి నొకరు వెక్కిరించుకొనేవాళ్లు. మాటలనుకొనేవాళ్లు. గణపతి ఉత్సవం వచ్చింది. కాని పావ్‌లో ఇంటినుంచి మామూలు వాడుకగా వచ్చే పూలు సంతూషెనాయ్ ఇంటికి రాలేదు. పావ్‌లో కుటుంబం వారు సేంట్‌సెబాస్టియన్ విందు జరుపుకున్న నాడు సంతూషెనాయ్ తాను ఆచారంగా కానుకగా పంపే మైనపు వత్తులను పంపలేదు. అంటే ఈ పర్యాయం సంతూ పంపే మైనపువత్తులను సేంట్ విగ్రహంముందు వెలిగించకుండానే పావ్‌లో ఇంట్లో ఆ శుభకార్యం జరిగిపోయిందన్న మాట.

ఒకప్పుడు సకృత్తుగా లేదా అసలు జరగనే జరగనట్టి విషయాలు ఇప్పుడు దాదాపు రోజూ జరగడం మొదలైంది. పావ్‌లో ఇంటి పందులు, కోళ్ళు పూర్వం ఆ యింటి ఆవరణం దాటి వొచ్చేవి కావు. కాని యిప్పుడు పొరుగున ఉన్న హిందూ కుటుంబపు ఆవరణంలోకి రోజూ ప్రవేశించి నీళ్ళ కుండలను అపవిత్రంచేసి, బైట ఎండవేసిన గుడ్డలను తొక్కి పాడుచేసేవి.

దీనికి ప్రతీకారం అన్నట్లుగా సంతూషెనాయ్ గారి ఆవులు పావ్‌లో తోటపై పడి అరటి చెట్లనూ పూలమొక్కలనూ ధ్వంసంచేయ నారంభించాయి. సంతూషెనాయ్ కుటుంబంవారు

భోజనం చేసిన అరిటాకులు విస్తర్లు ఇప్పుడు ఇతర చెత్తతో కలిపి పావ్‌లో కాంపౌండు దగ్గరే పెద్ద దిబ్బగా పడి పోతున్నాయి. పావ్‌లో ఇంటి నుంచి కోళ్లు కొక్కిరాయుల అవశేషాలు, ఎముకలు, గ్రుడ్ల పైడిప్పలు సంతూషెనాయ్‌గారి వసారా ముందు పడుతూ ఉన్నాయి.

రెండు కుటుంబాల మధ్య దినదినము పెరుగుతూఉన్న ఈవైరాన్నీ, కలహాన్నీ ఫుల్‌గాం గ్రామ మంతా దిగ్భ్రాంతిజెంది చూస్తూఉంది. సహృదయు లైన కొందరు పెద్దలు శోచనీయమైన ఈ కల హాన్ని ఇంతటితో సమాప్తం చేయాలని ప్రయ త్నించారు. కాని ప్రయోజనం లేకపోయింది. పరస్పర అనుమానాలు, ద్వేషం అడ్డు వొచ్చాయి. తగాదా లోని కొత్తదనం పొయ్యేసరికి పూర్వం ఆ రెండు కుటుంబాల మధ్య ఉండే అన్యోన్యంలాగే ఇప్పుడు బద్ధవైరం ఏర్పడిందిలే అని అంతా సరిపెట్టు కున్నారు. చిలికి చిలికి గాలివాన అయిందన్నటు పరి స్థితి విషమించింది. సంతూషెనాయ్‌పై పావ్‌లో కోర్టులో కేసు వేశాడు. ఫుల్‌గాం హిందువులలో సంతూషెనాయ్ ప్రముఖుడు. క్రైస్తవులలో పావ్‌లో ముఖ్యుడు. కనుక ఆయా మతాలవారు చాలామంది తమ తమ నాయకులను బలపరిచారు. ఈవిధంగా రెండు మత పక్షాలు ఎదురు బొదురుగా నిల్చొని యుద్ధానికి సన్నద్ధమయ్యాయి.

ఈ విషాదకర సంఘటనలను చూచి తనివి దీర ఆనందించిన వ్యక్తి సోనూ! 'గోవాకు పూనా' అన బడే తన స్వగ్రామానికి తిరిగి వచ్చిన తర్వాత సోనూ తాను పెట్టిన యీ చిచ్చు వ్యాప్తిచెందడం దూరంనుంచే గమనిస్తూ వచ్చాడు. గోవాకు చెందిన ఒకానొక వారపత్రికలో "పరశురాముని భూమిలో హైందవ జాగృతి" అనే శీర్షికతో వరుసగా వ్యాసాలు వ్రాసి ప్రకటిస్తూ ఫుల్‌గాం గ్రామంలో వీర హైందవము సాగిస్తూఉన్న మహోజ్జ్వల సమ రాన్ని భారతదేశానికి చాటుతున్నాడు.

ఆ సంవత్సరం గోవాలో వరదలు వచ్చాయి. ఆ వరదలను గూర్చి ఈనాటికీ గోవా ప్రజలు చెప్పుకుంటూ ఉంటారు. గోవాలో వరదలు కొత్త వేమీ కావు. కాని ఆ సంవత్సరం వచ్చిన వరదలు భయంకరమైనవి. గోవా అంతటా వాటిని గూర్చి చెప్పుకోవటమే. వరిచేలు, తోటలు, కొబ్బరితోపులు నాశనమయ్యాయి. ఆ జల ప్రళయంలో ఇళ్లన్నీ నేల మట్టమైపోయాయి. పశువులు నీటబడి కొట్టుకు పొయ్యాయి. జననష్టం కూడా బాగా కలిగింది.

ఇది చాలా దారుణమైన విపర్యయమే అయినా దాన్ని దైవ ప్రసాదితమని ఫుల్‌గాం ప్రజలు అభి వర్ణిస్తారు! జరిగిన నష్టాన్ని, అంగీకరిస్తారు. కాని అదీ ఒకందుకు మంచికే వచ్చిందిలే అంటారు. దైవాను గ్రహమన్నట్టుగా మాట్లాడతారు. తక్కిన గ్రామాలకు కలిగిన నష్టమే ఫుల్‌గాంకు కూడా కలిగింది. ప్రజలు ఎన్నో అవస్థల పాలయ్యారు.కాని ఫుల్‌గాం వాసులను శాశ్వతంగా ముంచివేయగల మరొక ఉప్పెన తప్పిపోయి నందుకు మాత్రం ప్రజలు హర్షించారు. వచ్చిన వరదతో గ్రామ కల్మషమంతా కొట్టుకుపోయి పరి శుభ్ర వాతావరణం నెలకొన్నది.

ఫుల్‌గాం వంటి నదీ తీర గ్రామాలలో వర్షాకాలంలో పెద వానలు కురిసి చాలా ప్రదేశాలు జల మయం కావడం అసాధారణ విషయమేమీకాదు. ఆ సంవత్సరం కూడా అంతేలే అనుకున్నారు. తొలకరి రావడంతోటే అయిదురోజులు రేయింబవళూ కుండ పోతగా వర్షం కురిసింది. అయినా మామూలేగదా అనుకొని సరిపెట్టుకొన్నారు. కాని ఆరవరోజు రాత్రి కల్లా తాము వరదల పాలయినట్లు గ్రహించి జనం భయ కంపితులయ్యారు.

త్వరగా భోజనాలు ముగించుకొని పడుకున్న వారు అర్ధరాత్రి గ్రామంమీదికి వచ్చిపడుతూవున్న వరద చప్పుడుకు మేల్కొన్నారు. చెట్లు కూలిపడి పోతున్నాయి. ఇళ్లు నేలమట్టమవుతున్నాయి. పశుపక్ష్యాదులు గగ్గోలెత్తాయి. జనం అటూ, ఇటూ పరుగుదీశారు. విలువైన వస్తువులను

దక్కించుకోవడానికి కొందరు ప్రాణాలను సైతం లెక్క చేయడంలేదు. ప్రాణాలమీదికి వచ్చినవారు దగ్గర వున్న చెట్లు ఎక్కడమో లేక ఈది వరదకు గురికాని ఇండ్లపైకి చేరుకోవడమో చేస్తున్నారు.

ఆ కాళరాత్రి ముగిసింది. సూర్యోదయమైంది. ఎటు చూచినా సర్వ నాశనమే. చుట్టూ సముద్రం వలె కన్పిస్తూవున్న ఆ భీకరమైన వరదనీటిలో మెరకమీదవున్న రెండు ఇండ్లుమాత్రం నిలిచి ఉన్నాయి. ఒకటి పావ్‌లోది. రెండవది సంతూషెనాయ్ గారిది.

అంతకు నలభై యేళ్లక్రితం ఇలాంటి వరద దెబ్బ వచ్చినప్పుడు కూడా ఈ రెండు ఇళ్లే చెక్కు చెదరకుండా ఉన్నాయట. ఈ పర్యాయం కూడా అలాగే సురక్షితంగా ఉంటాయన్న నమ్మకంతో ఆ ఇద్దరు పెద్దలూ ఉన్నారు. కాని వారి నమ్మకం పటాపంచ లైంది. ఇప్పటి ప్రళయంముందు వెనుకటి వరదలు ఏపాటి? క్రింది గదులలోకి నీరు చొరబడటంతో పైన మిద్దెమీదికివెళ్లి తలదాచుకున్నారు. పావ్‌లో తమ ఇంటి పెరడు కేసి చూచాడు. పల్లంలో కట్టిన వంట యిల్లు నేలమట్టం కావడం చూచి దిగ్భ్రాంతిజెందాడు. అందులో నిలవ చేసుకున్న ఆహార పదార్థాలన్నీ నీటిపాలయ్యాయి. ఒకటి రెండు రోజులో వరద నీరు తీయకపోతే, అతనూ, అతని కుటుంబమూ ఆకలికి అలమటించవలసిందే! చేసేదేమీలేక పావ్‌లో దైవాన్ని ప్రార్థించాడు.

వరదనీరు ఒక్కొక్క అడుగు పెరుగుతూ పోయినకొద్దీ ఈ రెండు కటుంబాలవారి భయాందోళ నలు కూడా హెచ్చుతూ పొయ్యాయి. సంతూ షెనాయ్ మహామృత్యుంజయుడికి మొక్కుకున్నాడు. పావ్‌లో సేంట్ ఫ్రాన్సిస్ క్జేవియర్‌కు ప్రార్థనోత్సవం జరుపుతానని బాస చేశాడు.

కొన్ని గంటల తర్వాత నీరు పెరగడం నిలిచి పోయింది. కాని వరదతీసే సూచన లేమీ కనపడలేదు. ఇందుకు సంతూషెనాయ్ కుటుంబంవారు గాభరా పడలేదు. వారి యింటిలో ఆహారధాన్యాలు సరిపోను ఉన్నాయి. కాని పావ్‌లో కుటుంబం వారు ఆకలితో అలమటించవలసిన దురవస్థను తలచుకొని గజ గజ వణికిపోతున్నారు.

పావ్‌లో భయ విహ్వలుడై వరద నీటికేసి చూచాడు.అన్నమో అన్నమోఅంటూమనుషులు పెడుతూ వున్న కేకలు అతని చెవినిపడ్డాయి. గ్రామంవారినుంచి సహాయం పొందడం అసాధ్యం. మధ్యన మహాతటాకం వలె వుంది వరద. నది మలుపు తిరిగినచోట పెద్ద సుడి గుండంవుంది. మామూలు రోజుల్లోనే ఆ సుడిగుండం మృత్యునిలయమని పేరుపొందింది! గ్రామస్థులు దానికి యేటా కోడిని బలి యిచ్చి శాంతిచేసేవారు. మన స్సులో ఎంత ప్రేమవున్నా, కావలసినంత డబ్బు ఇస్తా మన్నా, ఎంతటి నిర్భయులైనా ఇప్పుడు వరదనీటిని దాటి పోవడానికి సాహసించరు. అటువంటప్పుడు సంతూషెనాయ్‌గారి సహాయాన్ని అర్థించడంకంటె గత్యంతర మేమిటి? కాని శత్రువును దేహీ అని అర్థించడమా? సంతూషెనాయ్ జరిగింది మరిచిపోయి సహాయం చేస్తాడా? వారం క్రితమేకదా కోర్టులో వ్యాజ్యం పైస్థాయికి చేరుకున్నది. తీర్పుకు ఒక తేదీ కూడా నిర్ణయించారే!

రోజు గడిచింది. మరుసటిరోజు కూడా జడివాన కురిసింది. వరద నీటిమట్టం మరింత పెరి గింది.

రెండు రోజులు పస్తులుండవలసివచ్చేసరికి పెద్దవాళ్లకే కళ్లు లోతుకుపీక్కుపోయాయి. ఇక ఆంటోనియో, తక్కిన పిల్లలు సంగతి చెప్పనక్కర లేదు. వాళ్లనుచూస్తే ఎవరికైనా జాలి వేస్తుంది. అన్నం కావాలని అరుస్తున్నారు. కాని పెద్దవాళ్లు ఏమీ చేయలేని నిస్సహాయ స్థితిలో ఉన్నారన్న సంగతి వాళ్లకు తెలియదు. వాళ్ల ఏడ్పులు సంతూషెనాయ్‌గారి ఇంట్లోకికూడా వినపడుతున్నాయి.

రెండవరోజు కూడా గడిచింది. సహాయం అందే సూచనలులేవు. పావ్‌లో ఇంట్లో పెద్దవాళ్లు తమ ఆకలి సంగతి మరచి, పిలలు ఆకలికి

ఏడ్వడమూ పస్తులతో తోటకూరకాడలవలే వడలిపోవడమూ చూచి బెంబేలెత్తిపోతున్నారు.

కేటానోతల్లి కిటికీవద్ద కూర్చొని బయటికి శూన్య దృక్కులతో చూస్తూవుంది. ఎక్కడైనా కొంచెం ఆశాకిరణం కన్పిస్తుందా అని ఆమె దృక్కులు వెదుకుతున్నాయి. పాపం అసలే వయస్సు మళ్లిన మనిషి. అందులోనూ ఈ క్షోభ. అప్పుడప్పుడూ ఏదో ప్రార్థనవాక్యం గొణుగుతూవుంది. భక్తితో 'తండ్రీ' అని "మేరీమాతా" అనీ దేవుళ్లను తలచుకొంటూవుంది. హఠాత్తుగా ఆమె కేదో ఆశాకిరణం కన్పించింది. ముఖం కాంతివంతమైంది. కొడుకు కేటానోను పిలుస్తూ "సంతూషెనాయ్ గారి దొడ్లో అది చూచావురా. పనసచెట్టుకు ఏదో తట్టుకొనివుంది. అది మన వంటఇంటి ఆహారపు బుట్టలావుంది. దేవుడు మన ప్రార్థనలను ఆలకించాడన్నమాట. మనకి ఆహారం దొరికింది. మొన్న ఆ బుట్టలో పండులకు పెడదామని ఎండినరొట్టెలు పెట్టాను. నీటి కవి తడిసి నానిపోయివుంటాయి. ఎంతచెడ్డా ఆహారం" అంది.

కేటానో ఇక అక్కడ క్షణం ఆగకుండా నీటిలో దూకి చేతులు విసురుగా వేస్తూ ఆ అమూల్య నిధికేసి ఈదుతూ వెళ్లాడు. కుటుంబంలో తక్కిన వారంతా వేయికళ్ళతో చూస్తున్నారు. కాని వారికి నిరాశే ఎదురైంది. కేటానో బుట్టలేకుండానే ఈదుతూ తిరిగి వస్తూ రొప్పుతూనే "చెట్టుదాకా పోలేదమ్మా" అని కేక పెట్టాడు.

తల్లి "ఎందుకు పోలేదురా" అని బిగ్గరగా అరచింది. పాపం ఆంటోనియో "నాన్నా మా కింత ఆకలిగా వుంటే, ఆ రొట్టెలు లేకుండా ఎందుకొచ్చావ్" అని అరిచాడు.

"సంతూషెనాయ్‌గారి ఇల్లు ఏ క్షణమైనా కూలిపొయ్యేట్టుంది. ప్రమాదం! పనస చెట్టు దగ్గరికిపోతూ వాళ్ల యింటి గోడనుచూస్తే గోడకి తూటుపడి లోపలికి నీరుపోతోంది. వాళకి ప్రాణాపాయం వచ్చిందని చెప్పొద్దూ, మన ఇంటికిరండని చెప్పేదా. వాళ్లని చావనిస్తామా?"

పావ్‌లో, అతని భార్య ఏకకంఠంతో "అవును బాబూ, వెంటనే వచ్చేయ్యమని చెప్పు" అని అరిచారు.

తండ్రీ కొడుకులు దొరికిన చెక్కలను చేర్చి తెప్పగా తయారు చేశారు. కేటానో తెడ్డు వేసుకొంటూ వెళ్లాడు.

సంతూషెనాయ్ భార్య పిల్లలకు వండిన వంటలను వడ్డిస్తూ, భర్తతో "పాపం వాళ్ల పిల్లలు ఎంత అలమటించి పోతున్నారో. ఈ ఆపద సమయంలో జరిగిందాన్ని మనస్సులో పెట్టుకొని వాళ్ల సంగతి పట్టించుకోకపోతే దేవుడైనా మనల్ని క్షమిస్తాడా" అంది.

సంతూ చికాకుగా "ఎవరు పెట్టుకున్నారు మనస్సులో? నిన్నటినుంచీ ఒక బుట్టలో ఇంత అన్నం పెట్టుకొని ఎలాగైనా అక్కడికి చేర్చుదామని చూస్తున్నాను. కాని అతను పావ్‌లో సంగతి నీకు తెలీదూ. వట్టి గర్విష్టి. ఈ విపత్తులో కూడా మన సహాయం స్వీకరించడు" అన్నాడు. పైకి అలా అన్నాడేగాని పావ్‌లో గర్వం, అభిమానం తలచుకొని తన కర్తవ్యం తాను నిర్వర్తించకుండా ఉండటం మంచిదికాదని లోపల అనిపిస్తూనేవుంది సంతూషెనాయ్‌కి.

ముసలావిడ గబ గబా ఆహారాన్ని బుట్టలో పెడుతూ "అయిందేదో అయింది. వాళ్లు ఆకలితో ఉండడం మనకు మంచిదికాదు. ఈ బుట్ట తీసుకెళ్లి అక్కడికి చేర్చండి" అంది.

సంతూషెనాయ్ వెంటనే **ధో**వతి బిగించి బుట్ట నెత్తిమీద పెట్టుకొని నీటిలోకి దిగాడు. నిమిషం పాటులోనే కేటానో, సంతూ వరద నీటిమధ్యలో ఎదురయ్యారు. ఒకరినొకరు చూచుకొని ఆశ్చర్యపోయారు.

"ఎక్కడికి కెళుతున్నారు బాబా" కేటానో అడిగాడు.

"మీ పిల్లలకు అన్నం తెస్తున్నాలే. ఇంత ఆపద వచ్చినా మీకు మేము జ్ఞాపకం రాలేదన్న మాట."

కేటానో హృదయం కృతజ్ఞతతో నిండి పోయింది. అతని అంతరాత్మ ఏదో చెప్పింది. "పోయిందాన్ని పోనివ్వండి. ముందు మీ ఇంట్లో వారినందరినీ ఈ తెప్పపై మా ఇంటికి తీసుకెళ్లాలి. మీ ఇంటి వెనక గోడ ఏ క్షణమైనా కూలేట్టుగా వుంది. తెలియదా?" అన్నాడు.

సంతూ గిరున వెనక్కి తిరిగి వర్ణింప రాని భీతితో తన ఇంటి కేసి చూచాడు. తన భార్యా పిల్లలు ఎంతటి ప్రమాదాన్ని ఎదుర్కోబోతున్నారో తలచుకున్నాడు. విష్ణుసహస్రనామం జపిస్తూ వెర్రివాడిలాగా ఇంటికేసి పరుగు తీశాడు.

ఇంటిలోని వారిసందరినీ కేటానో తెప్పలో ఇవతలికి చేరవేసేదాకా ముసలాయన శ్వాసతీసుకో లేదు. చివరి విడతగా ఇంట్లో ఆహార సామగ్రి అంతా తెప్పలో నుంచి ఇవతలికి తెచ్చారో లేదో పెద్ద శబ్దం విన్పించింది. సంతూషెనాయ్ ఇంటి వెనక తటు గోడ పెద్ద ధ్వనితో కూలిపోయింది. దాని వెంటనే ఇల్లు కూడా కూలింది.

సంతూషెనాయ్ భార్య వడ్డించిన అన్నం తింటూ పావ్‌లో మనుమలు సంతోషంతో కేక లేస్తున్నారు.

సంతూ షెనాయ్ కూలిన తన ఇంటి కేసి చూస్తూ రాయిలా నిలబడిపొయ్యాడు. కంట నీరు పెటుకొంటూ "జీవితంలో అన్నిటికన్నా పొరుగువారిపట మన కర్తవ్యం గొప్పది. అంతేనా పావ్‌లో?" అన్నాడు.

"అవునన్నా. క్రీస్తు చెప్పిన విధులలో అది ఒకటి. 'నీ పొరుగు మనిషిని నిన్ను నీవు ప్రేమించు కొనే విధంగా ప్రేమించమన్నాడు'" అని సమాధాన మిచ్చాడు పావ్‌లో గద్గదస్వరంతో.

ఈవిధంగా ఈ ఇరుగు పొరుగు వారి మనస్సులో ఈ మూడునెలలుగా గూడు కట్టుకొన్న వైరం వైమనస్యం వరద దెబ్బకు కొట్టుకొనిపోయి మన స్సులు క్షాళన మయ్యాయి. ఫుల్‌గాం గ్రామంలో హిందువులకూ క్రైస్తవులకూ మధ్య ఏర్పడ్డ తగాదా అనే చిచ్చు వరద నీటికి పూర్తిగా ఆరి పోయి' ప్రశాంతత ఏర్పడింది.

(మహారాష్ట్రంనుండి).

(అనువాదం: డి. రామలింగం.)

[శ్రీ సుఖ్‌ఠణ్‌కర్ 1931 లో 'సహయ్యాద్రీచ్యాపయథ్యాశీ' అనే తమ కథల సంపుటి ప్రచు రించారు. అందులో 'మహాపురాచీ శిక్షణ్' అనే కథ ఒకటి ఉంది. దానినే హిందీలోకి అనువాదం చేయించి 1934లో మున్షీ ప్రేమ్‌చంద్ తమ 'హంస్' పత్రికలో వేశారు. 1941లో శ్రీ వి. శాంతా రామ్ తీసిన 'పడోసీ' అనే చిత్రం విడుదల అయింది. శ్రీ సుఖ్‌ఠణ్‌కర్ కథనే ఈ చిత్రం పోలి ఉన్న ప్పటికీ శ్రీ సుఖ్‌ఠణ్‌కర్ కథని మరాఠీలో చదవని వారు కొందరు ఆయన 'పడోసీ'ని చూసి ఈ కథ వ్రాశారనుకున్నారుట!]

# ఈనాటి సాహిత్యంలో స్థితిగతులు

[జనవరినెల సంచిక తరువాయి]

## శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

### 1

అద్యతనాంధ్ర సాహిత్యంలో మొదటితరం వారు ఇంకా రంగంలో మెసలుతూ ఉండగానే రెండోతరం కవులు పండితులు తల ఎత్తారు. మొదటితరంమీద గట్టిగా పని చేయని వ్యావహారిక భాషావాదం ఈ రెండో తరం వారిలో చాలామంది మీద పెద్ద ముద్రవేసింది. భాషలో అభ్యుదయ కాముకత్వానికి వ్యావహారికభాషావాదికావడం, లేకపోతే వ్యావహారిక భాషావాది ననడం ప్రతీకమై పోయింది. గద్యమేగాక పద్యం కూడా వ్యావహారిక భాషా శరీరంతో సాగింపబడిన రచనలు వచ్చాయి. మొదటితరం సాహితీ పరులలో కొందరు నాటకాలలో పాత్రోచిత భాష పేర గ్రామ్యాన్ని, వ్యావహారికాన్ని ఉపయోగించారేగాని మొత్తం గ్రంథాలకు వ్యావహారిక భాషను అవలంబించినవారు ఆట్టేమంది కన్పించరు—శ్రీ గురజాడ వారు మినహా. నాటకాలలో ఇట్లా కొందరు గ్రామ్య భాషను, వ్యావహారికభాషను అవలంబించడానికి ఒక్క వ్యావహారిక భాషా వాదంయొక్క ప్రాచుర్యమే కారణం కాదు. సంస్కృత నాటకాలలో స్త్రీ పాత్రలు, నీచ పాత్రలు పాకృతం మాట్లాడ్డంవుంది. గ్రాంథిక వాదులైవుండి, నాటకాలలోమాత్రం వ్యవహారికాన్ని గ్రామ్యాన్ని వాడిన ప్రసిద్ధులు ఈ సంస్కృత సంప్రదాయాన్నిగూడా తమ రచనాసూత్రానికి అనుసంధించుకున్నారని తోస్తుంది. మొదటితరం గడిచి, రెండోతరం తలఎత్తేనాటికి కావ్యభాష, గ్రంథభాషల విషయంలో ఇట్లా మార్పు వచ్చింది.

ఈ రెండోతరంలో జరిగిన రచనా వ్యాసంగాన్ని పరిశీలించిచూస్తే, అప్పుడు తోతెంచిన మార్పులు మరికొన్ని కూడా గోచరం అవుతాయి. అందుకు కారణాలు కూడా కన్పిస్తాయి. బ్రిటిష్ పరిపాలన వల్ల—ఇతర ప్రాంతాలలోలాగానే ఆంధ్రభూమిలో కూడా ఆంగ్ల భాషా పాండిత్యం రూపుకట్టింది. మన వారికి ఆంగ్ల విజ్ఞాన సాహిత్యాలతో దృఢ పరిచయం ఏర్పడింది. ఇంగ్లీషువారు విచిత్రులు. ప్రపంచ వాఙ్మయాన్నంతా తమ భాషలోనికి ఆపాత మధురంగా, గొప్పగా అనూదితం చేసి వదిలిపెడతారు. ఈ కారణంచేత ప్రపంచంలోని సర్వదేశాల విజ్ఞాన సాహిత్యాలు, రాజకీయ భావాలు, ఆ ఆంగ్ల సాహిత్యప్రపంచంద్వారా భారతదేశంలో కూడా వ్యాపించాయి. ఇవి భారతజాతిని, ఉన్నిద్రమైయున్న జాతిని, హఠాత్తుగా జాగరితం చేశాయి. మొదటితరం వారిపై ఈ రకమైన విశ్వ సాహిత్య ప్రభావంలేదని కాదు. ఉంది. వీరేశలింగంపంతులుగారు కవుల చరిత్రను రచించారంటే, అక్కడ ఆయనపై జాన్సన్ ప్రభావంలేదని అనడం ఎట్లా? వేదం వేంకటరాయ శాస్త్రిగారు నాటక రచనపై పాశ్చాత్య రూపక సాహిత్య ప్రభావం చెల్లలేదని ఎట్లా అనగలం? ఈ విధంగా ఆ మొదటితరంవారిపై గూడా ఆంగ్ల సాహిత్య ప్రపంచ ప్రభావంవున్నా, ఆ ప్రభావం రెండో తరం కవులమీద, రచయితలమీద ఉన్నంతగాలేదు. రాజకీయభావాలు, తాత్విక భావాలు విషయంలోకూడా ఇంతే. రెండో తరంవారిమీదనే యీ ముద్రఎక్కువ.

ఈ ప్రభావం ఆంధ్ర సాహిత్యంలో విచిత్రమైన మార్పులను తెచ్చిపెట్టింది.

దేశంలో జన సామాన్యంలోకూడా యీకాలంలో అనేకమైన మార్పులు వచ్చాయి.దేశ స్వాతంత్ర్యంకోసం సాగుతున్న పోరాటంయొక్క లక్షణం గ్రామ గ్రామానికి వ్యాపించింది. ఈ పోరాటంలోనే సాంఘిక ఆర్థిక విప్లవాల బీజాంకురాలు కూడా ననలెత్తుతూవచ్చాయి. ఇది ఇట్లా జరగడం క్రిందటితరంవారికి ఎబ్బెట్టుగా, రెండవతరంవారికి కొత్త వెలుగుగా కన్పిస్తూ వచ్చింది. తిరుపతి కవులు ఎడ్వర్డు రాజు పట్టాభిషేకాన్ని గురించి నాటకం వ్రాశారు. గురజాడ అప్పారావుపంతులుగారు బ్రిటిష్ ప్రభుత్వాన్ని మన్నన చేశారు. జాతీయ ఉద్యమాన్ని నిరసించారు. రెండవ తరం కవులలో ఈ లక్షణాలుకాగడా వేసినా కన్పించని స్థితి ఏర్పడిపోయింది. ఆంధ్రప్రశస్తులు రాష్ట్రగానములు వెల్లివిరిసాయి. జనంలో ఏర్పడినట్లే కవిలోకంలోకూడా వ్యక్తి స్వాతంత్ర్యకాంక్ష, దేశ స్వాతంత్ర్యదీక్ష, మానవ కారుణికత్వ సిద్ధాంత ప్రాభవం, ప్రజాస్వామ్యదృష్టి పూలవాసనలనలె, గుబాళించాయి. "అస్వతంత్రతా నియతమైన యీ బ్రతుకు తెల్గువారు భరించలేరు" అంటూ కవులు దీకాగానం చేశారు. రాజకీయ, ఆర్థిక వాతావరణను సాంఘిక వ్యవస్థామార్పులకులోనైపోయినాయి.సాహిత్యకారుల మనస్సులలో యీ మార్పులు ఉన్ముఖంగానో, ప్రతిముఖంగానో సుస్థిరమైన ముద్రను వేశాయి. ఆధ్యాత్మిక భావాలు కూడా నూతనమైన పరిశీలనకు గురియై సాహిత్యంలో పడుగు పేకలు అల్లడం మొదలైంది. ఒక్కమాటలో ఈ రెండో తరంలో ఒక్క ఉత్కృష్ట భావ విప్లవం, భావ పరిణామం, తెలుగు సాహిత్య మాగాణంలో తొలకరించింది. మనస్సులో ఒక వినూత్న ఉత్సాహదీప్తిని, దృష్టిలో ఒక క్రొత్త మార్పును, ఆలోచనలో ఒక క్రొత్త గుబాళింపును, విచారధారలో ఒక క్రొత్త పదునును తెచ్చిపెట్టింది.

కృష్ణరాయలకాలం అనంతరం ఇంతటి సాత్త్విక విప్లవం తెలుగు భాషలో, తెలుగు సాహిత్యంలో రాలేదు. ఆ కారణంచేత కొందరు కవులు యీ విప్లవాన్నిగూర్చి పాడుతూ, విద్యా నగర రాజవీధులలోని సరస్వతి తెలుగు మాగాణం అంతటా గ్రామ గ్రామంలో పూలపల్లకీలలో పూరేగుతున్నదని అన్నారు. ఈ రెండవతరం తలఎత్తేవరకు ఆంధ్రసాహిత్యం ఎక్కువగా పండిత జనంకోసమే ఉద్దేశింపబడేది. అందుచేత పండితులే పండిత జనానికి కావలసిన ధోరణిలో సాహిత్య కల్పన చేసేవాళ్ళు. ఆంగ్లభాషతో సంబంధం ఎక్కువ అనుసంధితంకాని రోజుల్లో మన రచయితలు సంస్కృత వాఙ్మయాన్ని అనుకరించారు. సంస్కృత వాఙ్మయంలోవున్న ప్రక్రియలను తెలుగులోకి తెచ్చారు. అప్పుడు కావ్య వస్తువుకు ప్రజా జీవితానికి పెద్ద సంబంధం ఉండేదికాదు. ప్రజలలో వున్న రసాస్వాదన శక్తిని ఆ తరంవాళ్ళు మేల్కొలపలేక పోయినారు. వారి రచనలు తరచు పద్యరూపంలో ఉండేవి. కథావస్తువు పౌరాణికంగా వుండేది. కథా కథన వైఖరిలో పద్యరచనా పద్ధతిలో దాదాపు స్తబ్దత ఏర్పడిపోయింది. ఈ రకమైన పద్ధతి ఆద్యత నాంధ్ర సాహిత్యయుగం మొదటితరాలవారిలో కొంతవరాతం సడలిందిగాని, రెండవతరం తలఎత్తిన తర్వాతగాని పూర్తిగా సడలలేదు. ఈ రెండవతంలో పూర్వంలేని ఖండ కావ్యాలు వచ్చాయి. కథాకావ్యం వ్రాస్తున్నప్పుడు, ఆ రచనా పద్ధతిలో పెద్దమార్పు వచ్చింది. ఇది జనభావంయొక్క ప్రతిబింబనం. పూర్వపు ప్రబంధపు ఫక్కీనివున్న కావ్యాలనుజనం చదివి అరిగించుకోలేక, ఆనందించలేక పోయినారు. ఆ ప్రబంధాలలోని విజ్ఞ వర్ణనలు జనానికి ఎబ్బెట్టుగా తోచనారంభించాయి. మహా కవుల ప్రబంధాల సంగతి, కావ్యాల సంగతి ఎట్లా ఉన్నా, తక్కువరకపు శిల్పంతో మూసపోసినట్లు ఏకాకారంగా వచ్చి శృంగారపు వర్ణనలతోవున్న గ్రంథాలు డోకు పుట్టించాయి. ఇప్పుడు ఈరెండవతరంవారికి కథలో, కథచెప్పడంలో, భావాలను పరచడంలో క్రొత్త పద్ధతి అవసరమైంది. ఇచ్చట

కొందరు కాళిదాసాది సంస్కృత మహాకవుల రచనా పద్ధతిని అనుసరించారు. ప్రబంధ పద్ధతిని సన్యసించారు. మరికొందరు ఆంగ్ల సాహిత్య ప్రపంచ ప్రభావితులై ఆ రచనా శిల్పాన్ని అనుసరించి రచనలు సాగించారు. మరికొందరు ఉభయ మార్గాలను అనుసరించారు. పింగళి కాటూరి కవుల సౌందర నందం సంస్కృత కావ్యాలలోని కథా కథన పద్ధతిని ఎంతగా అలవరచుకొన్నదో, పాశ్చాత్య కావ్య శిల్ప పద్ధతులను కూడా అంతగాను అలవరచుకొన్నది. ఆ యీ విషయాలు ఎట్లావున్నా ఖండ కావ్యం అన్నది, భావ కవిత్వం అన్నది పాశ్చాత్య సాహిత్య ప్రభావంవల్ల, సంపర్కంవల్లసముద్భవంచెందినటువంటివే. అదేవిధంగా గేయ నాటక రచన, గేయ గద్య సమ్మిశ్రమైన రూపక రచనా కూడా పాశ్చాత్య సాహిత్య ప్రభావ సంపర్కాల వలన ఆవిర్భావం చెందినవే. ముఖ్యంగా విశ్వనాథవారి అనార్కలిలోని గేయ భాగ రచనలో, పద్ధతిలో ఆరకం ప్రాచుర్యం గోచరిస్తుంది. ముఖ్యంగా గెటేగారి "నాల్పర్జస్నైట్" ప్రభావాన్ని ఇందులో చూడవచ్చు. ఫాస్ట్ రెండో భాగంలో ఇది వుంది.

## 2

ఈ రెండవతరం కవులలో రచనా వైవిధ్యంతో పాటు భాషా పాటవంకూడా అధికంగావుంది. వీరు ఏమి వ్రాసినా, గట్టిగా చదివి, ఆకళించుకొని, పండితులమను అనిపించుకొని వ్రాశారు. ఒకటి అర పద్య ఖండాలతో కవిత్వం ఆగిపోయినవారిలో కూడా ఈ లక్షణం ప్రధానంగా గోచరిస్తుంది. శబ్దము, శబ్దముయొక్క సౌందర్యము, దానిని ఉపయోగించడములో సొగసు, కొత్త పదబంధాలను సృష్టించడము ఈ కాలం కవులలో చెప్పుకోదగిన విశేషం. తాము చెప్పదలచుకున్నదానికి అనుకూలంగా ఈ రెండో తరం కవులు భాషను వంచారు. కృష్ణశాస్త్రివంటి వానిలో, నండూరి సుబ్బారావువంటి కవిలో, విశ్వనాథ వంటి కవి రాక్షసునిలో, కవికొండల వెంకటరావు వంటి విచిత్ర వూహాశాలిత్వంకల మనీషిలో శబ్దాలు, వానితోకూర్చబడినపదబంధాలువిచిత్రమైనమార్గాలలో నడిచాయి. కవి తన అనుభవాన్ని, బాధను, ఉత్సాహాన్ని, విచారాన్ని, కష్టాన్ని, సుఖాన్ని గాఢంగా, బాఢంగా గానంచేశాడు. తెలుగుభాషను, భావాన్ని సరవళ్లుత్రొక్కించాడు. ఒక్క పద్య కవిత్వమే కాక నవలా సాహిత్యం కూడా ఈ రెండవ తరంలో పడగవిప్పింది. అంతకు ముందు నవలలు లేవనికాదు. ఒక్క చిలకమర్తి లక్ష్మీ నరసింహం పంతులు గారిని తప్పిస్తే ఆ మొదటి తరం వారిలో తెలుగు తనము, జనరంజకత్వమువున్న నవలలు ఆట్టే పుట్టలేదు. వీరేశలింగం పంతులుగారు నవలలు వ్రాసినా, అందులో వారి సంస్కారప్రియత్వమే విద్యమానమై, రస నిష్పత్తిలేక, హృదయాన్ని కదిలించే శక్తిలేక నట్టే నవలలుగా మాత్రం మిగిలిపోయినాయి గాని సాహిత్యం అని చెప్పతగిన లక్షణం వాటికి అబ్బలేదు. చిలకమర్తి వారి రామచంద్ర విజయము, కర్పూరమంజరి, గణపతి మొదలైన నవలలతో తెలుగు నవలా సాహిత్యంలో కొత్త యుగమేగాక, రచనా పద్ధతులలో, వస్తుపరిగ్రహణలో మార్పు వచ్చింది. రామచంద్ర విజయం సామాన్య మానవుని జీవితం. జీవిత పోరాటంలో మానవుడు విజయాన్ని సాధించడం అందులో ఇతివృత్తం. ఇచ్చట పాశ్చాత్య నవలాసాహిత్య ప్రభావంలేదని అనలేము. అది ప్రభావమేగాని, నలుకుబడికాదు. రచనా పద్ధతిని గ్రహించడమేగాని, 'కాపీ కొట్టడం'' కాదు. తరువాత రెండవతరంలోవారు నవలారచన చేబట్టిన వేళకు తెలుగునవల పాకానపడింది. ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాలవారి నవలలు, సరస్వతీ గ్రంథమాలవారి నవలలు, వేగుచుక్క గ్రంథమాల వారి నవలలు తెలుగుదేశాన్ని కొత్త ఊపుతో ముంచెత్తాయి. బెంగాలీ నవలలు, ఇంగ్లీషు నవలలు అనూదితాలై ప్రచురింపబడినాయి. అది అదృష్టమో దురదృష్టమో చెప్పలేము. ఇంగ్లీషు నుండి నవలలు తర్జుమాలలో తెలుగుభాషలోనికి వచ్చినా Classics అని పేరువడిసినవి అట్టే అనూదితాలు కాలేదు. ఇది ఒక లోపమేనని చెప్పాలి. రచయితలు అయినా ప్రసిద్ధ రచయితల పేర్లు చెప్పి, ఆ గ్రంథము చదివారు, ఈ గ్రంథము చదివారు అని ఒకరిని ఒకరు పృచ్ఛించు

కొనడము వినా, ఆ గ్రంథములను తెలుగు భాషకు అలంకారాలుగా సమకూర్చి పెట్టలేము. ఎవరన్నా అట్టి పనిని తలపెట్టారే అనుకుందాము, అవి రాణకు ఎక్కేటట్లు అనూదితం కాలేదు. కాని యీ నవలలు తెలుగు రచయితలను కదిలించి, ఆ పద్ధతులలో తెలుగులో రచన సల్పేందుకు పురికొల్పాయి. విశ్వనాథ వారు 'అంతరాత్మ' నవలను వ్రాసినప్పుడు ఆయనను కదిలించింది, చిలకమర్తివారి రామచంద్ర విజయం అనిపిస్తుంది. ఏకవీర రచనా కాలంనాటికి ఆయనపై గెతే ప్రభావముద్ర కన్పిస్తుంది. గెతే వ్రాసిన Sorrows of Wherther కు, సత్యనారాయణగారి 'ఏకవీర'కు పోలికలు వున్నాయి. ఇట్టి ముద్ర అంటూ లేకుండా అచ్చమైన తెలుగు నవల వ్రాసినవాడు శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రి. ఇందుకు ఆయన వ్రాసిన "స్మశానం" అన్న నవలను ఉదహరించవచ్చు. అయితే తెలుగు నవల ఒకవంక ఉన్నవ లక్ష్మీనారాయణగారి 'మాలపల్లి'లోను, ఇంకోవంక విశ్వనాథవారి "వేయి పడగలు" లోను కాష్ఠను అందుకొంది.

శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు చారిత్రకేతి వృత్తాలు తీసుకొని నవలలు రచించారు. వారి నవలలో నన్నయ యుగం, తిక్కన యుగం, ఎర్రనయుగం కళ్లకు కట్టినట్లు చిత్రింపబడినాయి. శ్రీనాథ యుగాన్ని గూడా చిత్రించడానికి ప్రయత్నించారు. గాని ఆనవలలో వారి రచన నారాయణభట్టు మొదలైన నవలలు పోయిన స్థాయికి పోలేదు. ఈ నవలలలో వారి కథాకథన శిల్పమేగాక, భాషాపాటవము, రచనా చమత్కారము, చరిత్రలో వారు సాగించిన పరిశోధన మొదలైన బహువిషయాలు ద్యోతకం అవుతాయి.

తెలుగు నవలారచయితలలోఅందరిదీ ఒకయెత్తు, శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారిది ఇంకొక యెత్తు. ఆయనతో పోల్చదగిన వ్యక్తి ఎవ్వరూ కన్పించరు. ఇటు రాజకీయాలలో, అటు సంఘ సేవలో కాకలు తీరిన వ్యక్తి అయన. బారిష్టరు. ఇటు తెలుగు సాహిత్యాన్ని, అటు ఇంగ్లీషు వాఙ్మయాన్ని ఆయన మధించారు. దానికి రాజకీయాలలో ఆయన గడిపించు కొన్న అనుభవము తోడైంది. తాత్విక చింతనం మెండైంది. గాంధీయుగంలో తాత్విక చింతనం రాజకీయాలకు ఎక్కింది. అందువల్లనే లక్ష్మినారాయణగారి 'మాలపల్లి' లో గాంధీతత్వం అచలతత్వంగా రూపుదాల్చింది. అందులోని పాత్రలన్నీ ఎంత నూతనంగా కన్పిస్తాయో, అంత సనాతనమైన లక్షణం కూడా కలవి . అన్నిపాత్రలు చైతన్యం పుష్కలంగా కల్గినట్టివి. ఈ నవలలో కొంతభాగం "ఉన్కిల్‌టామ్స్ క్యాబిన్"(?) నవలకు అనుసరణగా వున్నదంటారు. ఉన్నదని కూడా చెప్పవచ్చు. అయితే అది ఆనవలకు యేవిధంగాను న్యూనతను తెచ్చిపెట్టదు. అసలు మహాప్రతిభావంతులైన వారి ప్రభావం మరి ఒకరి మీద చెల్లుబడి కావడం అనాది నుంచీ వుంది. కాళిదాసునిపై వాల్మీకి ప్రభావం వున్నట్లు. దానిని న్యూనత అనము. విశ్వనాథ వారిపై గెతే మొదలైన వారి ప్రభావం ఇటువంటిదే. అటువంటి ప్రభావం చెల్లడం వల్లనే తెలుగు నవలా ప్రపంచం విస్తరించింది. ఈ నవలా ప్రపంచంలో 'మాలపల్లి'ది శేఖరస్థానము.

ఈ రెండోతరంలో రచయితలు భాష్యాంతవ్యాకరణం చదువుకున్నవాళ్లు కాకపోయినా, తమకు కావలసినంతవరకు భాషను వ్యాకరణాన్ని సుస్థిరంగా అభ్యసించారు. ఉత్తమ ప్రతిభతోపాటు తగినంత వ్యుత్పత్తిని సముపార్జించి, వ్యుత్పన్నతను (Profundity) ప్రదర్శించారు. ఈ తరం రచనలు శాబ్దికజ్ఞాన దారిద్ర్యం వల్ల చెడిపోలేదు. కించిద్దోషాలు వున్నా, అవి ఫరవాలేదని సాహసించి చేసినవీ, వాటివల్ల సాహిత్య గుణం లుప్తం కాకుండా జాగ్రత్తపడ్డవీని.

## 3

ఇంగ్లీషుభాషలో కాల్పనిక ఉద్యమపు కవుల్లో రెండోతరంవాళ్లలాగానే ఈ రెండవతరంలో కవులు, రచయితలు కూడా అవసరమైనంత స్వేచ్ఛను అవలంబించారు. The second generation breaths a spirit of moral revolt. It is innovotory, critical, and readily places itself outside the pale of Common obligations.(A History

of English Literature by Legonies and Cozamnian) ఈ రెండోతరంలో తెనుగు సాహిత్యంలో బహురకాలసాహిత్య ప్రక్రియలు ప్రారంభమైనాయి. నవలల సంగతిపైన పేర్కొన్నాను. ఇవిగాక సుఖదుఃఖాంత నాటకాలు, నాటికలు, చిన్నకథలు, పెద్దకథలు, వ్యాసాలు, విమర్శలు, జీవితచరిత్రలు, స్వీయచరిత్రలు, మహాకావ్యాలు, లఘుకావ్యాలు, గేయాలు, ప్రణయ గీతాలు, స్మృతికావ్యాలు, హేళనకావ్యాలు —ఇంకా, ఇంకా ముక్తచ్ఛందాలు పూవులు పూసి, ఫలాలుగా ముగ్గిమన సాహిత్యవృక్షాన్ని సురభిళంచేశాయి. మన సాహిత్యప్రాంగణం సర్వాంగసుందరమై, వైవిధ్యంతో, వైదగ్ధ్యంతో, వైశిష్ట్యంతో ప్రకాశించింది. కొడవంటి వెంకటసుబ్బయ్య ఈ సంరంభాన్ని చూచి, అనుభవించి, కంఠం ఎత్తి, తెరువరిని పేరుపెట్టి పిలిచి

"ఆగుమాగుము తెరువరీ,
ఆయాసఖేదంబపనయింపుము
మా గృహాంగణ సీమయందలి
మధువు లియ్యవిగో"

అంటూ గానం చేశాడు. కవితా సామాగ్రిని గూర్చి తొలకరిలో సింగిలి కాటూరికవులు ఒక చక్కని సీస పద్యంలో జాబితా ఇస్తే, వేలూరి శివరామశాస్త్రివారు తమకు కవిగా కావలసిన అవసరాలను పేర్కొన్నారు. కాని ఈతరంలో కవితాసమాగ్రియీ కవులచే పేర్కొన బడిన దానిని మించిపోయింది. కవిత్వము ఆత్మ నిష్ఠము. అనుభవోమోపజ్ఞకము. అనడంచేత ఇచ్చట సామాగ్రి వైవిధ్యంకూడా అవసరమైంది. సంప్రదాయ సిద్ధమైన కవిసమయాలతో పాటు క్రొత్త కవిసమయాలు కూడా ఏర్పడ్డాయి. ఒక్కొక్క రచయిత ఒకొక్క సంథాలో రచనావ్యాసంగంచేసి, ఎవరి మార్గాన్ని వారు దిద్దుకున్నారు. ప్రకృతితత్వ కథ సంతో, కేవల స్వభావోక్తితో మొదటి ఖండకావ్యాన్ని శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు రచించారు. మధ్య తరగతి కుటుంబ జీవితానికి సంబంధించిన కావ్యాన్ని కూడా రాయప్రోలు వారే ప్రథమంగా రచించారు. అదేవిధంగా ఆత్మానుభూతి ప్రధానమైన కావ్యాన్ని కూడా శ్రీ రాయప్రోలువారే రచించారు. దేశంలో రాష్ట్రోద్యమం బయలుదేరినప్పుడు ఆఉద్యమం తొలిసారిగా శ్రీ రాయప్రోలువారి రచనలలోనే సాహిత్య స్థాయిని అందుకున్నది. ఇచ్చట రవీంద్రుని "సోనార్ బాంగ్లా" పలుకుబడి లేదని అనలేము. కాని అంతకు ముందు కూడా ఆంధ్రదేశ ప్రశస్తిని గానం చేసినవారు వున్నందువల్ల, వారు తెలుగు భాషనుదిద్దిన మహాకవులు అయిన కారణంచేత వారి ప్రభావంకూడా యీ రాష్ట్ర ప్రశస్తిని గూర్చిన కవిత్వంమీద వున్నదనవచ్చు.

తెలుగుదేశాన్ని కీర్తిస్తూ మొట్టమొదటిసారిగా కవిత్వం చెప్పింది శ్రీనాథ కవిసార్వభౌముడు. భీమ ఖండంలో ఆంధ్రదేశాన్ని కీర్తించాడు. ముక్తిమంటప మైన, అవిముక్తమైన, ఈశ్వరనివాసమైన వారాణసీ పురానికి కాశీఖండంలో ఉన్న ప్రాముఖ్యాన్ని శ్రీనాథుడు భీమఖండంలో త్రిలింగదేశానికి సమకూర్చిపెట్టాడు. కాశీఖండంలో వ్యాసభగవానుడు చేసిన ఉత్తరభారత వర్ణనకు శ్రీనాథుడు ముగ్ధుడై గోదావరీ, కృష్ణా, తుంగభద్రా జలములచేత పునీతమైన ఆంధ్రదేశానికి, ఏతాదృశమైన పావిత్ర్యాన్ని కల్పింపదలచి—మహా సాహసికమైన చమత్కారాన్ని చేశాడు. స్వకపోల కల్పితంగా భీమఖండాన్ని రచించి ఆంధ్రదేశ ప్రశస్తిని గానం చేశాడు. అప్పట్లో మనదేశంలో ఉన్న పండితుల రుచికి అనుకూలంగా—ఇది సంస్కృతంలో వ్యాస భట్టారకుడు వ్రాసిన దానికి ఆంధ్రానువాదం మాత్రమేనని బుకాయించాడు. ఆనాటి సంస్కృత వ్యామోహితులను తృప్తిపరచటానికి తన తెనుగుకావ్యాన్ని సంస్కృతీకరించి వాళ్లకు చూపెట్టినట్లు కూడా తోస్తుంది. భీమఖండ సంస్కృత ప్రతి భారతదేశంలో ఎక్కడా కనిపించటంలేదు. ఆంధ్రదేశంలోనే ఒక్క తాళపత్ర ప్రతి లభించగా—అది లండను ఇండియా హౌసు లైబ్రరీలో ఉన్నట్లుగా—ఇండియా హౌసు లైబ్రరీ సంస్కృత గ్రంథాల పట్టీలో ఉన్న కారణం చేత భీమఖండానికి వ్యాసకృత సంస్కృత మాతృకలేదనీ,

ఆ ఉన్నదేదో శ్రీనాథకృతి సంస్కృతీకృతమైనదేననీ విద్వాంసులు అభిప్రాయపడుతున్నారు. శ్రీనాథుని ఆంధ్రాభిమానం బృహత్తరంగా ఉన్నది. ఇతడు చిత్రించిన వ్యాసనారదులు, లోపాముద్ర అగస్త్యులు, పార్వతీ శివులు—కేవలము అచ్చతెలుగువారు. వ్యాసభట్టారకునకు ఆయన శిష్యసమూహానికి శ్రీనాథుడు చక్కని తెలుగు విందు చేశాడు. తెలుగు నేలను అమితంగా ప్రేమించిన ఉత్తముడు శ్రీనాథ మహాకవి. దేశంలో సంస్కృత సరస్వతీదేవికి ఉన్న గౌరవ సత్కారాలు ఆంధ్రభారతికి కూడా గడించి గణింపులోనికి తెచ్చిన వాడు.

## 4

ఈ రెండోతరంలో జరిగిన కవితోద్యమాలలో ముఖ్యమైన శాఖ ఆత్మాశ్రయమైన ప్రణయ కవిత్వ శాఖ. ఇందులో ప్రథమశ్రేణి రచనలు చేసినవాళ్ళు శ్రీ దేవులపల్లి, శ్రీ విశ్వనాథ, శ్రీ నాయని, శ్రీ వేదుల ప్రభృతులు. కాని ఆత్మాశ్రయ కవిత్వం కూడా శ్రీ రాయప్రోలుతోనే ప్రారంభమైనదని చెప్పాలి. ఈ ఉద్యమంలో శబ్దంమీద కంటె (అదీ మనోహరమైన కూర్పే) భావంమీద ఎక్కువ శ్రద్ధ వుండటం వల్ల వీళ్లని భావుకవులు అన్నారు. అంటే ప్రతిభా (నవనవోన్మేషశాలినీ) వాదులన్నమాట. ఈ భావకవిత్వం యావత్తూ ఆత్మాశ్రయ మార్గంలోనే వచ్చింది. అందులో శృంగారరసప్రధానమైన ప్రణయగీతాలదే పైచెయ్యి. రాయప్రోలు వారి శృంగారంలో చాలా నిగ్రహం ఉన్నది. తృణకంకణం, కష్టకమల, ఆనాటి ఉత్తమ రచనలు. వీళ్లు ప్రతిభావాదులైనా వ్యుత్పత్తి శూన్యులుకారు. ప్రతిభ, వ్యుత్పత్తి ఉంటేనే వస్తుంది గనుక వ్యుత్పత్తి ప్రతిభలోనే ఉన్నదనీ—ప్రతిభా వ్యుత్పత్త్యోః ప్రతిభాశ్రేయసీ—అనీ వీళ్ల వాదం. శ్రీ రాయప్రోలువారి ఆత్మాశ్రయ కవిత్వంలో ఒక వినూతనశాబ్దిక స్నిగ్ధత, భావనలో క్రొత్త పోకడలు, ప్రాకృతిక శోభాసందర్శనం ఉన్నాయి. కవితాశిల్పంలో కొంతవిశృంఖలత్వం కనబడుతుంది. శ్రీ విశ్వనాథ వారి 'గిరికుమారుని ప్రణయగీతాలు', శ్రీనాయని వారి "సౌభద్రుని ప్రణయయాత్ర" ఒకసంవిధానానికి చెందిన ప్రణయ కవితా రచనలు. సంప్రదాయ విస్మృతిలేక, భాషాపుష్టితో, శృంగారమయమైన భావనా కల్పన చెయ్యడం ఈ రచనల్లో కన్పడుతుంది. ఈ ఆత్మాశ్రయ ప్రణయ కవిత్వంలో ఇంకో పేరు శ్రీ శివశంకరశాస్త్రిగారి హృదయేశ్వరిది. శ్రీ శాస్త్రిగారు భాషాకోవిదులు. వారి భాషకు అలవడినంత లాలిత్యం భావనాశిల్పానికి అబ్బలేదు.

శ్రీ రాయప్రోలుతో ప్రారంభమైన ఆత్మాశ్రయ కవిత్వం దేవులపల్లివారిలో విస్తృతాకారాన్ని సంతరించుకున్నది. గాఢ అనుభూతిని కవితంగా రూపొందించినవారు శ్రీ కృష్ణశాస్త్రి, శ్రీనాయని. వీరి తరువాత ఆత్మాశ్రయ కవిత్వం వ్రాసిన భావకవులు ముఖ్యంగా ప్రణయం విషయంలో—వలసినంత గాఢత్వాన్ని కవిత్వంలోచూపలేకపోవడంవల్ల—భావదారిద్ర్యం వల్ల భావకవితాశకం మహాప్రస్థానం చేసింది.

ఇతర భాషాకవులంతా జాతీయ స్వాతంత్ర్య ఉద్యమంలో ప్రభావితులై ఉత్తేజకరాలైన రచనలు చేస్తూ ఉంటే మన తెనుగు కవులు వియోగగీతాలు ఆలపిస్తూ కూర్చున్నారు. ఈ వియోగగీతాలు పాడిన పాత పాటలుగా, శ్రవణ సుభగత్వంలేని ఘోషలుగా మాధుర్య ప్రసాదగుణాలులేని వెగటు విపరీతాలుగా—సంయమనంలేని అహంకారాలుగా, క్రిందికి దిగజారి పోయాయి. ఆంధ్రోద్యమంలో మనం సృష్టించుకున్న రాయప్రోలు, విశ్వనాథ, తుమ్మలవంటి వారి కవిత్వాలు జాతీయోద్యమంలో మనకు లేవనే చెప్పాలి. మన భాషలో ఒక సుబ్రహ్మణ్యభారతిగాని, ఒక నజ్రుల్ ఇస్లాంగాని, ఇక్బాల్‌గాని ఆవిర్భవించలేదు. కవిత్వానికి పుట్టిల్లై ఆవేశానికి నిధానమైన ఆంధ్రభాషలో ఈ క్షామానికి బాధ్యత వహించవలసిన వాళ్ళు ప్రేమపిచ్చితో పలవరించిన భావకవులే.

ఈ ప్రేమపిచ్చి మనసాహిత్యాన్ని పెద్ద దెబ్బ తీసింది. దేవులపల్లివారు విప్రలంభాన్ని ప్రధానంగా తీసుకుని తమ గాఢమైన అనుభూతికి కావ్యస్వరూపం చేకూర్చినప్పటినుండీ, ఈ ప్రేమ మన పెరటోల్ల

విషవృక్షమై కూర్చుంది. ఆయన శబ్దవైచిత్రి కలవాడు. తన కవిత్వానికి కావలసినంత అలంకార సంగ్రహణ దక్షత కలవాడు. తగినంత రచనాశిల్పం తెలిసినవాడు. తాను వస్తువుగా స్వీకరించిన దానికి తన పరిధిలో సొగసులు చేశాడు.

కాని ఆయన తర్వాత ప్రేమకన్న లోకోత్తరమైన విషయమే లేనట్లు—స్త్రీ కాకుండా మరి కవితావస్తువే లేనట్లు—మన ఆంధ్ర వాఙ్మయ పరిస్థితి మహా దారుణంగా పరిణమించింది. కవిత్వ స్వరూపం అంతా ప్రియురాలి స్వరూపమై పోయింది. కాని ఈ అనుకరణ బుద్ధులకు గాఢమైన అనుభూతిలేకపోవడం మూలాన రచనలు మురుగు కాలువల స్థితికివచ్చాయి. ఈ ప్రేమ, పద్యకవిత్వంతో ఆగలేదు. కథలలోకి, కథానికలలోకి నాటికలలోకి, నాటకాలలోకి పోయింది. మన రాష్ట్రములో కర్మవీరుడు వీరేశలింగం పంతులుగారు, మహర్షి వెంకటరత్నంనాయుడుగారు నిర్మించిన, ఉత్తమ బ్రాహ్మమత ఉద్యమం ఈ ప్రేమ కవుల మూలంగా మర్మాఘాతాన్ని అనుభవించవలసి వచ్చింది. సామాన్య జనం—ఈ ప్రేమ కవుల్ని చూచి, బ్రాహ్మమతం అంటే ఇదేకామోసు అనుకున్నారు. క్రొత్త ఉద్యమాలకు స్వాగతాలు పలికే తెలుగు యువకులు బ్రాహ్మమతం అంటే ఉత్సాహం చూపించలేదు. ఇంత అననుకూలమైన విపరీత పరిస్థితులు వచ్చినా—ఈ ప్రేమవాదులు జంకలేదు. సంఘాన్ని లక్ష్య పెట్టలేదు. సంఘం మీద తాను జయించానని వ్యక్తి అనుకున్నా నిజంగా అది అతని పరాజయమే. ఈ సత్యాన్ని చలంగారి రచనలు నిరూపిస్తున్నాయి. ప్రేమను వీళ్లు భగవంతుడే నన్నారు. ఇది ఏమి అన్యాయం అంటే—ప్రేమ దివ్యమైనదనీ, భగవత్స్వరూపమనీ పాశ్చాత్య తాత్త్వికులు చెప్పలేదా—అని మొరాయించారు. 'God is love' అన్నచోట మనం భావించుకుంటున్న ప్రేమను Love గా చెప్పలేదు. నిత్యసచ్చిదానందఘనమైన భగవత్స్వరూపాన్ని దర్శించడానికి చేసే గాఢకృషిని వాళ్లు Love అన్నారు. మనవాళ్ల ప్రేమ స్త్రీగతశృంగార భావనా విలసితమైనది. రాగద్వేషాలలో 'రాగం' యొక్క రూపాంతరమే వీళ్ల ప్రేమ. వీళ్ల ప్రేమభావనలు మాత్రం ఉత్తమ స్థితికి చెందిన రాగస్వరూపంకాదు. కాని రాగంలో ఉత్తమరాగం లేకపోలేదు. నలదమయంతుల ప్రేమ, శ్రీ సీతారామచంద్రుల ప్రేమ, దేవహూతికర్దముల ప్రేమ, ఉత్తమమే. ఆ మూడు విధాలైన ప్రేమనూ మన ఆలంకారికులు 'రాగం' క్రిందగానే జమకట్టారు.

## 5

శ్రీ సత్యనారాయణగారు మహాకావ్య సృష్టికర్తగా (శ్రీమద్రామాయణ కల్పవృక్షం), ఖండకావ్య కవిగా, కథా రచయితగా—నవలా (వేయిపడగలు, ఏకవీర, చెలియలి కట్ట, మొ॥) రచయితగా—గేయకవిగా, నాటక (వేనరాజు, అనార్కలీ, నర్తనశాల, త్రిశూలం) రచయితగా, విమర్శకుడుగా, ధర్మోపదేష్టగా—ఈతరంలో సాహిత్య సార్వభౌమపీఠాన్ని అధివసించి ఉన్నారు. సామాజిక విప్లవం వచ్చి సంఘం తారుమారు అవుతున్న రోజుల్లో-అప్పుడున్న సాంఘిక పరిస్థితులకి నిత్యమైన సాహిత్య స్వరూపంగా వేయిపడగలు పట్టారు. ఇటువంటి వస్తువిశేషాలే ఉత్తమ నవలలుగా ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మను సాహిత్యాలలో కూడా ప్రకాశిస్తున్నాయి.

శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి తర్వాత ఆంధ్ర సాహిత్యంలో శిష్య బహుళుడైన వ్యక్తి ఈయనే. ఈయన ముద్రపడని సాహిత్య ప్రక్రియ ఈ తరం సాహిత్యంలో లేదనే చెప్పవచ్చును. ఆయన "చేతా వాతా—నోటితోనూ గాత్రంతోనూ—వ్యవహరించగలడు. తెలుగు మీద నిలబడి ఒకచేతో సంస్కృతం—ఒకచేతో ఇంగ్లీషూ ఆయన స్వాధీనం చేసుకున్నాడు. నమ్మిన విషయం నిలబెట్టుకోవడానికి ఆయనకి దేవుడు మొదలు దెయ్యందాకా ఎవరన్నా భయంలేదు. భక్తి లేదు. సనాతన ధర్మానికీ—ఆధునిక నాగరికతకూ ఆయన హృదయంలో నిత్యసంగ్రామం జరుగుతూ ఉంటుంది. ఆయన పురాణం అంత ముసలి. వ్యావహారిక భాషంత బాలుడు. పాతది గనుక సర్వంతీశై, క్రొత్తది గనుక సర్వంమెచ్చై అనడం ఆయన మతం కాదు. పురాణం చూసేటప్పుడు భూత అద్దాలు

పెటు గుని చూడూ—ఈనాటి విషయం చూసేటప్పుడు మసగ లేకుండా చూడూ—అని ఆయన కోరేది. అటు షడ్దర్శనాలూ, శాస్త్రాలూ లగాయతు ఇటు సహస్రాధికంగా ఉండే నవీన సమస్యలూ సందర్భాల వరకూ, ఆయన కూలంకషంగా అన్వయించుకోవడమే కాకుండా, సమన్వయించడానికి కృషి చేశారు. గద్య పద్య గేయ రూపాలలో, ఖండాఖండ రచనల్లో, శతక పురాణాలలో, నవలా నాటకాలతో, ఆఖ్యానాఖ్యాయికలలో, ఉపోద్ఘాత విమర్శలలో, ఆయన వాక్కు విహరించింది. ఆయన రచన చూస్తే పూర్వీకుల రచన ఇటు జరిగినట్టూ నేటి కాలపు ఆంధ్ర రచన అటు జరిగినట్టూ—అనిపిస్తుంది. ఆయన రచనలో మహా పండితులు కూడా ఆగిపోవలసి వచ్చే చోట్లు ఎల్లా ఉంటాయో, అట్లాగే పామర జనం, నిత్యకృత్యంలో వాడుకునే పదజాలం వచ్చే చోట్లూ అల్లానే ఉంటాయి. ఆయన రచనల్లో నన్నయ తిక్కనాదుల వృత్తాలూ శ్రీనాథాదుల సీసాలూ, దేశికవుల గేయాలూ, మాత్రమే కాకుండా వచన పద్యాల (ముక్తచ్ఛందం) వరకూ కన్పిస్తున్నాయి. శృంగార మధురమైన శృంగారవీధి నుంచి దుఃఖశాంత మధురమైన వరలక్ష్మీత్రిశతి దాకా సర్వమయంగా ఆయన భావనాబలం విజృంభించింది. ఆయన పద్యాలకూర్పులో కవిత్రయాన్ని, నాచనసోమన్న గారిని, కృష్ణరాయలవారిని, తెనాలిరామకృష్ణుణ్ణి, శ్రీనాథుణ్ణి, ధూర్జటినీ, పింగళి సూరన్నగారిని స్ఫురింపజేసే ఘట్టాలుఉన్నాయి. ఏక సమాస పద్యాలు ఆముక్తమాల్యదనీ, పాలకురికి సోమన్నగారినీ స్ఫురింప జేస్తున్నాయి. ఆయన పురాణ రచన దృశ్య ప్రబంధం అనీ, ఆయన నాటక రచన ఊహాప్రబంధం అనీ, ఆయన నవలా రచన ఆత్మప్రబంధం అనీ, గేయ రచన ప్రకృతి ప్రబంధం అనీ, అనుకోవాలి. ఆయన రచనలలో చమత్కారాలు అనేకం.గుణగణాలుఅనంతం. పాత్ర సృష్టికి గిరికా, స్వాతంత్ర్యేచ్ఛకి ప్రశస్తి మరువరానివి. ఆయన ఈ తరం సాహిత్య వ్యాసంగానికే మూర్తీభావము. ఆయన రచనా వైవిధ్యమూ, వైదగ్ధ్యమూ పరిశీలిస్తే ఈ తరంలో ఆంధ్రసాహిత్యం సాధించినదేమిటి, పుష్టి చేసుకున్న సాహిత్య ప్రక్రియలేమిటి — అనుసరించిన ధోరణులు, వెఖరులు ఎట్లాంటివో తెలిసిపోతాయి.

ఈ తరంలో సాహిత్యం పరమ ఉన్నత స్థితికి వచ్చింది. కవిత్వంలో భిన్నభిన్న మార్గాలు (ఖండాఖండ రచనలు, మహాకావ్యాలు, ఆత్మాశ్రయ ప్రణయ కవిత్వాలు), భిన్నభిన్న రససంబంధాలు (శృంగారమయాలూ,దుఃఖస్మృతితో శాంతంతో పర్యతసించేవి. వీరగాథలు, భీభత్స నాటికలూ) రావలసినవి, రాతగినవి అన్నీ వచ్చాయి. వచనంలో కథలూ, గల్పికలూ కథానికలూ, వ్యాసాలూ, స్వీయచరిత్రలూ, విమర్శలూ, నవలలూ, నాటికలూ, నాటకాలూ—ఇంకా ఎన్నో వచ్చాయి. అగ్రశ్రేణి రచనలతో అన్నిశాఖలూ ప్రకాశించాయి.

## 6

చిన్నకథ ఈ తరంలోనే సాహిత్యాకాశంలో మహాస్థానాన్ని అధిరోహించింది. చిన్నకథలు వ్రాసిన వాళ్లలో అతిరథులు, మహారథులు ఉన్నారు. శ్రీ చలంగారిని గురించి వ్రాశాను. ఆయన కథా ప్రపంచమే వేరు. ఆయనకు బహుళంగా అనుయాయులు ఉన్నారు. ఆయనలాగా రచనలు చెయ్యాలనే తాపత్రయం ఉన్నవాళ్ళు ఉన్నారు. శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి కథా వైశిష్ట్యం ఆయన వ్యావహారిక భాషలో ఉన్నది. మాధుర్యానికి ఆయన వచనం ప్రథమగణనీయం. తెలుగులో వచ్చిన స్వీయచరిత్రలలో ఆయన రచనకే అగ్రపీఠం. ఆయన భాషను అనుకరించేవాళ్లూ ఉన్నారు. కాని ఆయన సాధించిన మాధుర్య రసధారావాహినీ స్వరూపాన్ని మళ్లీ ఎవరూ సాధించలేకపోయారు.

శ్రీ మునిమాణిక్యంగారి కథావస్తువులన్నీ మధ్యతరగతి కుటుంబాల్లో ఉండే గృహవాతావరణానికి చెందినవే. ఇటువంటి కథావస్తువులతో ఈయన్ను అనుకరిస్తూ కథలు వస్తూనే ఉంటాయి.

శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రిగారుకూడా ఇతరులు తన్ను అనుకరించేటట్లుగా కథలు వ్రాశారు.

శ్రీ మల్లాదివారి ఎత్తుగడ, నిర్వహణ, ముగింపూ అంతా శృంగారమే. అందులోనూ చాలాభాగం పరకీయ శృంగారం. రెండు శతాబ్దాల క్రితం మధుర—తంజావూరు—ఆంధ్ర నాయకుల సభలో ప్రశంసింపబడివున్న వ్యావహారికంపై శాస్త్రిగారు ఎక్కువ మోజు చూపెట్టారు. శాస్త్రి గారిని అనుకరించి, ఆయన లాగానే కథలు వ్రాసింది ఆయన మిత్రుడు శ్రీ వి. యన్. భూషణ్ ఆ వ్రాసిన దానిపేరు ముత్యాలశాల.

శ్రీ చింతా దీక్షితులుగారు ఆంధ్రకథక చక్రవర్తి. బాలలసాహిత్యానికి శ్రీకారం చుట్టింది శ్రీ దీక్షితులుగారే. అది ఇప్పుడు విజృంభించి ఒక ప్రత్యేక ప్రాముఖ్య సాహిత్య శాఖగా రూపుకట్టింది. వీరు సృష్టించిన సూరి సీతి వెంకి వంటి పాత్రలు నిత్య కౌమారమూర్తులు. లీల, సుందరి, శంపాలత వంటి పాత్రలు కూడ చిరస్మరణీయాలు. పాశ్చాత్య నాగరికతను అవహేళన చేయడానికి వీరు చిత్రించిన 'వటీరావు' ఎల్లప్పుడూ ఆనందాన్ని చేకూర్చే చిత్రణమే. వీరి "చెంచుదంపతులు" అన్న కథ ప్రపంచ కథా సాహిత్యానికే అలంకారప్రాయమైన రచన. దీక్షితులు గారి మార్గంలో కూడా అనేకంగా అనుకరణ రచనలు వస్తూనే ఉంటాయి.

కథానికా రచనలో కూడా శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు సిద్ధహస్తుడే. ఆయన కథలు తక్కువగా వ్రాసినప్పటికీ గుణ వైశిష్ట్యంలో అనల్పమైనవే వ్రాశారు.

ఇంకో ప్రసిద్ధమైన కథానికా రచయిత శ్రీ అడవి బాపిరాజుగారు. ఈయన బహుముఖ ప్రజ్ఞాశాలి. కవి. కథకుడు, నవలా రచయిత, గేయ రచయిత, చిత్రకారుడు, శిల్పి. ఆయన రచించిన 'తిక్కన', సముద్రగుప్తుడు చిత్రాలు ప్రపంచఖ్యాతి గడించినై. బాపిరాజుగారు ఎన్ని విధాలైన ప్రజ్ఞను చూపించినా ఆయన యశస్సు ప్రధానంగా—ఆయన రచించిన చిన్నకథల వల్లనే నిలుస్తుంది. భోగీరలోయ, తిరుపతి కొండమెట్లు, శిల్పబాల, వీణ, హిమాలయరశ్మి వంటి కథలు చిరకాలం ఉండేవి. ఆయన వ్రాసిన నవలలు ఎక్కువగానే ఉన్నాయి. వాటిలో చారిత్రక నవలలూ, సాంఘికాలూ ఉన్నాయి.

ఈ రెండవ తరంలో చినకథను అత్యంతము జాగరూకమైన శిల్పంతో రచించినవారు శ్రీ వేలూరు శివరామశాస్త్రి వారు. వారి చిన్నకథలు ఎంత గొప్పవో వారి వాక్యరచనా విధానం అంత గొప్పది. వారి వాక్య రచనా పద్ధతి ఎంత గొప్పదో, వారు సృష్టించిన పాత్రలు అంత గొప్పవి. సంస్కృతంలో దిగ్దంతి వంటి పండితులైవుండి, బహు భాషావేత్తృత్వం వుండి, బహు శాస్త్రాలలో నికషోపలమైన ప్రజ్ఞాప్రాభవాలు వుండి వారు చిన్నకథను కమ్మెచ్చున లాగినట్లు లాగారు. శ్రీ శాస్త్రిగారి వచన శైలిలో ఒక ప్రత్యేకత వుంది. వారి శైలిపుష్టిగా, తేటతెల్లంగా, నిర్దుష్టంగా మధురంగా వుంటుంది. శ్రీ శాస్త్రిగారు అనువదించిన గాంధీగారి 'ఆత్మకథ' ఇప్పటికీ వచన రచనకు ఒజ్జబంతిగా వున్నది. అవధాన కవిత్వంలో ఉజ్వల దీప్తమణిగా సాహిత్యజీవితం ప్రారంభించిన శాస్త్రిగారు, పద్యరచనలో కన్నా, వచన రచనలు ఎక్కువ చేశారు. విజ్ఞాన తపస్విగా బహుళమైన వ్యాసాలు వ్రాశారు. బెంగాలీ నుంచి ఎన్నోనవలలు అనువదించారు. స్వంతంగా 'ఓబయ్య' అన్న చిన్న నవల వ్రాశారు. కాని వారి ప్రశస్తి చిన్నకథలలో. అవి అపూర్వము, మహత్వపూర్ణము అయినటు వంటివి. వారి 'ఔపగవ్యుడు' వారి 'అతిధిదేవుడు', వారి 'పిత్తల్ కా దర్వాజా', వారి 'చీకటి తప్పు' మొదలైన కథలు లోకోత్తరమైనవి. పద్యరచనలో కూడా శాస్త్రిగారిది తీసికట్టు చెయ్యి కాదు. వారు సంస్కృతమునుండి ఎన్నో గ్రంథములను అనువదించగా (ఋగ్వేదము, యజుర్భాష్యము మొ॥) అవి అగ్నికి ఆహుతి అయినవట. "అగ్ని" అన్న కావ్య ఖండికలో శాస్త్రిగారు ఆ దుఃఖాన్ని వ్యక్తం చేసుకున్నారు. శాస్త్రిగారి పద్యరచనలలో ప్రకటితములైన వానిలో "నాగటిచాలు" "కుక్కపిల్ల" చాలా ప్రశస్తమైనవి.

## 7

రెండోతరంలో తెలుగు సాహిత్యం ఒక వెలుగు వెలిగింది. రాజ రాజనరేంద్రుని కాలంతర్వాత, తిక్కన అనంతరం, శ్రీనాథునకు పదపడి, రాయలవారికి పిమ్మట తెలుగు సాహిత్యం ఇంతటి ఔన్నత్యాన్ని పొందినదిలేదు. ఈవిధంగా మారాకు హత్తుకొన్నదిలేదు. అయితే ఈ కాలంలో తెలుగుకు భాషకువచ్చే ఆగామి అవ్యవస్థా దశయొక్క లక్షణాలు కూడా విద్యమానం అవుతూ వచ్చాయి. ఈ విచిత్ర స్థితి మొదటి తరంలోనే ప్రారంభమైనదని అనవచ్చు. ఏనాడు గిడుగు రామమూర్తిపంతులుగారు వ్యవహారిక భాషా వాదాన్ని ప్రారంభించారో, ఆనాడు తెలుగు భాషకు ఒక విధమైన ఔన్నత్యంతోపాటు, ఒక విధమైన దుర్దశకూడా మొదలైంది. ఇది వ్యావహారిక భాషావాదం దోషం గాని, గిడుగు పిడుగు తప్పుగాని కాదు. గిడుగు వారు తమవాదంకోసం వ్యాకరణాన్ని, ముఖ్యంగా చిన్నయసూరి వ్యాకరణాన్ని రచ్చకు యీడ్చారు. ఆ వ్యాకరణం సమగ్రమైనది కాకపోవచ్చు. అది వేరే విషయం. చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారు అననే అన్నారు: "తెలుగునకున్న వ్యాకరణ దీపము చిన్నది." కాని వ్యావహారిక భాషా వాదంవల్ల అది పెద దికాలేదు. సరికదా వ్యాకరణం అంటే, భాషలో కట్టుబాట్లు, భాషలో పాటవము అంటే ఒక విధమైన ఏవగింపు ఉద్బుద్ధమైంది. అనభిజ్ఞులు అభిజ్ఞులైనారు. నోటికి వచ్చిన మాట ప్రమాణం అయిపోతున్నది. పాఠశాలల్లో మార్కులకోసంతప్ప, ఇతరత్రా వ్యాకరణానికి గౌరవం అన్నది లేకుండా పోయింది. భాషలో అరాచకం సంప్రాప్తమైంది.

ఇందుకు ఇంకా అనేక కారణాలుఉన్నాయి. ఏదేశంలోనైనా విద్యావ్యాప్తివలన భాషకు పుష్టి, వైశాల్యము కల్గుతాయి. తెలుగుదేశంలో అటా కాదు. ఉద్యోగాలకోసం చదువులు, చదువుల కోసం పరీక్షలు వచ్చిన వేళకు భాషయందు గౌరవమేగాక, భాష కూడా పల్చ బడుతూ వచ్చింది. పెద్ద పుస్తకాలు చదివి అర్థం చేసుకోలేనివాళ్లు, అసలు దండాన్వయం కూడా చేయలేనివాళ్లు అధికం అయినారు. అటువంటి వారికోసం రచనలు అవసరం అయి, భాషానభిజ్ఞులు సాహిత్య మాగాణంలో ప్రవేశించి, భాషను, భాషయందు అనురక్తిని గూడా సన్నగిల్లేట్లు చేశారు.

ఈ రకం రచయితలు ఎల్లకాలాలోను, ఎల్ల దేశాల్లోను కూడా ఉంటారు. కాని తెలుగు దేశంలో వెలువడినంతటి చౌకబారు రచనలుకొన్ని ఏ యితర భాషలోను, దేశంలోను వచ్చి ఉండవు. ఒకప్పుడు రైళ్లలో జేడా అర్థణాకు పుస్తకాలు అమ్మకం జరుగుతూ ఉండేవి. ఆ తర్వాత దేనినైనా, ఎవరినైనా తక్కువచేసి చెప్పడానికి ఈ "జేడా అర్థణా" ఒక పదబంధం లాగా ఏర్పడి పోయింది. ఏతావతా చెప్పవచ్చేది ఏమంటే పరీక్షల చదువులలో తెలుగు భాషకు ప్రశస్తి తగ్గిపోయింది. అది రెండవ భాష అయిపోయింది. రెండవ భాష మేష్టరీ గిరీ పాఠశాలల్లోనేగాక, బయట కూడా ప్రసహసనంవతుగా తయారై పోయింది.

ఈ పరిస్థితులలో వారు చదువు చెప్పడము, వీరు నేర్వడము అన్నదేలేదు. విద్యార్థికి 35 మార్కులు వస్తే చాలు పరీక్షలో నెగ్గుతాడు. ఇటువంటి పరీక్షా పద్ధతులను చూచే కీర్తిశేషులు, చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు "35 మార్కుల పండితులను" గురించి యీసడించారు.

శాస్త్రిగారి యీసడింపు సంగతి ఎట్లాఉన్నా సంస్కృత కళాశాలలు అంటూ బయలుదేరి పండిత బృందాలను, తెలుగు మేష ర్లను ఉత్పత్తి చేయడం మొదలు పెట్టిన స్థితిలో తెలుగును బోధించే పద్ధతిలో విచిత్రాలు పుట్టాయి. పూర్వ మహా కవుల గ్రంథాలలోనేమి, భాషయందేమి, విద్యార్థులలో ఆసక్తిని కల్గించే శక్తి కొరవడిపోయింది. ఫలానా కవి కవిత్వము నారికేళపాకము, ఫలానా కవిది ఇంకో పాకము—అన్న పద్ధతిలో పాఠాలు చెప్పారు. ఇప్పుడు

కూడా అదేవిధంగా చెబుతున్నారు. ఈ పాఠాలు చెప్పేతీరువలన విద్యార్థులలో ఆ చిన్న వయస్సులోనే తెలుగును అభ్యసించడం అంటే భయం అయిపోతున్న పరిస్థితి ఏర్పడుతున్నది.

దీనికితోడు ఈ రెండవ తరం కాలంలోనే ఇంకో రకమైన ఉద్యమం కూడా బయలుదేరింది. పద్యం వ్రాసినా, గద్యం వ్రాసినా, అది తేలిగ్గా, అందరికి అర్థమయ్యేవిధంగా రాయాలి. రాయకపోవడం పెద్ద దోషంగా భావించబడుతూ వచ్చింది. అయితే యీ తేలిగ్గా రాయడం అంటే ఏమిటి? తేలిక తనానికి ఒక ప్రమాణం అంటూ ఉన్నదా? అందరికీ అర్థం అయ్యేట్లు వ్రాయడం ఎటా ? ఈ "అందరు" అనే సమస్తపదం ఒక్క వ్యక్తికాదు. బహు వ్యక్తులు. చదవను, లేక చదవను—వ్రాయను నేర్చిన వ్యక్తులు. వారి అందరియొక్క శక్తి, భాషలోనేమి, విషయ గ్రహణ శక్తిలోనేమి ఒక్కటా? ఒక్కటిగా ఉంటుందా? ఈ అందరి భాషాజ్ఞానానికిన్నీ, అర్థగ్రహణ, విషయ గ్రహణశక్తికిన్నీ సగటు కటి, రచయిత అయినవాడు, ఆ సగటు భాష ఏమో తేల్చుకొని, నిర్ణయించుకొని ఆ ప్రకారం 'గద్య పద్య రచన సాగించవలసి ఉంటుందా? ఇటువంటి ప్రశ్నలు వేసుకున్నవారూ లేరు: జవాబులు కుదిర్చినవారూ లేరు. తేలిగా వ్రాయాలి అన్నవారుమాత్రం అధికం అయిపోయినారు. కొంత దీర్ఘ సమాస జుష్టంగా గద్య పద్యాదాలను వ్రాసినవారు, వ్రాస్తున్న వారు ఎవరన్నా వుంటే, వారి "పాషాణపాకప్రభువుల"ను గా విమర్శించిన హేదేవాలుచేసిన సందర్భాలు కూడా ఉన్నాయి. విచిత్రం ఏమంటే ఒక రచయిత ఒక పద్ధతి భాషను పెట్టి, శయ్యాపాకాలను పెట్టి, పద్యంగాని, గద్యంకాని వ్రాస్తున్నాడు అంటే, అది ఆకవి యొక్క ఆ రచయితయొక్క ఆత్మలక్షణాన్నిబట్టి, ఊహాశాలిత్వాన్ని బట్టి ఉంటుంది. తెలుగుభాషలో ఎవరో కొద్దిమంది తప్ప తక్కిన పద్యరచయితలు అధికంగా మార కవిత్వ పద తిని అనుసరిస్తున్నారు. ఈ అందరు వ్రాసే గద్య పద్యాదులు ఒకేరీతిలో ఉండటంలేదు. ఒకరి పద్యం ఒకవిధంగాను, మరి ఒకరి పద్యం ఇంకో విధంగాను ఉంటున్నది. పద్యంలో విరుపులు, గద్యంలో వాక్యవిన్యాసం వీనిలో తేడాలు ఉంటున్నాయి. ఎందుచేత ? ఆ కవి, లేక ఆ రచయిత ఆత్మలక్షణం అటువంటిది అని కాక ఇందుకు వేరే సమాధానం ఏమన్నా ఉంటుందా ?

ఇటువంటి బాఢమైన విచారము తెలుగులో జరగలేదు. ఎవరన్నా కొంచెం కఠినంగా గద్య పద్యాలు వ్రాస్తే దానిని "డిక్షనరీ" కవిత్వం అనో, రచన అనో విమర్శించడం ఉంది. ఇక్కడ యీమాటకు రెండు అర్థాలు. ఆ రచయిత Dictionary చూచుకుంటూ మాటలు తెచ్చుకుంటూ కవిత్వమో లేక తదితర రచనమో చేశాడని; ఇది ఒక అర్థం. రెండో అర్థం—ఏమిటంటే, అటువంటి కవిత్వం డిక్షనరీ చూచి మాటలకు అర్థాలు తెలుసుకుంటూ చదువుకుంటే గాని అర్థం కాదని; ఈ "తేలిక ఉద్యమం" వారు 'నిఘంటు నిరసనవాదులు'గా రూపు దాల్చారు. ఇందువల్ల కూడా తెలుగుభాషను అభ్యసించడం సందర్భంలో నిఘంటువులను ఉపయోగించడం 'పాపం' అయిన పరిస్థితి ఏర్పడి నిఘంటువును చూడటం ఒక అపచారము, ఒక న్యూనత అయిపోయినాయి. ఈ రకమైన మనస త్వం మన తెలుగు దేశంలో తప్ప, మరి ఇంకో దేశంలో, ఇంకో భాషలో ఉన్నదేమో తెలియదు. మన తెలుగు దేశంలో కూడా ఇంగ్లీషును అభ్యసించే సందర్భంలో Dictionary లను ఉపయోగిస్తూనే ఉన్నారు. ఆ భాషను అభ్యసించేవారు కూడా వాటిని కొంటున్నారు. తెలియనిమాట అంటూ వస్తే దానిని చూచి తెలుసుకుంటున్నారు. 'తేలిక తెలుగు' వాదులు కూడా ఇతర భాషలను చూచేప్పుడు నిఘంటువులను వాడుతూనే ఉన్నారు. ఇట్టి కొందరిలో ఆప్టే, మోనియర్ విలియమ్సు వ్రాసిన సంస్కృత నిఘంటువులను కొని దగ్గర పెట్టుకొనడం కూడా ఉంది. కాని

ఒక్క తెలుగుకే యీ నిఘంటు అభ్యాస నిషేధాన్ని విధిస్తున్నారు.

ఇతర భాషలవంక చూస్తే, ఆ భాషలలో యీ రకమైన 'తేలిక భాషావాదం', లేక ఉద్యమం తలఎత్తినట్లు కన్పించదు. ఇంగ్లీషుభాషను తీసుకు చూస్తే అందులో టి. ఎస్. ఇలియట్ గారి గ్రంథాలు, డైలాన్ థామస్ పుస్తకాలు ఎంతమందికి అర్థం అవుతున్నాయి? మరి వారు కష్టంగా, కఠినంగా పాషాణపాకంలో కవిత్వం వ్రాశారని ఎవ్వరు అన లేదే! అమెరికాలో ఫాక్నర్ గారి గ్రంథాలు ఉన్నా యంటే, ఆయన ఒక్కొక్క వాక్యాన్ని కొండవీటి చేంతాళ్లవలె వ్రాస్తారే! కఠినమైన మాటలను అధికంగా ఉపయోగిస్తారే! ఇది కారణంగా ఆయన్ను విమర్శిస్తున్నవాళ్లు కన్పించరు.

తెలుగు భాషకు పట్టిన ఇంకో దుర్గతి కూడా ఉంది. భాషానభిజ్ఞులైనవారు, రాజకీయాలలో తలలు దూర్చినవారు,—వ్రాసే భాషను శాసించేవారు, వ్రాసే విషయాన్ని శాసించేవారు అయిపోతున్నారు. ఇది తెలిసి చేస్తున్నారో, తెలియక చేస్తున్నారో తెలియదు. లేక ''హక్కు''ను వినియోగించుకుంటు న్నారో! ఈ విషయాన్నే చెబుతూ ఒక కవి ''రాజకీయ దుర్జాతుల ఒత్తిడిం బడి'' అని ఇప్పుడు తెలుగుభాష పడిపోతున్న పరిస్థితిని గూర్చి వర్ణించి ఉన్నారు. కమ్యూనిస్టు దేశాలలో తప్ప ఇట్లా భాషను, ఆ భాషలో వ్రాస్తున్న దానిని శాసిదా మనే అభినివేశంగల రాజకీయవేత్తలు ఇతర దేశాలలో అరుదు. అసలు కన్పించరు.

ఇట్లా ఈ రెండోతరంలో సాహిత్యరంగంలో రెండు స్రోతస్సులు ఉద్భవించాయి. ఒక స్రోతస్సు గంగానదిలాగా త్రిపథగయై ప్రవహించింది. అటు సంస్కృతాన్ని, యిటు తెలుగులోని మహాకావ్యాలను ఆపోశనం పట్టి అందులోని నిగ్గులను ఆకళించుకొని, ఇంగ్లీషు భాషా సంపర్కంవల్ల, అధ్యయనంవల్ల, ప్రపంచ సాహిత్యాల రీతులను అర్థంచేసుకొని తెలుగు భాషను సాహిత్యాన్ని పండించింది. ఇంకో స్రోతస్సు లోతులేనిదై, వైశాల్యమును నటిస్తున్నదై, భాషలో సొగసులను, సంప్రదాయాలను, కట్టుబాట్లను ఆ ఉబ్బుతో తుడిచివేసేదియై తెలుగు సాహిత్య మాగాణంలో ఒకవిధమైన నీరససి తినితెచ్చిపెట్టేదిగా రూపు కట్టింది.

---



# శ్రీ నందలాల్ బోస్

"పద్మభూషణ" శ్రీ నందలాల్ బోస్ విశ్వవిఖ్యాత కళాకారుడు. భారతీయ కళా సంప్రదాయాన్ని దిగంతాలకు విస్తరింపచేసిన మహాశిల్పి. భారతీయ కళా హృదయాన్ని ప్రపంచానికి చాటిన వ్యాఖ్యాత. గ్రంథకర్త. వివిధ దేశాలలో శిష్య సంతతిని ప్రవర్తిల్లజేసిన దేశికోత్తముడు. ఏప్రిల్ 16వ తేదీ సాయంకాలం (16—4—66) శాంతినికేతన్‌లో కీర్తిశేషులయ్యారు. ఈ వ్యాసం ఆయన జీవితాన్ని రేఖా మాత్రంగా తెలుపుతుంది. —సం.



శ్రీ నందలాల్ బోస్ విశ్వ విఖ్యాతుడైన కళాచార్యుడు. ఎగుడు దిగుళ్లతో, వైపరీత్యాలతో ఉక్కిరిబిక్కిరి అయివున్న వర్తమాన కాలంలో ప్రాచీన మహత్తర కళా సంప్రదాయాన్ని, శాశ్వత ప్రేరణను నిలబెట్టిన మహా వ్యక్తిగా ఖ్యాతిని ఆర్జించాడు. ఆయన గాంధీజీ, రవీంద్రుల ప్రేమాదరరాలను చూరగొన్నాడు. ఆయనను వారు కళాకారుడనేకాక మానవత్వం మూర్తీభవించిన వ్యక్తిగానూ చూచారు.

నందలాల్ వంగభూమిలో ఒక కుగ్రామంలో 1883 లో జన్మించారు. చిన్నతనంలో ఆయన తన గ్రామంలో బంకమట్టి బొమ్మలు చేసేవారు. బొమ్మలుచేసే పద్ధతులను చూస్తూ, వారిలాగా బొమ్మలు చేయడానికి ప్రయత్నిస్తూ గడిపేవారు. అప్పుడు కాలేజీలో చేరడానికి ఎన్‌ట్రన్స్ అనే పరీక్ష ఉండేది. శ్రీ నందలాల్ హైస్కూలులో చదివి ఎన్‌ట్రన్స్ పరీక్షలో ఉత్తీర్ణుడైన తర్వాత కళాశాలలో ఆర్ట్స్ విభాగం మొదటి సంవత్సరంలో చేరారు. వర్డ్స్‌వర్త్ కవిత పాఠం జరుగుతున్నప్పుడు, ఆ పాఠాల నోట్సును వ్రాసుకోడానికిమారు వర్డ్స్‌వర్త్ పద్యాలను చిత్రించడంలో నిమగ్నులై ఉండేవారు. తర్వాత ఆయన కలకత్తాలో ప్రెసిడెన్సీ కళాశాలలో కామర్స్ కోర్సులో చేరారు.

కలకత్తాలో ఆయన బంధువు ఒకరు ప్రభుత్వ లలిత కళా పాఠశాలలో చిత్రలేఖనం మొదలయిన లలిత కళలు నేర్చుకొనే వాడు. యువకుడైన శ్రీ నందలాల్ అతనిదగ్గర చిత్రకళను నేర్చుకోడం ప్రారంభించారు. అతడేమో తను లలిత కళా పాఠశాలలో నేర్చుకున్న విద్యల ప్రకృతి దృశ్య చిత్రణం, వర్ణచిత్రణం మొదలయినవి ఇతని నేర్పాడు. శ్రీ నందలాల్ ఆఖరుకు కాలేజి చదువుకు స్వస్తిచెప్పి ఇంటినుంచి పంపిన డబ్బుతో చిత్రలేఖనకు కావలసిన పరికరాలను, సుప్రసిద్ధ కళాకారుల చిత్రాల ప్రతిరూపాలను కొనుక్కొనివచ్చాడు. వాటిని నకలుచేస్తూ, తన బంధువు దగ్గర "పాఠాలు" నేర్చుకుంటూ కొంత కాలం గడిపారు.

"ఈ సెకెండ్ హేండ్" పాఠాలు కొంత కాలానికి ఆయనకు సంతృప్తి కలిగించలేదు. గురువును అన్వేషించసాగారు. ఆయన గొప్ప చిత్రకారుడైన అబనీంద్రనాథ్ టాగూర్‌ను గురించి విన్నారు. ఆయనను దర్శించకముందే ఆయన చిత్రాలను, ఆయనను సుదూర ప్రాంతాల నుంచే ఆరాధిస్తూ వచ్చారు. అందువల్ల లలిత కళాపాఠశాలలో చేరడానికి నిశ్చయించుకున్నారు. లలిత కళా పాఠశాలలో శ్రీ అబనీంద్రనాథ్ టాగోర్ ఉపాధ్యాయుడు. ఆయననుంచే సరాసరి కళాపాఠాలు నేర్చుకోవచ్చునని శ్రీ నందలాల్‌కు తోచింది. అబనీంద్రనాథ్ మొదట నందలాల్‌నుకాలేజీవదలిపెట్టివచ్చినందుకు తిట్టిపోసి, తర్వాత గీసిన బొమ్మలేవైనా ఉన్నాయా అని అడిగివుంటే చూపించమనికోరారు. అప్పుడు లలితకళా పాఠశాలకు ప్రిన్సిపాలు శ్రీ ఇ. బి. హావెల్. అబనీంద్రనాథ్,నందలాల్ బొమ్మలనుకొన్నిటిని హావెల్‌కు చూపించారు. హావెల్‌కు ఆ బొమ్మలు నచ్చాయి. నందలాల్‌కు పాఠశాలలో ప్రవేశమిచ్చారు.

అబనీంద్రనాథ్ నందలాల్ విషయంలో శ్రద్ధ వహించారు. ఆయనలో నందలాల్‌కు ఆదర్శగురువు సాక్షాత్కరించాడు. అబనీంద్రనాథ్ ఎప్పుడూ ఇది ఇట్లా అని పాఠం చెప్పేవారు కారు. కేవలం మార్గదర్శకుడుగా వుండేవారు. విద్యార్థి తన వ్యక్తిత్వాన్ని తానే అభివృద్ధిచేసుకోవాలని ఆయన అభిమతం. "ఆయన నాలో కళాకారుణ్ణి సృష్టించారు." అని నందలాల్ తన గురువునుగురించి తర్వాత అన్నారు.

నందలాల్ ధ్యానపూర్వకమైన మనస్సుతో భారత పురాణేతిహాస గాథలలో ప్రవహించే చైతన్య స్రవంతిని మననం చేసుకుని, తను సాక్షాత్కారం రూపొంది చిత్రించడం సులభమని భావించారు. ఆ విధంగానే ఆయన తన విశిష్టచిత్రాలను చిత్రించారు. వాటిలో "సిద్ధార్థుడు" "క్షత రాజహంసం", "పరమశివుని ప్రళయతాండవం", "భీష్మప్రతిజ్ఞ "మొదలయినవి వున్నాయి. ప్రిన్సిపాల్ హావెల్ ఆ చిత్రాలు చూచి, అతని విలక్షణ రచనా రీతికి చిత్రభూమిక కూడ విస్తృతంగా ఉండాలని సూచించారు. బరోడాదర్బార్ ఆదేశంపై ఆయన బరోడాకీర్తిమందిర్‌లో రచించిన కుడ్యచిత్రాలు, శాంతినికేతన్‌లో రచించిన కుడ్య చిత్రాలు ఆయన రచనకు తగినవని హావెల్‌అన్నారు.

శ్రీ అబనీంద్రనాథ్ లలిత కళా పాఠశాలలో అధ్యాపక పదవి వదలినప్పుడు, ఆపదవిని నందలాల్‌కు ఇస్తామన్నారు. కాని, ఆయన తన గురువుగారి వెంట టాగోర్ భవనంలోని శ్రీ అబనీంద్రనాథ్ కళా మందిరంలో (స్టూడియోలో) పనిచేయడమేఉత్తమమని నిర్ణయించుకున్నారు. అక్కడ ఆయన విఖ్యాతయైన టాగోర్ కళా భాండారంలోని కళా ఖండాల కేటలాగును తగిన రేఖాచిత్రాలలో తయారుచేయడంలో డాక్టర్ ఆనంద కుమారస్వామికి తోడ్పడ్డారు. శ్రీ నందలాల్ మరొక మిత్రుడు బ్యారన్ ఒకా కురా (జపాన్). ఆయన కలకత్తాకు మూడుమార్లు— వచ్చారు. తర్వాత తర్వాత ఆయన "కళలో వంగ సంప్రదాయం"అని ప్రసిద్ధిచెందిన సంప్రదాయంపై శాశ్వతముద్ర వేశారు.

శ్రీ నందలాల్ తన చిత్రాలను అమ్ముతూ ఉత్తర దక్షిణభారతంలోని సుప్రసిద్ధ కళాక్షేత్రాలను దర్శించి ఆప్రాంతాల కళావాస్తుశిల్ప రీతులను అకళింపుకున్నారు.

అజంతా చిత్రాలను నకలు చేయడానికి 1909లో శ్రీమతి హారింగ్‌హాం భారతదేశానికి వచ్చినప్పుడు, ఆమెకు తోడ్పడడానికి నియమితులైన కళాకారులలో శ్రీ నందలాల్ ఒకరు. అజంతాలో ఆయన భారతీయ కళా సంప్రదాయాధ్యయన దీక్ష సమాప్తమైంది. తర్వాత ఆయన బాగ్ గుహలను గూడ దర్శించారు.

శ్రీ రవీంద్రనాథ టాగోర్ 1916లోకలకత్తాలో "విచిత్ర 'క్లబ్‌ను ప్రారంభించినప్పుడు" నందలాల్ ఆక్లబ్బుకళాకారులలో ఒక్కరు. 1919 లో ఆయన బోస్ పరిశోధన సంస్థలో కుడ్యచిత్రాలు రచించారు. ఈసంస్థను స్థాపించినవారుప్రసిద్ధవృక్షశాస్త్రజ్ఞుడు సర్ జగదీశ చంద్ర బోస్. నందలాల్ అప్పుడప్పుడు

శాంతినికేతన్‌కు వెళ్లేవారు. రవీంద్ర కవీంద్రుడు సత్కారాలు చేసేవారు. 1923 లో ఆయన తన గురువైన అబనీంద్రటాగోర్ అనుమతిపొంది శాంతి నికేతన్‌లో చేరి అక్కడి "కళాభవన్"కు డైరెక్టర్ అయ్యారు. ఇది శాంతినికేతన్‌లో కళాశాఖ. అక్కడ త్వరలో అందరూ ఆయనను "మాస్టర్ మాషాయ్" అని చనువుతో పిలవడం ప్రారంభించారు.

రవీంద్ర కవీంద్రునికి,నందలాల్ కళా కారునికి అతి సన్నిహితత్వం ఏర్పడింది. 1924 లో టాగోర్ బర్మా—చైనా జపాన్‌లలో పర్యటించినప్పుడు ఆయన అక్కడి కళాసంప్రదాయాల పరిశీలనకోసం నందలాల్‌ను వెంటపెట్టుకుని వెళ్లారు. నందలాల్ తర్వాత లంకకు కూడా వెళ్లివచ్చారు. ఆయన ప్రపంచయాత్రలు ఆయన కళా దృక్పధాన్ని కళాదిగంతాలను విస్తృతం చేశాయి. భారతీయ సంప్రదాయంలో చిత్రాలు రచిస్తున్నప్పటికీ విదేశ కళ సంప్రదాయాలనూ గ్రహించక పోలేదు. ప్రకృతి చిత్రరచనలో ప్రథమా చార్యులలో ఒక్కడైన నందలాల్ ఒకే విధంగా చిత్రాలు గీచాక వివిధ పద్ధతులలో వివిధోపకరణాలలో రచనలు చేశారు. 80 వ పడిలో పడుతూండగా కుంచె సిరాలతో రచన ప్రారంభించారు.

మహాత్మాగాంధీ లక్నో, ఫైజ్‌పూర్, హరిపుర కాంగ్రెస్ మహాసభల మండపాల అలంకరణ బాధ్యతను నిర్వహించవలసిందని నందలాల్‌ను కోరారు. మంటపాలంకరణలో ఆయన చూపిన వాస్తుశైలి, స్వీయమైన "ఫటా" శైలిలో ఆయన రచించిన చిత్రాలు ప్రేక్షకుల ప్రశంసలు పొందాయి. ఆ మహా సభలలో జరిగిన కళాప్రదర్శనాల బాధ్యత గూడ నందలాలే నిర్వహించారు. ఫైజ్‌పూర్ కుగ్రామం. గాంధీజీ ప్రోత్సాహంపై కాంగ్రెసుమహాసభ గ్రామ సీమలలోజరగడం అదే తొలిసారి. నందలాల్ ఫైజ్‌పూర్ కాంగ్రెస్ మహాసభా మండపాలంకరణకు గ్రామీణపరికరాలే, అక్కడివే వాడారు. ఇలా ముందె ప్పుడూ జరుగలేదు. శ్రీ నందలాల్ 1947లో ఢిల్లీలో జరిగిన ఆసియా సంబంధాల మహాసభ మండపా లంకరణను గూడ చేశారు. యూనియన్ ప్రభుత్వం భారత రాజ్యాంగ లిఖిత ప్రతిలో చిత్రాలు గీయ డానికి నందలాల్‌ను నియమించింది.

నందలాల్‌కు 1952 లో కాశీ విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేట్ బిరుదం ఇచ్చింది. విశ్వభారతి 1950 లో "దేశికోత్తమ" బిరుదం ఇచ్చింది. భారత ప్రభుత్వం 1955 లో "పద్మవిభూషణ్" బిరుదంతో గౌరవించింది.

శ్రీ నందలాల్‌బోస్ తన విశిష్టమైన శైలిని అనుసరించారు. కనుకనే ఆయన చిత్రాలు వ్యక్తి త్వాన్ని ప్రదర్శిస్తాయి. ఆయన తన చిత్ర రచనను వివిధ దేశ పద్ధతులతో కొనసాగించినా, జపాన్ పద్ధతిని విశేషంగా అనుసరించారు. వస్తువేమో భారతీయ పురాణేతిహాసాలనుంచి, ప్రకృతినుంచి గ్రహించారు. ఆయన ప్రకృతి చిత్రాలు కొన్ని చాల హృదయాకర్షకంగా ఉంటాయి. వాటిలో ఆయనకు గల ప్రకృతి సాన్నిహిత్యం, అవగాహన తేటపడుతాయి.

ఏ కళాకారుని ప్రభావమైనా, ముఖ్యంగా ఏ చిత్రకారుని ప్రభావమైనా ఎంతవరకు సమకాలి కులపై పడిందో చెప్పడం కష్టం. కాని శ్రీ నందలాల్ ప్రభావంమాత్రం బెంగాల్‌లోని పాత చిత్రకారులపై మాత్రమేకాక, శాంతినికేతన్‌లోవుండి అసంఖ్యాక విద్యార్థులకు కళను నేర్పడం మూలంగా దేశమంతా వ్యాప్తమైందని పలువురు విమర్శకులు అంటున్నారు. పాలక జాతిది ప్రతిదీ గొప్పదనే వ్యామోహం పుస్తకాలంలో ఆయన భారతీయ కళా రంగ పునరుద్ధరణకు పూనుకొనడంఆయన గొప్పతనానికి తర్కాణం. ఆయన వేయి చిత్రాలకుపైగా గీశారు.

---

## లేఖలు :

# శ్రీశ్రీ వ్యాసావళిలో 'సుందరకాండం'

ఆర్యా,

'శ్రీశ్రీ వ్యాసావళి' అన్న పుస్తకాన్ని సమీక్షిస్తూ, అందులోని 'సుందరకాండము—ఛందస్సౌందర్యము' అన్న వ్యాసంలో విశ్వనాథవారు కల్పవృక్షములోని సుందరకాండములో పోషించిన ఛందస్సు ఔచిత్యాన్ని రచయిత వివరించారని 'సుదర్శన్' రాసారు. పై వ్యాసావళిని నేను చదవలేదు కాబట్టి, వారు ఈ విషయం తెలుపగానే సంతోషించాను. అయితే మహాకవుల ప్రసక్తి ప్రయత్న పూర్వకంగా తెచ్చి, వెంటనే విశ్వనాథవారిని ప్రస్తావించి, వారు తెలిసి తెలిసీ సౌందర్యాపేక్షతో ఆ పని చేసిఉంటారని వూహించటం విచారకరం. అంటే విశ్వనాథ మహాకవికాడు అనియేనా? 'శిల్పం ఆవశ్యకమే అయినా, అది ఒక్కటే కవిత్వానికి పర్యాయపదం కాజాలదు. కళకు శిల్పం ఉపాంగం మాత్రమే' నన్నారు. విశ్వనాథవారి రచనలో మటుకు ఈవిధంగా భాసించలేదని 'సుదర్శన్'గారి మతమా?

పైగా 'ఎక్కువగా బుద్ధి వ్యాపార ఫలమై నందున' అన్నారు. నాకు ఇది సరిగా బోధపడలేదు. విశ్వనాథవారి కల్పవృక్షము వ్యాపారసరళిలో వ్రాసిన కావ్యమనా? కాదు. అది వారు 'తండ్రి యాజ్ఞయును జీవుని వేదన ఏకమై' చేసిన రచన. 'తలచిన రామునే తలచెద నేనును, నా భక్తి రచనలు నావి గాన' అని ఆయన అన్నారు. పైగా ఇంకొకచోట ''ఇది మెచ్చెదరో, మెచ్చరో, యిదియును జదివెదరు, జదువరేలా నా కయ్యది?'' అన్నారు. లోకుల మెప్పుదలతో ప్రసకి లేనివారికి వ్యాపారసరళిలో వ్రాయునవసరమేలేదు.

—పి. శివరామకృష్ణ.

## జవాబు

1966 ఏప్రిల్‌నెల 'భారతి'లో శ్రీశ్రీ వ్యాసావళి' సమీక్ష విషయమై నామాటలు కొన్ని—ఉద్దేశాల నటుంచి—శ్రీ పి. శివరామకృష్ణగారికి సరిగా బోధపడినట్లులేదు.

సుందరకాండలో ఛందస్సౌందర్యం గురించి శ్రీశ్రీ ఎంతో సహృదయతతోటి రాసిన వ్యాసాన్ని సమీక్షిస్తూ, పూర్వ మహాకవుల శిల్పమార్గాన్ని నేను ప్రసావించాను. పూర్వాపరాలను స్పృశించడం సమీక్షలో అక్రమమేమీకాదు. అలా సమీక్షించడం ఇప్పటి కవులను కించబరచడానికి కానేకాదు. తారతమ్య దృష్టి కూడాకాదు. ఈ వ్యాసాన్ని సమీక్షిస్తూ నేను 'ప్రయత్న పూర్వకంగా' పూర్వ మహా కవుల విషయాన్ని లేవనెత్తానని శివరామకృష్ణగారనటం అన్యాయం. పోలికలూ భేదాలూ చూపే పద్ధతి విమర్శలో ఉంటుంది.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు 'మహాకవికాదు అనియేనా?' ఆ మాట నే ననలేదు. మహాకవుల గుణగణాలనుగూర్చి యోగ్యతలనుగూర్చి లోకంలో పలు అభిప్రాయాలున్నాయి. విశ్వనాథవారు ఈ కాలపు కవులలో చాల గొప్పవారని నేను తీర్పు చెప్పవలసిన పనిలేదు. శివరామకృష్ణవంటివారు కూడా అలాంటి తీర్పును ఇతరులపై విధించడం సరికాదు.

కళకు, శిల్పానికి ఉన్న సంబంధం గురించి నా అభిప్రాయాలు సమీక్షలోనే తెలిపాను. శిల్పం సార్థకమై, సఫలంకావలెనంటే, అది కొట్టవచ్చినంతగా ప్రముఖమై కంటినిగాని చెవినిగాని భాధించకూడదనుకుంటాను. కావ్యానికి వెలిగా శిల్పమేదో ఉన్నదని

అనిపించనిదేదో అదే ఉత్తమమైన మార్గం అనవలసి ఉంటుంది. ఈ దృక్పథంనుండిచూసే వాల్మీకి గొప్ప శిల్పి. నన్నయ గొప్ప శిల్పి. వస్తువూ రీతీ ఒండొంటితో కలగలిసి వేర్పరచ వీలులేనట్లు ఒదిగి మెదిగి పోవాలి. శిల్పం కోసమే శిల్పమనే వాదంవల్ల, శిల్పానికిగల ప్రయోజనమే పవర్మోతుందేమో! విశ్వనాథవారు ఏ కోవకు చెందుతారో నిర్ణయించే అధికారం నాకులేదు. తిక్కన స్త్రీపర్వంలోవలె, ఇక్కడ సుందరకాండలో ఔచిత్యదృష్టితోనే వివిధ ఛందస్సులను విశ్వనాథవారు ప్రయోగించి ఉండవచ్చు. ప్రయత్న పూర్వకమైన పనికీ సహజ సులభమైన పనికీ తేడా ఉంటుంది. కావలసింది కవిత్వంలో ముఖ్యంగా ఈ సహజత్వం (Spontaniety.)

''బుద్ధి వ్యాపార ఫల''మని నే నన్నమాటలకు ఇంత విపరీతార్థం తీయవచ్చునని నే ననుకోలేదు. ఇంద్రియ వ్యాపారం, బుద్ధివ్యాపారం, హృదయవ్యాపారం —ఈ వ్యాపారాలకూ బజారువ్యాపారానికీ సంబంధమే లేదు. విశ్వనాథవారి మహాకవి హెూదామీద నేను దాడి చేస్తున్నాననుకొన్నారేమో. ''వ్యాపార సరళిలో'' వారీ మహాకావ్యాన్ని రచించినటు మీరు భావిస్తున్నారా అని అడుగుతున్నారు శివరామకృష్ణ గారు. రామ రామ! నా ఉద్దేశం మీరాపాదిస్తున్నదానికి పూర్తిగా భిన్నమండీ, శివరామకృష్ణగారూ! హృదయాన్నీ, బుద్ధినీ వేర్పరచడం సరికాదేమోగాని, ఒక్కొక్క రచనలో ఎక్కువగా ఉద్రేకాంశ, లేదా ఆలోచనాంశ (Emotion and thought) ఉండవచ్చు. కవిత్వానికి హృదయ వ్యాపారం ప్రధానమని అందరూ అనుకొనేదే. బుద్ధి వ్యాపారం హృదయవ్యాపారాన్ని కిందికి నెట్టివేసేటంతమేరకు, ఏ కావ్యమైనా సహానుభూతిని కలిగించడంలో విఫలం కాకపోదు. విశ్వనాథవారి రామాయణ కల్పవృక్షం అలాంటిదో కాదో చెప్పవలసినవారు నాకంటె యోగ్యులెందరో ఉన్నారు.

—సుదర్శన్.

## జనని సమస్త భాషలకు

ఆర్యా!

'ప్రియులు' నెల భారతిలో శ్రీ ఉలి రామసుబ్బయ్యగారు వ్రాసిన లేఖను చూచితిని. 'భారతి' పత్రికను పాఠకులు శ్రద్ధతో చదువుచున్నందులకు నేనెంతో ఆనందించుచున్నాను. వారు కోరిన రీతిని 'జనని సమస్త భాషలకు' అన్న పద్యానికి సరియైన పాఠము—ఈ క్రింద తెలుపుచున్నాను.

జనని సమస్త భాషలకు సంస్కృత
భాష ధరాతలంబునన్
ఘన లలితార్థ గౌరవ వికాసి
తెలుంగ గభీరమ్య మంతకున్
గనుఁగొనఁ జాత బీజమునకంటెను
గోమల పత్త్రపుష్ప శో
భన మృదు పల్లవాభినవ బాల
రసాలము సొంపునింపదే.

విద్వాంసులను పై పద్య భావమును విశదీకరింప గోరుచున్నాను.

—నిడుదవోలు వెంకటరావు.

---

# గ్రంథ విమర్శలు

## విజయముద్ర

(1962—63 సం॥లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతి నందిన వీరరసకావ్యం. కర్త: శ్రీ గాడేపల్లి కుక్కుటేశ్వరరావు. ప్రచురణ: శ్రీ ఆర్.బి.పెండ్యాల. రాజమండ్రి ప్రైవేట్స్ పబ్లికేషన్స్, రాజమండ్రి—2. ప్రతులకు:—శ్రీమతి జి. సుగుణ 2/38 జార్జిపేట, అనంతపురం. పేజీలు, 157. వెల రూ: 3)

పురుషోత్తముడు అలగ్జాండరుతో చేసిన యుద్ధం, తత్పూర్వరంగం, ఈ కావ్యేతివృత్తం. (కావ్య రచనా కాలానికివుందు చైనా భారతదేశంమీద దండెత్తి ంది). ఈయుద్ధంలో జితుడెవడూ పరాజితడెవడూ అన్నది (వాస్తవానికి దూరంగా జరిగిన వ్రాతలనుంచి సత్యం గ్రహించగా, అప్పైన) వాదోపవాదాలకు ఆస్పదమయిన చారిత్రకవిషయం. భారతదేశ చరిత్రను ఆంగ్ల చరిత్రకారులు లిఖించారు. ఆ వ్రాతలే భారతీయులకు చరిత్రలూ, చారిత్రకాధారాలూ అయ్యాయి.

పురుషోత్తముడు యుద్ధంలో జయించాడనీ, పోనీ, కనీసం ఓడిపోలేదనీ, భారత దేశీయులకు నమ్మకం. ఆ విశ్వాస విషయ సమర్థనకు సమర్థమైన సాక్షి సంపన్నాలు పూర్తిగా సమకూర్చుకోనలేదు. సమ్యక్ సత్య దర్శనార్థం, ఆ ఆంగ చరిత్రకారుల గ్రంథాంతర్గత సత్యాలే సమారాధ్యాలయ్యాయి.

విజయలక్ష్మి విలసితుడైన పురుషోత్తముని చరిత్ర, భారతీయ భాషలు పెక్కింటిలో పలు ప్రక్రియలలో కవులూ రచయితలూ స్తుతించారు. ఆ వస్తువే గౌరవంవల్ల ఈ కవికీ స్వీకార్యమయింది. ఆంధ్ర కవులూ, రచయితలూ, ఈ వస్తువు గ్రహించినవారు, ఎవరూ దర్శింపని చారిత్రకసత్యం ముద్రికలు. విజయముద్రకర్త ఆ ముద్రికలు దర్శించి అవి అలా తయారు కావటానికి కారణం, పురుషోత్తముని విజయమేనని భావించిన ఫలితమే కావ్యం. ఆ వూహ సముచితంగా సరసంగా ఉంది. ఆ ముద్రికల బొమ్మలు — రెండు వైపులవి— Vincent A. Smith వ్రాసిన The Oxford History of India (ఇది 1923 సం.పు Edition) Page 63 లో Poros (పురుషోత్తముడు) Medal అనే పేరుతో ముద్రించబడి వున్నాయి. విజయముద్రలోని ప్రాథమికమైన చారిత్రక విషయాలకు ఈ గ్రంథం ఆధారం. ఇటువంటి ముఖ్యమైన విషయం చెప్పటం ఎంతైనా అవసరం. అయితే కావ్యాదినున్న 'మనవి'లో అది చెప్పబడలేదు.

ఇక మిగతా కథ అంద రెరిగినదే! నిర్వహణ విధానం ఎలావున్నా, కథా విభజన బాగుంది. కావ్యమాద్యంతం పురువీరులలోనో, పర వీరులలోనో, వీరత్వం బాహాటంగా కనిపిస్తుంది. అది చేతలలో కంటే మాటలలో అధికంగా ప్రస్ఫుటమవుతుంది. మరొక్క సుగుణం. భారతీయ వీరులలోనూ, గ్రీకు వీరులలోనూ, మానవత్వం వీరోచితత్వం కనిపిస్తాయి. ఇరుతెరగులతెగలవారు, ఎదుటి వీరుడిలోని ఔన్నత్యం, వైరి వీరుడి లోని సామర్థ్యానికి ముగ్ధత నొందే ఉన్నత వీరత్వం గలవారు. అయితే పురుషోత్తముని కుమారుడు తండ్రి ఆజ్ఞమేరకు అలగ్జాండరును చంపకుండా బందీ చేయాలనే తలంపుతో యుద్ధం చేస్తుంటే పలువురొక్కపై, అమానుషంగా, యుద్ధ ధర్మానికి వ్యతిరేకంగా, అభిమన్యుణ్ణి (గురుతుకు రాకతప్పదు) చంపినట్లు చంపటం చూస్తే, మానవతామూర్తిగా కనిపించేఅలగ్జాండరులో ఆ క్షణాన దానవత్వం సాక్షాత్కారమవు

తుంది. అందుకే ఆ అలెగ్జాండరు, ("The greates general in the history of the world— Vincent A. Smith. The Oxford History of India) పురుషోత్తముడి దయాభిక్షవల్ల బ్రతికి పోవటం జరిగిందనేది కవితాసత్యం.

కల్పనా చమత్కృతి విషయంలో సామర్థ్యం మాట కాదు గానీ, జాగ్రత, నేర్పు, గమనార్హంగా ఉన్నాయి. యుద్ధం చేయటంకంటే, యుద్ధ ప్రయత్నాలు బాగున్నాయి. గ్రీకు సైన్యాలు అర్ధరాత్రి జీలంనది దాటటం కళ్లకు కట్టినట్లు కనిపిస్తుంది. కొన్నితావుల్లో భావపుష్టి కవితాంతర్యాలు స్ఫురింపచింది. వ్యక్తుల రూపురేఖలు, రాయబారి నేర్పు చూపే సమయంలో కవి లోతులు సందర్శించినట్లే!

భాష సలక్షణంగావుంది. భాషా విషయికమైన పట్టుదల కనిపిస్తుంది. వ్యాకరణం పరిధిలోకి రాని పదాలు ప్రయోగింపకూడదనే దీక్ష గోచరమవుతుంది. అది హర్షింపదగిన విషయం. అయినా మూడు విధాల దోషాలు ఎనిమిది తొమ్మిది ఎదురవుతాయి. అంతేకాదు. కావ్యంలో అర్థానుస్వారం, శకటరేఫ ఆదరింపబడ్డాయి. అవి ఆధునిక కవితనుంచి వైదొలగిపోయి చాలాకాలమయింది. అయినా ఇందులో ఉన్నాయి. ఉండవలసిన అన్ని తావులలోనూలేవు. ఉన్నవి మాత్రం ఉండవలసిన చోట్లలోనే ఉన్నాయి. సిద్ధసాధ్యార్థానుస్వారం పలుతావుల్లో లోపించింది. శకటరేఫ కూడా అంతే! స్థూలంగా చెబితే, భాష సలక్షణంగా, గంభీరంగా అర్థస్పష్టతతోవుంది.

ధారాశుద్ధి విశిష్టమైన లక్షణం. అది ఎక్కడో తప్ప ఎల్లెడలా నిరాఘాటంగా సాగింది. శైలిలో సమతలేకపోయినా, స్పష్టతవుంది. పద్యాల నడకలో బడి భాష సంకోచ వ్యాకోచాలు పొందింది. ఛందస్సు సాంప్రదాయికంగావుంది.

స్వీకరించిన వస్తువు వ్యాకరించుకొనటంలో ఏ యే అంశం ఎంతవరకు వ్రాయవచ్చో, ఎంతవరకు వ్రాస్తే రసౌచితి ఉంటుందో అని నిర యించుకొనటంలో రచనలో వ్యర్థపదాలు, వ్యర్థవాక్యాలు అనవసర సంఘటనలు తొలగించుకొనటంలో కథానుగుణంగా ఏర్పడ్డ పాత్రల ప్రయోజనం స్పష్టంగా, బద్ధ విరూపితార్థ మేర్పడ గుర్తించి, వాటి మనోవాక్కాయ కర్మల పరిధి పరిశీలించి, ఔచిత్యానికి లోపం రాకుండా పాత్ర సృష్టి చేసుకొనటంలో, సంఘటనల తీరుతెన్నులు, వాటి బలం, కథకు సంఘటనకు ఉన్న సంబంధం, ప్రాముఖ్యం, కూలంకషంగా భావించుకొనటంలో; స్థాయీ భావాన్ని రసస్థాయికి నడిపించటంలో జాగ్రత వహించి, ఆకళించుకొని, రచన చేస్తే, ఆవేశం, చక్కనిధారాశుద్ధి, భాషాపటిమ, భావపుష్టి ఉన్న ఈ కవి ఇంతకంటే ఉత్తమ కావ్య రచనచేసే అవకాశం ఉందని ఆశింపవచ్చు.

"—మనోరాణి"

## ఋతుసంహారం

రచయిత : శ్రీ రేవూరు సుబ్బారావు. పుటలు: డెమ్మి 46. వెల రు. 1—50. ప్రాప్తిస్థానం: శ్రీ రేవూరి సుబ్బారావు, C/o శ్రీ బుడమగుంట సుబ్రహ్మణ్యం, 16/114, ట్రంకురోడ్డు, నెల్లూరు.

## సాహితీసుమాలు

23 గద్యపద్య, సంస్కృతశ్లోక రచనల సంపుటి. ప్రచురణ : సాహిత్యాభివర్ధినీసంఘం, చీరాల. పుటలు : 62. వెల : 75 పైసలు. దీనికి శ్రీ పళ్లె పూర్ణప్రజ్ఞాచార్యులు పీఠిక వ్రాశారు.

ఉపయోగకరమైన
సరిక్రొత్త గ్రంథములు

వ్యవసాయము — ఫిషరి — కోళ్లు ... —
తోట పని — యింజనీరింగ్ — వైద్య ...
విషయములపై గ్రంథములు గలవు. కేటలాగు ...
ఇంగ్లీషులో వ్రాయండి :

N. K. PAUL & SONS,
P. B. No. 12202, Calcutta—5.

## ఉలిపికట్టె

నాటిక. రచయిత: శ్రీ అవుల శ్రీనివాస రావు. పుటలు 32. వెల రూ. 1—50. ప్రాప్తి స్థానం: పద్మావతీ పబ్లికేషన్స్, 339 గిడంగి వీధి, నెల్లూరు.

## శ్రీసాయీకృష్ణ స్తోత్రనక్షత్రమాల

పద్యకృతి. రచయిత: శ్రీ పంచాంగం సీనప్ప. పుటలు 20. వెల తెలియదు. ప్రాప్తిస్థానం: శ్రీ పంచాంగం సీనప్ప, పాలసముద్రం, హిందూపురం తాలూకా, అనంతపురంజిల్లా.

## శంభు శతకము

రచయిత: కొత్త అగ్రహారవాస్తవ్యులైన కీ. శే. బుర్రా నరసింహశర్మ. పుటలు 32. వెల 0—30. ప్రాప్తిస్థానం: శ్రీ బుర్రా సన్యాసిరావు, గ్రంథ ప్రకాశకులు, కలకత్తా.

## మమత, జైహింద్

రెండు నాటికలు. రచయిత: శ్రీ పసునూర్తి వేణుగోపాలరావు. పుటలు 44. వెల: రూ 1—00. ప్రాప్తి స్థానం: నవోదయ పబ్లిషర్స్, విజయవాడ—2.

## సింహాశైలాలయ శతకం

రచయిత: కీ. శే. బుర్రా నరసింహశర్మ. పుటలు: 34. వెల: 0—30. ప్రాప్తిస్థానం: బుర్రా సన్యాసిరావు, గ్రంథ ప్రకాశకులు, కలకత్తా.

## నివేదన

గీతికల సంపుటి. రచయిత: శ్రీ బాలాంత్రపు నళినీకాంతరావు. పుటలు: 160. వెల: 3—50 ప్రచురణ: ఆంధ్ర మహిళాసభ, మద్రాసు—4.

## జమీన్ రైతు పరాభవ ఉగాది సంచిక

శ్రీయుతులు వేదం వెంకటరాయశాస్త్రి (మా తాతగారు), కె. వి. రమణారెడ్డి (తొలిభావ కవి), సంజీవ దేవ్ (అతిథిపాత్ర), టి. వి. ఎస్. శర్మ (చిత్ర నిర్మాణంలో కళా దర్శకుని ప్రముఖపాత్ర), అప్పజోడు వెంకటసుబ్బయ్య (నా చిన్నతనంలో ఉగాది), సోమ రాజుపల్లి చెంచయ్య (శ్రద్ధాంజలి) మొదలయినవారి 29 వ్యాసాలు, శ్రీ హెచ్. వి. రామగోపాల్ చిత్రాలు, శ్రీయుతులు పైడిరాజు, ఆర్. వి. చిన్నారావు, ఖండవిల్లి శేషగిరిరావుగార్ల చిత్రాలు, పెక్కు ఫోటోలు, వ్యంగ్య చిత్రాలుగల ప్రత్యేక సంచిక మా కార్యాలయం చేరింది. పుటలు 1/4 డెమ్మీ 154. వెల: రూ. 1—00 ప్రాప్తిస్థానం: జమీన్ రైతు కార్యాలయం, 170, తిప్పరాజువారివీధి, నెల్లూరు.

---

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna at The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1
Editor: S. Sambhu Prasad.